## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శిల్పాగమచంద్రచాంద్రి

రచన

డా॥ పెదపాటి నాగేశ్వరరావు

ఎం.ఏ.పి.హెచ్.డి.

తిరుమల తిరుపతిదేవస్థానమువారి

పాక్షిక ఆర్థిక సహాయముతో

ప్రకటితము - 2000

# కృతజ్ఞతలు

ఇది

తెలుగు విశ్వవిద్యాలయం

లలిత కళాపీఠం

ప్రథమ పిహెచ్.డి. థీసిస్‌గా

శిల్పశాఖలో

పూచిన పుష్పంలోని

సౌరభం

దీనికి దోహదం చేసిన

విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు

పద్మభూషణ

డా॥ సి. నారాయణరెడ్డి

డా॥ పేర్వారం జగన్నాథం

డా॥ యల్లా వెంకటేశ్వరరావు

(డీన్ : లలితకళా పీఠం) గార్లకు

మార్గదర్శనం చేసిన

శ్రీ గడియారం రామకృష్ణ శర్మ.,

డా॥ యం.వి. శాస్త్రి గార్లకు

# అధ్యాయం : 1

## సంస్కృతి : ఒక నిర్వచనం

1.01 "సంస్కృతి : నాగరికత"
(సూ. ఆం. నిఘంటువు)

1.02 "సహనమే సంస్కృతి"
(డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్)

1.03 "సంస్కృతి : సంస్కారము"

1.04 సంస్కృతి అనే మాట ఇటీవలిది. ఇంగ్లీష్ లోని కల్చర్ అనే మాటకు బదులు ఇది మన దేశంలో వాడకంలోనున్నది. దీనిని పాశ్చాత్యులే అనేక విధాలుగా నిర్వచించారు. ఓస్వార్డ్‌స్పెంగ్లర్, క్రోసె విల్‌డ్యూ రాంట్ - టి.యస్ ఇలియట్, మాథ్యూ అర్నాల్డ్ - జాన్ కాపర్‌పలిస్ -అల్బర్ట్ స్విట్జర్ - డోర్నడికె. సి.ఇ. ఎంజోడ్ మొదలైన వారి అభిప్రాయాల సారాంశం ఇలా ఉంది.

"మన సంస్కృతి శబ్దానికి నామరూపాలు లేవు అదొక అనుభవం." (ఇలియట్)

తేడా అల్లా ఆలోచనాశక్తి లోనే. ఈ ఆలోచనా శక్తి పెరిగినందు వల్లనే మానవునిలో సంస్కృతి - నాగరికతలు పెరిగినవని చెప్పవచ్చు.

1.06 మానవుడు వేలాది సంవత్సరాలు ఘోరాంధకారంలో పయనించి ఎన్నెన్నో ఎగుడు దిగుడు మార్గాలు దాటి స్వాస్థ్య జీవనం ఏర్పరచుకొన్నాడు. ఇల్లు వాకిలి తోడు నీడ సంపాదించుకొని తిండి సంపాదనే ప్రధానంగా ఎన్నుకొని ప్రకృతిని జయిస్తూ ఎన్నెన్నో కష్టాలు పడుతూ జీవనం సాగించాడు. పాశవిక దశనుండి అప్పుడప్పుడే మేలుకొనడం ప్రారంభించాడు. వేట ప్రధాన వృత్తి గా కొన్ని యుగాలు సాగించాడు. కొన్నాళ్ళకు వ్యవసాయం మొదలెట్టాడు. ప్రకృతిని చూసి పులకరించుకొంటూ గానం చేశాడు. ఆ సమయానికి కండ బలమే, తిండి బలమే, ముఖ్యమని ఉవ్విళ్లూరాడు.

1.07 కొంత కాలానికి తార్కిక దృష్టి పెరిగింది. ఆనందానికి సాధనాలు వెదకడం మొదలు పెట్టాడు. పద్యం, పాట, నాటకం వెలిశాయి. నలుగుర్ని కలుపు కొని నడవడం, సామాజిక చైతన్యం మొదలైన విషయాలు పెరిగాయి. మునుపటి ప్రకృత్యారాధన తగ్గింది. నమ్మకాలు సడిలాయి. వ్యక్తిత్వం పెంచు కొని వీరత్వం వైపు మొగ్గు చూపడం, మొదలైంది. వర్గాలు పెరగడం ఆరంభ మైంది. కట్టు కథల ప్రాబల్యం తగ్గింది.

1.08 మరికొన్నాళ్ళకు మానవుని జీవన రేఖికలు వికసింపజొచ్చాయి. సుఖ జీవనం పారం చేరడం మొదలైంది. అలాగే సుఖజీవనాన్ని చాలా దగ్గరగా పొందడంతన చుట్టూ ఉన్న ప్రకృతితో ఆనందించడం. తాను నేర్చిన దానికి అందచందాలు దిద్దడం తనను గురించి విమర్శించుకోవడం మొదలైంది. బహిర్యజ్ఞం కన్నా అంతరంగ యజ్ఞమే గొప్పదనే స్థితిని కనుగొన్నాడు. భౌతిక, ప్రాకృతిక శక్తుల్ని జయించడమూ, ఆయా శక్తుల తౌలినిక విశేషాల్ని కనిపెట్టడమూ ప్రారంభించాడు. సమాజాన్ని సమానంగా నడిపించాలనే దృష్టి పెరిగింది.

ఇలాంటి దశల్ని చారిత్రకంగా బేరీజు వేస్తే మొదటి దశ క్రీ.పూ. 6000 సం.

ప్రాంతంలో ప్రారంభమై క్రీ.పూ. 2000 సం. వరకూ సాగిందనీ

రెండవ దశ క్రీ.శ. 2000 సం. లో ప్రారంభమై క్రీ.శ. 700 సం. వరకూ సాగిందనీ

మూడవ దశ క్రీ.శ. 700 సం. తర్వాత నుండి ప్రారంభమై యింకా సాగుతూ ఉన్నదనీ వివరించడం జరిగింది.

1..09 ఇలా మానవ చరిత్రలో ఉన్న దశావిభేదం వలన అన్ని దేశాల జీవన విధానంలోనూ ఆలోచనా విధానంలోను సామ్యత, తుల్యత గోచరిస్తుంది.

ఉదాహరణకు మన పూర్వులుద్యౌస్‌పితరుడ్ని ప్రధానంగా చూస్తే ఈజిప్టు వారు బాబిలోనియా వారూ 'నూ' అనే దేవతను పూజించేవారు. అలాగే చైనా వారు 'తియన్' అనే దేవతను పూజించేవారు. పేర్లు వేరుగా ఉన్నా నిజానికి వీరంతా ఆకాశదేవతలే!

1.10. ఇలా మనం తౌలనిక దృష్టితో ప్రాచ్య ప్రాశ్చాత్య భావాల్ని బేరీజు వేసుకొంటూ పోతే అసలు భౌగోళికమైన విభేదాలు తప్ప మానవునిలో ఉన్నదంతా ఒకటే అనే స్థితి కలగక మానదు. అప్పుడు ఈ మానవ సమాజాన్ని నడిపిచిన శక్తినే సంస్కృతి లేక నాగరికత అనే పదాలతో నిర్వచనం చేయవచ్చు. మానవుని చరిత్ర - కళ - జీవనం మొదలైనవన్నీ సంస్కృతిలోనివే అవుతాయి.

---

## సందర్భ గ్రంథములు


1. చరిత్ర మరియు సంస్కృతి - జేమ్స్ రిట్చట్

2. ఆంధ్రుల చరిత్రే సంస్కృతి - ఖండవల్లి బాలేందు శేఖరం

3. ఆంధ్రుల చరిత్ర - ఏటుకూరి బలరామమూర్తి

4. భారతీయ చరిత్ర, సంస్కృతి - ఆర్. సి. మజుందార్

# అధ్యాయం : 2

## సంస్కృతి : ఒక నిర్వచనం

2.01 మొదట మానవుడు ఏకాంతంగా ఏ కొండ గుహలోనో జంతువులతో సమానంగా ఉంటూ అరణ్యాలలో కాలం గడిపాడు. కొంత కాలానికి ఒంటరి తనం నుండి జంటను వెతుక్కున్నాడు. జంటతో కుటుంబీకుడైనాడు. కొన్ని కుటుంబాలు కలిసి పల్లె అయింది. కొన్ని పల్లెలు కలిసి పట్టణం అయింది. కొన్ని పట్టణాలు కలిసి ప్రాంతం అయింది. కొన్ని ప్రాంతాలు కలిసి రాష్ట్రం అయింది. కొన్ని రాష్ట్రాలు కలిసి దేశం అయింది. కొన్ని దేశాలు కలిసి ఖండం అయింది. కొన్ని ఖండాలతో కలిసి ప్రపంచంగా అయింది, అన్న చరిత్ర సంగతి అందరికీ తెలిసిన విషయమే!

2.02. ప్రపంచ మనగానే వివిధ దేశాలు భాషలు గల బిలబిలమనే మానవ సమాజం మనకు గోచరిస్తుంది. వివిధ రంగుల మనుష్యులు వివిధ వేషాలతో వివిధ భాషలతో, వివిధ మతాలతో, వివిధ ఆహార వ్యవహారాలతో ఉన్నప్పటికీ వీరందరి మధ్యా ఒక సామాన్య లక్షణం మనకు గోచరిస్తుంది.

2.03 ఒక దేశంలో దొరకే వస్తువులు వేరొక దేశంలో దొరకక పోవడం, ఒక దశంలో ఉండే ప్రాకృతిక సంపద వేరొక దేశంలో లేకపోవడం లాంటి సందర్భాలలో తప్పకుండా ఆయా ప్రాంతాలు మరో ప్రాంతంపై ఆధారపడి జీవించవలసి వస్తుంది.

2.04 అలా ప్రారంభమైన సహజీవనం మాత్రం ప్రపంచ మానవుల సామాజిక జీవనానికి ఆధారభూతమైంది. కాల క్రమేణ జీవన సంస్కృతి వికసించింది. మానవుడు ఎన్నో రకాల ప్రాకృతిక పరీక్షల్ని దాటి వైజ్ఞానికంగా ఎదిగాడు. వెనుదిరిగి చూచాడు. ఎంతో కథ ఉన్న సంగతి గుర్తించాడు. దాన్ని గ్రంథస్థం చేయ మొదలెట్టాడు. "చరిత్ర" చేశాడు.

1. అతి ప్రాచీన కాలంలో శిలల మధ్య నివసించిన కాలం చరిత్రకు పాతరాతి యుగమని

తరువాతి కాలంలో శిలల మధ్య నివసించిన చరిత్రకు క్రొత్తరాతి యుగమనీ పేరు పెట్టాడు.

అంతకాలం శిలల మధ్య నివసించిన మానవుడు శిలల్ని ఎలా వాడాలో నేర్చుకొని శిల్పి అయిన సంగతి వేరే చెప్పాలా! ఐతేనాటి మానవుడు నేడు మనమనుకొనేంత సంకుచిత భావంతో యిమిడేశిల్పి మాత్రం గాడు.

2.05 కొంత కాలం గడిచిన తర్వాత శిల అంత కఠిన పదార్థాన్ని గాక మెత్తని వాటి కోసం పరిశోధన సాగించి జీవన యాత్రలో క్రొత్త మజిలీలు స్థాపించడం మొదలు పెట్టాడు. ఎన్నో శాస్త్రీయ పరిశోధనలతో ముందడుగు వేస్తున్నాడు. కాని తన చరిత్రలో ముఖ్యస్థానం వహించిన శిల్పాన్ని మరవగలడా?

అనంత నామరూపాలతో అతివేగంగా పెరిగిన యీ విశ్వసంస్కృతిలో శిల్పం పాత్ర ఏమిటి? అనే ప్రశ్న ప్రతి విద్యార్థికీ ఎదురౌతుంది. దాని సమాధానమే యీ వ్యాసంలోని యీ ఖండిక సారాంశం.

2.06 1.ప్రతి దేశానికీ ఒక జెండా ఉంటుంది. అది ఆ దేశపు శిల్పమే!

2. ప్రతి దేశానికి ఒక రాజు, రాజుకు ఒక రాజ ముద్రిక ఉంటుంది. అది ఆదేశపు శిల్పమే!

3. ప్రతి దేశానికి ఒక జాతీయ చిహ్నం ఉంటుంది. అది ఆ దేశపు శిల్పమే!

4. ప్రతి దేశానికి ఒక రాజ మకుటం ఉంటుంది. అది ఆ దేశపు శిల్పమే!

5. ప్రతి దేశానికీ ఒక రాజ సింహాసనం ఉంటుంది. అది ఆ దేశపు శిల్పమే!

6. ప్రతి దేశానికి ఆ దేశపు ప్రజలకు ఒక విలక్షణ వేషధారణ ఉంటుంది. అదీ ఆ దేశపు శిల్పమే!

7. ప్రతి దేశంలోనూ ప్రజలకు ఒక విధమైన ఆభూషణ విశేషం ఉంటుంది. అదీ ఆ దేశపు శిల్ప విన్యాసం క్రిందనే లెక్కింపబడుతుంది. 8. ప్రతి దేశం లోనూ ప్రజలకు నివాసానికి గృహాలుంటాయి. అవి ఆయా దేశాల శీతోష్ణ పరిస్థితుల ననుసరించి వివిధ రూపాయలు, వివిధ రీతుల్లో ఉంటాయి అదీ ఆ దేశపు శిల్పశైలిగానే పరిగణింపబడుతుంది. 9. ప్రతి దేశంలోనూ రోడ్లు-భవనాలు।వంతెనలు

మొదలైనవి వుంటాయి. అవన్నీ ఆయా దేశాల భౌతిక శిల్ప సంపదగానే పరిగణింపబడతాయి.

10. వీటన్నిటికన్నా మరొక ముఖ్యమైనది ఉంది. అది ఆ దేశపు నాణెం. ఈ నాణెల మీద ఆ దేశపు రాజముద్రిక ధన/కోశాగార ముద్రలుంటాయి. అవీ శిల్పాలే. ఉదాహరణకు మన రూపాయి బిళ్లా, రూపాయి నోట్లు చూడండి ఆశోక చక్రవర్తి కాలంలో ఆ అమరశిల్పి కల్పనల్లోంచి దూసుకొచ్చిన గంభీర సింహాలు మనకు ప్రత్యక్షమౌతాయి.

అలాగే ప్రతి దేశపు నాణేల మీదా ఆయా దేశాల కళాసంపదకు సంబంధించిన ముద్రికలుంటాయి. ఎందువలన? ఈ కళాసంపద ఆ దేశపు నిజమైన చెరిగిపోని సొత్తు గనక, ఒక రాజ్యం మరో రాజ కళాసంపదను తన నాణేల మీదికీ రాజపత్రాల మీదికీ రాజ ముద్రికల మీదికీ తీసుకోదు. ఎందుకో తెలుసా? అవి ప్రత్యేకంగా ఆయా దేశాల సొత్తులుగా ప్రపంచ వ్యాప్తమైన కీర్తి ప్రతిష్ఠలు పొందాయి గనుక.

2.07 కనుక ప్రతిదేశంలోనూ శిల్పం అనేది ఆ దేశపు

1. జెండా, 2. ముద్రిక, 3. సింహాసనం, 4. నాణెం/నోటు, 5. రాజపత్రం, 6. అస్త్రం, 7. వస్త్రం, 8. భూషణం, 9. కళాఖండం, 10. రాజనివాసం, 11. ప్రజా నివాసాలపై విరాజిల్లుతుంటుంది. దీనివల్ల శిల్పం విశ్వవ్యాప్తమైన కళ అనీ దాన్ని మానవుడు తన జీవితంలో ప్రతి మలుపులోనూ వినియోగించుకొని ఆనందిస్తున్నాడనీ చెప్పవచ్చు.

2.08 ప్రపంచ మానవ చరిత్రకి శిల్పం చాలా దోహదం చేసింది అనడానికి యీ నాటికీ నిలిచి ఉన్న అపూర్వ కళా ఖండాల ప్రశస్తిని గుర్తు చేయవలసి వస్తుంది. వాటిని మానవుడు చేసిన గొప్ప కళాఖండాలని మాత్రమే గాక అత్యద్భుతాలని కీర్తించడం గుర్తు పెట్టుకోవలసిన విషయం. అవన్నీ మన పూర్వుల శిల్పకల్పనలే। అవన్నీ వారి ఘనీభూత ఘర్మజల బిందువులే.

తాజమహలు నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు? అని పాడాడో మహాకవి! ముంతాజ్ బేగం సౌందర్యానుభూతికి ఈ రాజ్యం ఆజ్యంలే అనుకొన్నాడొక రాజు. మానవ సౌందర్యాన్ని రాతిలో చూపించమని వాపోయాడొరాజు. భగవత్ సౌందర్యాన్నే

చూసి తరించిన యమున ఎన్ని సౌందర్యాల్ని చూచిందో! ఇవన్నీ భారతీయ మహర్షులు తరతరాలుగాఆలోచించి ఆనందించి విశ్వ మానవకోటికి పంచి పెట్టినవే! వాటిని ప్రపంచ చరిత్రలో చూపించి మన వాళ్ళ గొప్పకు నివాళి పట్టడం అవసరం.

ఎందరెందరో చరిత్ర కారులు వివిధ దేశాల భూగర్భాలలో అణిగి మాటు మణిగిపోయిన సంపదను గుర్తిస్తూ పోయి అన్ని సంపదల కన్నా శిల్ప సంపదే మిన్న అని తేల్చి చెప్పారు. ఏ దేశ చరిత్రకైనా రాళ్ళు రప్పలేకొలరాళ్లని వెల్లడించారు.

2.09 అలా కీర్తింపబడిన వాటిలో ప్రాచీనమైన ప్రపంచ మహాద్భుతాలు ఏడని గుర్తించారు. అవన్నీ చారిత్రక దృష్టితో గొప్పవని కీర్తింపబడుతున్నా వాటిలో నిక్షిప్తమైన శిల్పశక్తి గొప్పదని యీ వ్యాసం వెల్లడిస్తుంది వాటి సంక్షిప్త వివరాలుచూడడండి.

1. బాబిలోన్ దేశంలో వ్రేలాడే వనాలు

2. ప్రాచీన రోం నగరంలో ఉన్న ఈఫస్ దేవళం

3. రోమను రాజ్యంలో క్రీడల కోసం కట్టించిన పెద్ద మైదానంలో నిలిపిన గురుగ్రహం విగ్రహం

4. ఈజిప్టు దేశములోని పిరమిడ్లు అనే రాతి సమాధులు, అందులో ఆ దేశపు రాజులను మరణానంతరముంచేవారు.

5. ఈజిప్టు దేశములోని వాలికర్నాసస్ రాజ్యాధిపతిమహాభవనం

6. దూర తీరాలకు వెలుతురు ప్రసాదించే సముద్రతీర దీపస్తంభం. అది అలేగ్జాండ్రియాలో అతి పెద్దదిగా ప్రపంచ ప్రఖ్యాతి పొందినది.

7. రోమ్ నగరంలో 912 అడుగుల ఎత్తున నిలబడి ఉన్న సూర్యదేవుని విగ్రహం ఇది మధ్యయుగాలకు చెందినది.

1.చైనా దేశములో ప్రహరీగా నిర్మించపబడిన అతి పొడవైన గోడ !

2. చైనా దేశములోనే నాంకింగ్ నగరంలో ఉన్న పార్సిలియన్ మహాగోపురం.

3. భారతదేశాన్ని షాజహాన్ అనే రాజు పాలించాడు. ఆయన భార్యపేరు ముంతాజ్ బేగం. ఆమెపై తనకున్న ప్రేమానురాగాల చిహ్నంగా నిర్మించిన

పాలరాతి కట్టడమే తాజ్‌మహల్

4. ఇటలీ దేశములో 'పీసా' నగరంలో ఏటవాలుగా పడిపోతున్నట్లు కనిపించే గోపురం

5. అలెగ్జాండ్రియా దేశంలో భూగర్భంలో నిర్మించిన సమాధుల వరుసలు

6. మధ్య ప్రాచ్యంలో ఉన్న కాన్‌స్టాంట్ నోపుల్ నగరంలో ఉన్న సైంట్‌సోఫియా ప్రాంతంలోని మసీదు.

7. ఈజిప్టు దేశంలో గీజా నగరంలో చెరసాల. రాజుకు కట్టబడిన రాతి సమాధి.

ఇవన్నీ ప్రపంచ వ్యాప్తంగా కీర్తి ప్రతిష్ఠలు సంపాదించుకొన్ని నిర్మాణాలు మానవుడు సాధించిన గొప్ప కార్యాలు. అంతేగాక అవన్నీ శిల్పకళాధామాలే! ఆనాటి మానవుని భావపటిష్ఠతను అంచనాలు వేయడమే యీనాటి మానవుని కృతజ్ఞతాసూచన!

ముందు పేర్కొన్న కట్టడం ప్రతి ఒకదానిమీద ఎన్నో గ్రంథాలు వెలువడ్డాయి. ఎన్నెన్నో వింతలు విడ్డూరాలుగాఈయబడ్డాయి.

2.10 కాని వాటి అన్నిటి సారాంశము ఇక్కడ స్మరించి అది అంతా మానవుని శిల్పకళా వైశిష్టతయే సుమా! అని గుర్తు చేయడం యీ అధ్యాయంలో ఉంది. దేనికది మహాశిల్పవే అయినా అవన్నీ మానవచరిత్రలో శిల్పకళాధ్యాయానికి పనికొచ్చే ముడిసరు కులని గుర్తు చేయక తప్పదు. ప్రస్తుతం మన అధ్యయనం భారత దేశానికే పరిమితం గనుక యీ విశ్వచారిత్రకం పార్శ్వభూమికగా తీసుకోవలసి ఉంటుందని గుర్తు చేయడమౌతుంది. ప్రపంచవింతలు ఏడే. అయినా వాటి లెక్క ఒక్కో రచయిత ఒక్కో విధంగా యిస్తూ యిప్పటికి మొత్తం 21 శిల్పాల్ని చూపారు.

---

## సందర్భ గ్రంథాలు


1. ఎన్‌సైక్లోపిడియా బ్రిటానిక
2. ప్రపంచ చరిత్ర

# అధ్యాయం : 3

## భారతీయ సంస్కృతి : శిల్పము



3.01 ఏ దేశ చరిత్రకయినా శిల్పం మొదటి సాధనంగా ఉపయోగిస్తుంది, అని క్రిందటి అధ్యాయంలో విశదీకరించడం జరిగింది. ఇక భారతదేశం విషయంలో అది మరీను.

3.02 చరిత్ర పుటల్లో / కాలగర్భంలో దాగి ఉన్న రాజుల్ని వారు పోషించిన కళావిశేషాల్ని లెక్కిస్తే అదీ మన భారతీయ కళా చరిత్రే అవుతుంది. దాన్ని క్రమంగా పరిశీలిస్తే చారిత్రక శకాల/సంవత్సరాల వారీగా విహంగ వీక్షణం చేస్తే అదియిలా ఉంటుంది.

3.02 :

1. మొహెంజదారో సంస్కృతి - చరిత్ర క్రీ.పూ. 3000
2. ఆర్య సంస్కృతి చరిత్ర క్రీ.పూ. 1500-450
3. మౌర్య సంస్కృతి - చరిత్ర క్రీ.పూ. 323 నుండి క్రీ.శ. 185

4. శుంగ రాజ సంస్కృతి - చరిత్ర క్రీ.శ. 100 200
5. కళింగరాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 100-200
6. తొలిశాతవాహనుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 100 - 200
7. గాంధార కళ క్రీ. శ. 100 - 300
8. కుషానుల నాటి చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 200-300
9. క్షాత్రపుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 200-300
10. మలిశాతవాహనుల చరిత్ర-సంస్కృతి క్రీ.శ. 200-300
11. ఇక్ష్వాకు రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 200-300
12. గుప్త రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 400-600
13. వాకాటక రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 400-500
14. సాలంకాయన రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 400-500
15. తొలిపల్లవ రాజుల చరిత్ర -సంస్కృతి క్రీ.శ. 600-500
16. విష్ణుకుండినుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 600-550
17. మైత్రకుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 975-1076
18. పశ్చిమచాళుక్యుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 975-1076
19. పల్లవరాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 600-700
20. పాండ్యరాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ.600-700
21. చేరరాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 700-800
22. తూర్పు చాళుక్యుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 700-800
23. రాష్ట్రకూటుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 750-757
24. పశ్చిమ గాంగుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 800-985
25. నోలంబుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 800-900
26. చోళరాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 900-1000
27. కర్నాటక రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 900-1000

28. ఉత్పల రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 900-1000
29. ఘూర్జర ప్రతీహారుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 800-1000
30. గవడవాహకుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1075-1200
31. చాండేల రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 730-1027
32. హైహయుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 972-1000
33. పశ్చిమ చాళుక్యుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1100-1200
34. పాల రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1100-1200
35. తూర్పు గాంగుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1300-1320
36. మలి పశ్చిమ చాళుక్యుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1300-1350
37. యాదవరాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1300-1350
38. హోయసల రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1300-1350
39. కాకతీయుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1000-1323
40. రెడ్డి రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1324-1424
41. కడపటి చాళుక్యుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1190-1296
42. విజయనగర రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1420-1650
43. నాయక రాజుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1623-1670
44. సంస్థానాధిపతుల చరిత్ర - సంస్కృతి క్రీ.శ. 1670-1700

అనే చారిత్రక విభాగం ఒకటుంది. ఇది చరిత్ర పద్ధతిలో కళయొక్క పోషణ దశల్ని వివరించడం ఆయా కాలాలకు సంబంధించినవిగా మనకు లభించిన చారిత్రకాంశాలను బట్టి ఆయా కాలాల కళాఖండాల్ని ఒకసారి స్మరించుకోవడం అవసరం.

3.04 సింధూలోయలో ప్రాచీన యుగంలో వర్థిల్లిన శిల్పరీతుల్ని చర్చించేటప్పుడు మొదట చర్చించవలసింది అక్కడ దొరికిన ముద్రికల్ని గురించి అవి దాదాపు చాలా వరకు చతురస్రాకారంతో ఉన్నవే! మిగిలిన రూపాల్లో ఉన్నవి కొన్ని

మాత్రమే! రమారమి 1200 పైగా లభించిన ముద్రికల్లో ప్రముఖంగా కనిపించేవి జంతువుల బొమ్మలు. ఈ ముద్రికల్లో కొన్ని అక్షరాలు కూడా ఉన్నాయి. అలాగే మానవ మూర్తులు, దేవతామూర్తులు వివిధ భంగిమల్లో కన్పిస్తున్నాయి. హరప్పాలో రెండు శిలా విగ్రహాలు మొండివి దొరికాయి. వీటిని బట్టి ఆ ప్రాంతంలో శిల్పం అభివృద్ధి చెందిందని చెప్పవచ్చు. ఎద్దు-జింకలు-మూడు తలల యోగి, స్త్రీ విగ్రహాలు ఇక్కడ లభించాయి. వేద కాలాన విగ్రహ పూజ లేదు. వేదంలో అనేక ఋక్కుల్లో దేవతామూర్తుల ప్రార్థనలున్నాయి. గదా!

**తిష్ఠానుకం మఘవన్ మాపరాగాః**
**సామస్య నుత్వా నుషుతస్య యక్షి**
**పితుర్న పుత్రః సిచం ఆరభేత**
**ఇంద్రస్వాదిష్ట్యా గిరాశచీవః (ఋ-5.32)**

తా॥ "ఓ ఇంద్రా పోవద్దు! కొంచెం సేపాగు. చక్కగా సిద్ధం చేసిన సోమరసాన్ని నీకిస్తాను ఓ ఇంద్రా! తండ్రిపై చెంగును పట్టుకొని నడిచే ముద్ద బిడ్డలా నేను చక్కని పాటతో నీ చెంగు పట్టుకొని నడుస్తాను". ఈలాంటి ప్రార్థనల్లో పరమేశ్వరుడ్ని అనుసరించే భక్తుడి స్వరూపం చక్కగా చిత్రించబడ్డది. ఈ రూపకల్పన బ్రాహ్మణాల కాలానికే పెంపొందినట్లు షడ్వింశబ్రాహ్మణం వల్ల తెలుస్తుంది. వేదకాలం తర్వాత మనకు చరిత్రలో మౌర్యకాలమే పేర్కొనదగినది.

3.05 భారతీయ శిల్పానికి మౌర్యవంశ రాజుల సేవ చాలా గొప్పది. మౌర్యుల్లో అశోక చక్రవర్తి భారతదేశంలోనే గాక ఇతర దేశాలు ఇతర ఖండాల్లో గూడ భారతీయ శిల్పుల్ని కళాఖండాల్ని గ్రంథాల్ని ధర్మ ప్రచారకుల్ని పంపించి మతవ్యాప్తికి, కళావ్యాప్తికి ఉత్తేజం కలిగించాడు. దీంతో భారతీయ కలకు విశ్వవ్యాప్తి కలిగింది.

నేటి భారత జాతీయ పతాకం మధ్యంలో ఉన్న చక్రం నాణేల మీద కనిపిస్తున్న మూడు సింహాలూ, మొదలైనవి అశోక మహారాజు చేయించిన ధర్మస్తంభాల నుండి గైకొన్నవే!

బృహద్ భారతం అంటే భారతీయ సంస్కృతి వారసత్వాన్ని చాటుతున్న బొరాబొదూర్ - సుమత్రా, జావా, బోర్నియా, కొరియా, వియత్నాం, జావా, దేశాలలో మన శిల్పకళ వ్యాపించడానికి కారణం ఆనాడు అశోక చక్రవర్తీ ఆయన అనుయాయులైన ధార్మిక బృందమూ చేసిన సేవలే కారణం అని నిక్కచ్చిగా చెప్పవచ్చు!

3.06 మౌర్యుల పతనానంతరం శుంగరాజులు రాజ్యానికి వచ్చారు. వీరు మగధ రాజ్యాన్ని పాలించారు. వీరి పాలనలో వెలువడ్డ శిల్పాల్లో కల్పవృక్షం లక్ష్మి-సంకర్షణ విగ్రహాలూ బర్హూత్ స్తూపంలో ఉన్న జాతక కథా శిల్పాలు చాలా ముఖ్యమైనవి. వీరి కాలంలో వెలువడ్డ ప్రాక్ కళాఖండాల్లో ఖండగిరి - ఉదయగిరి శిల్పాలు ప్రధానమైనవి. ప్రాక్ సాతవాహన శిల్పాల్లో సాంచీ స్థూపం దాని చుట్టూ ఉన్న శిల్పాలు ముఖ్యమైనవి. భాజా - కారణా - నాసిక్ - శిల్పాలూ ఇప్పటివే.

3.07 వాయవ్య భారతంలో ఉవ్వెత్తున లేచిన గాంధార శిల్పం ఈ కళా సామ్రాజ్యంలో మరోమలుపు. కనిష్కుని పోషణతో గ్రీకు రేఖలతో అతి సహజరూపాలున్న ఈ కళ ఆ ప్రాంతంలో వెల్లివిరిసింది.

3.08 కుషానుల పోషణలో శిల్పం మధురలో విరబూచింది. శాతవాహనుల నెదిరించిన క్షాత్రపరాజులు ఉజ్జయిని నుండి ఎన్నో కళాఖండాలందించాడు. తదుపరి వచ్చిన శాతవాహనులు అమరావతి కేంద్రంగా శిల్పకళారాధన చేశారు. అమరావతి నాగార్జున కొండ-చిత్తూరు జిల్లాలోని గుడిమల్లం మొదలైన చోట్ల గల శిల్పాలు శిల్ప చరిత్రలో చాలా ముఖ్యమైనవి.

3.09 ఆంధ్రదేశాన్ని పాలించి కళాపోషకులైన మహారాజుల్లో ఇక్ష్వాకులు పేర్కొన దగ్గవారు. బెజవాడ కీసరగుట్ట మొదలైన చోట్ల యీ రాజులు చేయించిన శిల్పాలు దొరికాయి.

3.10 గుప్తరాజుల కాలంలో పురాణ వాఙ్మయం విజృంభించింది. హైందవాలయాల నిర్మాణాలు పెరిగాయి. దేవఘర్‌లోని దేవాలయాలు, మాళ్వ, మందసార్

మొదలైన చోట్ల వెలిసిన శిల్పాల్ని కళాదృష్టితో చూస్తే ఎంతో విలువైనవి. వాకాటకుల కాలంలో అజంతా, ఎల్లోరాలు రూపు దిద్దుకొన్నాయి. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన యీ కళా కేంద్రాలు శిల్ప కళా విద్యార్థులకు పెన్నిధానాలు.

3.11 సాలంకాయనులకాలంలో వేంగిదేశంలో చిత్ర రథస్వామి దేవాలయం వెలిసింది. ప్రాక్ పల్లవుల కాలంలో పెద్దముడియం, మాడుగుల, మొదలైన చోట్ల ఆలయాలు వెలిశాయి. విష్ణుకుండినుల కాలంలో ఉండవల్లి మొగల్రాజపురం గుహలు వెలిశాయి. వాని తర్వాత మైత్రికులు పాలించారు. వీరి కాలంలో శ్రీమత్ కోట్యర్క, కార్వణ్, రోడా మొదలైన ప్రదేశాల్లో మంచి మంచి దేవాలయాలు వెలిశాయి.

3.12 ప్రాక్ పశ్చిమ చాళుక్యుల కాలంలో మహాకూటేశ్వర, ఐహోలె, బాదామి, పట్టదకల్లు మొదలైన చోట్ల అత్యద్భుతమైన దేవాలయాల నిర్మాణం జరిగింది.

3.13 పల్లవ రాజులు మహబలిపురంలో ఏక శిలారథాల నిర్మాణంతో ఈ కళలో క్రొత్త ఊపిరి పోశారు. ఒకే శిలలో తొలిచిన శిల్పాలన్ని వీరి కాలానికి చెందినవే కావటం మరో విశేషం.

3.14 పాండ్యులు తిరుమలైపురం తిరుప్పరన్ కుండ్రం - సెందమారం - కన్నకడి చొక్కంపట్టి మొదలైన స్థలాల్లో విలువైన దేవాలయాలు నిర్మించారు.

3.15 చేర రాజుల కాలంలో ఎల్లోరా కొండల శిల్పం పూర్తయ్యింది. నోలంబరాజులు హేమావతి రాజధానిగా రాజ్యమేలి మేలైన శిల్పాలు వెలయించారు.

3.18 చోళరాజులు దక్షిణ దేశమంతటా గొప్పగొప్ప దేవాలయాలు కట్టారు, శిల్ప కళా పోషణ చేశారు. తిరువాడి - దారాసురం కందియూర్ మొదలైన చోట్ల శిల్పాలు వీరివే! ఇదే సమయంలో కాశ్మీర దేశంలో కర్కాటక - ఉత్పల రాజ వంశాలు వెలిసి మార్తాండ - అనంతేశ్వర దేవాలయాల్ని నిర్మించి తమ కళా ప్రేమను చాటాయి.

3.19 పశ్చిమ భారత దేశమంతటాగొప్పగొప్ప దేవాలయాలు కట్టారు. శిల్పకళా పోషణ చేశారు.

3.20 మధ్య భారతంలో చాండేల రాజులు రాజ్యమేలి ఖజురాహో దగ్గర కాందరీయ మహాదేవ దేవాలయము. చౌసత్ యోగినీ దేవాలయాలు వెలియించి శిల్ప కళారాధన చేశారు. శృంగార శిల్పకల్పనలకీ దేవాలయాలు నేటికీ ఒజ్జ బంతులుగానే మెరుస్తున్నాయి. ఎందరెందరో దేశవిదేశ విద్వాంసుల్ని పర్యాటకుల్ని రసలోకంలో ఓలలాడిస్తున్నాయి. ఆ సేతుహిమాచలం శిల్ప లోకం యీ దివ్య మందిరాల్ని చూసి తమ కైమోడ్పులందిస్తూనే ఉన్నారు.

3.21 మాళవ దేశంలో భోజమహారాజు గొప్పగొప్ప దేవలాల్ని కట్టించి ఎంతోకీర్తి పొందారు. భోజమహారాజు సంస్కృత భాషలో స్వయంగా సమరాంగణ సూత్రధారమనే ఉత్కృష్ట శిల్పశాస్త్రగ్రంథాన్ని సంతరించాడని తెలిపితే సంతసిస్తారు కదూ!

3.22 ఆ ప్రక్కనే ఉన్న చేది దేశాన్ని హైహయరాజులు రాజ్యమేలారు. చాందేరి అమరకంటకం - బేరాఘాట్ మొదలైన చోట్ల గొప్ప గొప్ప దేవాలయాలు వెల యించారు.

3.23 గుజరాత్ రాజ్యాన సిద్ధపూర్‌లో రుద్రమహాలయం, మోథేరాలోని సూర్య దేవాలయం, ఆబూలోని విమల దేవాలయాలుశిల్ప కళా కేంద్రాలుగా వెలిశాయి. ఆబూ కొండలపై శిల్ప కళాభిమానులైన జైన మతస్థులు వెలయించిన దిల్వారా మందిరాన్ని అందులో ఉన్న పాలరాతి శిల్పాన్ని ప్రశంసించక పోతేశిల్ప కళా చరిత్రకు అపచారం చేసినట్లే!

3.24 బెంగాల్ దేశంలో పాల-సేన రాజవంశాలు స్థిరపడి నలందా, విక్రమ శిల, ఓదంతపురి మొదలైన చోట్ల విశ్వవిద్యాలయాల్ని ఏర్పరచి కళల్ని అభివృద్ధి పరిచారు. కళింగ రాజ్యాన్ని తూర్పు గాంగులు పాలించి భువనేశ్వర్-ముఖలింగం మొదలైన చోట్ల ఎన్నో దేవాలయాలు నిలిపారు. వీరి కాలంలోనే కోణార్క్‌లో సూర్యదేవాలయ నిర్మాణం జరిగింది. సూర్య దేవాలయం అపూర్వ కళాగరిమ వేనోళ్ళ కొనియాడదగింది.

3.25 మలిపశ్చిమ చాళుక్యులు ఇట్టిగె - కుక్కనూరు, హవేరి, గదగ్, బెలగాం మొదలైన చోట్ల దేవాలయాలు నిర్మించి ప్రఖ్యాతి కెక్కారు.

3.26 దేవగిరి రాజధానిగా యాదవ రాజులు మహారాష్ట్ర దేశాన్ని పాలించారు. వారికి హేమాద్రి అనే పండితుడుండేవాడు. అతడే ఆ ప్రాంతంలో హేమాడ్ పంధీ అనే ఒక నిర్మాణ శైలిని గూడా ఆవిష్కరించాడట. ఆ పద్ధతిలోనే ఫండర్ పూర్, మొదలైన చోట్ల ఆలయాలు వెలిశాయట.

3.27 కర్ణాటక దేశంలో హోయసల రాజులు విజృంభించి సోమనాథపురం, నుగ్గేహళ్ళి, దొడ్డగడ్డ హళ్ళి, అరిసికెరె మొదలైన చోట్ల మిక్కిలి కళాకాంతులు దేవాలయాల్ని నిర్మించారు. మహాశిల్పులైన జక్కణాచార్య, దక్కణాచార్య, దాసోజ, పదోజ్మ, మొదలైన వారి శిల్పాలతో అలరారే కళాఖండాలెన్నో యీ యుగంలో వెలిశాయి. ఎన్నెన్నో కళాఖండాలు సృష్టించి ఊరూ పేరూ లేకుండా పోయిన శిల్పులుగా గాక యీ కాలంలో శిల్పులు శిల్పాలపై తమ పేర్లు చెక్కుకోగలగడం మరో విశేషం.

3.28 వరంగల్లు రాజధానిగా కాకతీయ సామ్రాజ్య కాలం అవతరించింది. వరంగల్లులోని సహస్ర స్తంభదేవాలయం, రామప్పగుడి, త్రిపురాంతకం గుడి, మొదలైన వీకాలనికి చెందిన గొప్ప నిర్మాణాలు ఈ కాలంలో స్తంభశిల్పమూ తోరణ శిల్పమూ క్రొత్త పుంతలు పోయిన సంగతి శిల్ప కళావేత్తలకు సంతోషకరమైన విషయం!

3.29 వీర తర్వాత రెడ్డి రాజులు రాజ్యానికి వచ్చి శ్రీశైలం, వేదాద్రి, మొదలైన చోట్ల ఎన్నెన్నో నిర్మాణాలు చేశారు.

3.30 తదుపరి వచ్చిన పాండ్యవంశరాజులు, కేరళదేశమును పాలించిన చేరవంశ రాజులూ దక్షిణాపథాన శిల్పకళా పోషకులుగా చెప్పకోదగినవారు. వీరి కాలంలోనే మధుర, శ్రీరంగం, శుచీంద్రం మొదలైన చోట్ల బ్రహ్మాండమైన దేవాలయాలు వెలిశాయి. ఆదేవాలయాలన్నీ దాక్షిణాత్య శిల్పకళావైభవానికి నిలువుటద్దాల వంటివి. ఆ శిల్పసౌందర్యం వర్ణనాతీతమని పెక్కురు శిల్ప కళాభిమానులు అభివర్ణించిన తీరు గమనార్హం.

హిందూ సామ్రాజ్యాల్లో కడపటిదీ గొప్పది అయిన విజయనగర సామ్రాజ్యం తుంగభద్రానదీ తీరాన వెలిసింది. సాళువ, సంగమ, తుళువ వంశరాజులు రాజ్యం

చేశారు. విద్యారణ్యాది మహాత్ములూ, సాయణ మాధవాది, వేదవేత్తలూ దేశంలో ధర్మ ప్రభోధం చేశారు. ఎందరెందరో శిలా సౌందర్యవేత్తలు తమ కల్పనా నైపుణ్యంతో విజయనగర సామ్రాజ్యం విస్తరించినంత పొడవునా గుడులూ గోపురాలూ నిర్మించారు. మళ్ళీ హైందవ శిల్పకలామతల్లికి ఎనలేని అలంకారాలు ఘటించారు.

విరూపాక్షాలయం, విఠలాలయం-హజారా రామాలయం - నరసింహాలయం మొదలైన బ్రహ్మాండమైన దేవాలయాలు నిర్మించారు. సప్తస్వర స్తంభాలతో సరిగమలు పలికించారు.

తిరుపతి / నాగలాపురం-కొండాపురం-శ్రీవిల్లిపుత్తూరు - శ్రీరంగం, శ్రీకాళహస్తి, లేపాక్షి మొదలైన చోట్ల బ్రహ్మాండమైన దేవాలయాలు అంగరంగభోగాలతో అలరారే విధంగా నిర్మించారు. ఆ శిల్ప విన్యాసం తలచి ముగ్ధులు కాని కళా హృదయులు లేరు.

3.32 విజయనగర సామ్రాజ్య పతనానంతరం తంజావూరు కేంద్రంగా నాయకరాజ్యం అవతరించింది. హైందవ విద్యాసరస్వతి వీరి ఆస్థానాల్లో నవరసభరితంగా వ్యాసంగం చేయడం మొదలు పెట్టింది. మధుర-తంజావూరు-కుంభకోణం-తెంకాశి-శంకరనయనార్ కోయిల్ మొదలైన చోట్ల పెద్ద పెద్ద దేవాలయాలు నిర్మింపబడ్డాయి. శ్రీరంగం మధురలలో అంబరచుంబి శిఖరాలు వెలిశాయి. శిల్పకళ వెల్లివెరిసింది.

3.33 తదుపరి మహమ్మదీయుల తాకిడికి హిందూరాజ్యాలన్నీ పడిపోయాయి. ఎన్నెన్నో రమ్యశిల్పాలు దుండగులచేతిలో భగ్నాలయ్యాయి. ఆభీభత్సం చూడలేక "శిలలు ద్రవించి యేడ్చినవి-శీర్ణములైనవి తుంగభద్రలోపల గుడి గోపురములు" దీంతో హిందూ సామ్రాజ్య వైభవము శిల్పకళామతల్లికి రాజాస్థాన పోషణాధ్యాయమూ ముగిసింది. ఇంతవరకే సర్వతంత్ర స్వతంత్ర హిందూకళాధ్యాయం. తదుపరిది బర్బర పారసీ కాది మిశ్రితం దాన్ని వేరుగానే చూడవలసి ఉంటుంది.

3.34 ఏతావతామన అధ్యయన సారాంశం ఏమిటి? ఈ విహంగ వీక్షణలో రాజులు రాజవంశాలూ శిల్పకళా క్షేత్రాలూ స్మరించడం జరిగింది. దీనివల్ల

శిల్పకళావిద్యార్థికి సుదీర్ఘమైన మన భారతీయ చరిత్రతో అవినాభావ సంబంధం గల శిల్పకళా చరిత్రకు దర్పణం పట్టడం జరిగింది. స్వచ్ఛమైన భారతీయ చరిత్రకు - కళా చరిత్రకు గల ఎల్లల్ని స్పృశించినట్లైంది. భారతీయ కళాగరిమను అద్దంలో కొంతగా చూపడం జరిగింది.

---

## సందర్భ గ్రంథాలు


1. ఇండియన్ స్కల్ప్చర్ - డా॥ శివరామమూర్తి
2. ఋగ్వేద - మాక్స్ ముల్లర్
3. హిస్టరీ ఆఫ్ ఇండియా - ఆర్ .సి. మజుందార్
4. హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా - కె. ఎ. నీలకంఠశాస్త్రి




# అధ్యాయం : 4

## తెలుగు సంస్కృతి : శిల్పము

లాలిత్య లక్ష్మీ విలాసరంగమ్ము

నిల్పితివజంతా చిత్రలేఖనమ్ము

సవరించితివిశైవభువనంబు "నెల్లొరా"

కొండను మైనంపుటుండజేసి

విఠల ప్రభుని కోవలె కంబములచేత

బలికింపగంటిసప్తస్వరాలు

బలికించితౌర! తిర్మలనాథు నగరిలో

వెలలేని సభ్యతా విలసనములు

భగవదన్వేషణార్థమై పాటుపడిన

యుత్తమతపస్వివై కళాయోగివైన

నీకు ఋణపడె రసలుబ్ధలోకమెల్ల

నాంధ్ర శిల్పీ! చిరంజీవి వయ్యనీవు

-"రాష్ట్ర గానము" - తుమ్మల

ఎన్ని యుగముల వరకు సహించుకొనెనో

తెలుగు శిల్పులు చాతురీ విలసనంబు

యమున యొడ్డున బూచి దిగంతములను

యశము నించిన తాజ మహలు కొఱకుజాషువా

కుంచె చేబూని మనమున గొంకుమాని
మధుర మధురాతి విజ్ఞాన మహితమైన
యెట్టి చిత్రమ్ము నేనియు నిట్టె వ్రాయు
దహ! హనీ కళాకౌశలమ్మద్భుతమ్ము
భారతీయత్యాగపాటవమ్ము నుదెల్పు
చిత్రమ్ము వ్రాసెదు చెన్నుమీఱ
ప్రకృతి సౌందర్య విభ్రాజితమ్మైనట్టి
చిత్రమ్ము వ్రాసెదు చెన్ను మీఱ
సాంధ్యరాగచ్ఛటా సదమల మైనట్టి
చిత్రమ్ము వ్రాసెదు చెన్నుమీఱ
నవరస భంగిమ నైపుణ్యమును జూటు
చిత్రమ్ము వ్రాసెదు చెన్ను మీఱ
నెట్టి ఘటనల నేనియు బట్టు విడక
జీవ రూపమ్ము నం గూర్చి చెలఁగుదీవు
సృష్టికర్తను మఱపించు చిత్రకార!
ఆయురారోగ్యభాగ్యాల నలరుమయ్య!
కవియు శిల్పియుచిత్రక గాయకులును
సత్యశివసుందరమ్ముగా సంఘమునకు
నూత్న భావాలు వెదజల్ల నొవ్వలేని
అభ్యుదయమార్గమునేజూపి యశము గాంచు

'-జాస్తి'

4.01 భారతదేశ చరిత్రలో లాగానే తెలుగు ప్రాంతం చరిత్రలో కూడా చారిత్రకమైన పద్ధతిలో శిల్పకళా వికసనంయొక్క క్రమాన్ని వీక్షించి తదుపరి దాని విశేషాల్ని అధ్యయనం చేయడం ఉచితం.

4.02 వివిధ కాలాల్లో తెలుగు ప్రజల సంస్కృతి -కళలు వివిధ ప్రదేశాల్లో జరిగినప్పటికీ వాటి తెనుగు తనాన్ని బట్టి తెలుగు కళగానేలెక్కించి చూపడం జరుగుతుంది.

శాతవాహనుల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 100 ప్రాంతం

ఇక్ష్వాకులకాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 200-400

సాలంకాయనుల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 400-500

విష్ణుకుండినుల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 500-600

పల్లవుల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 600-630

బాదామి చాళుక్యుల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 625-753

తూర్పుచాళుక్యుల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 753-973

రాష్ట్రకూటుల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 975-1076

తూర్పు గాంగులకాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 800-900

కాకతీయుల కాలంలో విలసిల్లిన శిల్పంక్రీ.శ. 1000-1323

రెడ్డిరాజుల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 1324-1474

విజయనగర రాజుల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 1480-1650

నాయకరాజుల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 1623-1570

జమీందారీల కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 1700-1850

బ్రిటిషు ప్రభుత్వ కాలంలో విలసిల్లినశిల్పం క్రీ.శ. 1800-1945

స్వాతంత్ర్యోత్తర కాలంలో విలసిల్లిన శిల్పం క్రీ.శ. 1947 నుండి ఇప్పటి వరకు

4.03 శిల్పుల గొప్పదనం బట్టికూడా ఆయా కాలాల్లో వెలిసిన శిల్పాలకు పేరు ప్రఖ్యాతులు కలుగుతాయి. దీనికుదాహరణంగాక్రీ.శ. మొదటిశతాబ్దంలో నివసించి తెలుగుదేశ చరిత్రలోతన ప్రత్యేక స్థానాన్ని నిల్పుకొన్న మహాత్ముడైన నాగార్జునాచార్యుని పేరు మొదట చెప్పుకోవలసి వస్తుంది. ఇతని పేరుచరిత్ర చిరస్థాయిగా నిలిచిపోవడానికి సాకారమైన నాగార్జునకొండ మనకు ప్రత్యక్ష నిదర్శనం. అతడు శిల్పి అవునాకాదా అనే వాదాలు ఉన్నప్పటికి నిలువెత్తున నిలిచి ఉన్న కొండ వాటిని పారద్రోలగలదు. నాగార్జునుని పేర ప్రఖ్యాతమైన గ్రంథాలు విగ్రహవ్యావర్తిని, సుహృల్లేఖ-దశ భూమికాశాస్త్రం మొదలైన వాటిలో విగ్రహం/లేఖ/భూమి మొదలైన శబ్దాలు శిల్పానికి సంబంధించినవే అవడం ఆచార్యుని శైల్పిక సంబంధానికి నిదర్శనాలని కొందరి వాదం! అలాగే తెలుగు నాట 'నాగార్జున కొండ' 'నాగార్జున' యింటిపేరు గలిగిన శైల్పిక కుటుంబాలుండడాన తప్పక నాగార్జునుల వారు యీ ప్రదేశంలో శిల్పిగా జీవించారని చెప్పడానికి ఎంతో ఆస్కారం కలుగుతుంది. అలాగేవారుయీ ప్రదేశంలో శిల్పిగా జీవించారని చెప్పడానికి ఎంతో ఆస్కారం కలుగుతుంది. అలాగే వారురసవాదానికీ తంత్ర విద్యకు సంబంధించిన ఎన్నో గ్రంథాలు వ్రాసినట్లు తెలుస్తుంది. ఈ రసవాద విద్యను బట్టి కూడా వీరికి మన శిల్ప విద్యావ్యాసంగం ఉండినట్లు తెలుస్తుంది. వీరి కనుసన్నల్లో మెలిగిన శిల్పులే మన నాగార్జున కొండ-అమరావతి ప్రాంతాల్లో వెలిసిన అనేక శిల్పాల్ని నిర్మించి ఉంటారని అభిప్రాయపడడానికి ఆస్కారం కలుగు తుంది.

4.04 అకాలంలో వెలిసిన శాతవాహన మహారాజు గౌతమీపుత్ర శాతకర్ణిని ప్రబోధించి యీతడెన్నో సత్కార్యాలు చేసితెలుగు దేశంలో ధర్మప్రచారం చేసి విశ్వవిద్యా లయాన్ని నిర్వహించనట్లు తెలుస్తుంది. ఈ మహనీయుని కాలంలో ప్రపంచం నలుమూలల నుంచీ వచ్చివిద్యార్థులు ఈ నాగార్జునకొండచుట్టూ చేరేవారని బౌద్ధ గ్రంథాలను బట్టి తెలుస్తుంది. ఈ సమయంలో వెలిసిన శిల్పకళాక్షేత్రాలనదగిన బౌద్ధారామాలనేకం ఇటు తెలుగునేల మీద అటు మహారాష్ట్రంలోనూ లభ్తిన్నాయి. కృష్ణాతీరాన అమరావతిలో వెలిసిన ప్రసిద్ధమైన

స్థూపము భాజా-కోణా-కొండణె బేడ్సా మొదలైన చోట్ల వెలువడిన బౌద్ధ విహారాలు విగ్రహాలు ఈ విషయాన్ని బలపరుస్తాయి. ఈ విగ్రహాలన్ని ముఖ్యంగా తెల్లని పాలరాతి వంటి రాతితో మలచబడినవే. ఈ రాళ్ళు ఆ ప్రాంతంలో దొరకవు గనుక శిల్పులు వేరే చోట నుండి వీటిని తెచ్చుకొని నిర్మించి ఉంటారని స్పష్టంగా తెలుస్తుంది.

4.05 అదేకాలంలో సాంచీలో వెలసిన మహాస్థూపానికి కూడా యిక్కడి శిల్పులే కారకులని తెలుస్తుంది. శాతవాహన రాజులు శిల్పుల్ని బాగా పోషించారని యీ శిల్పాలే తెలుపుతున్నాయి. అంతేగాక ఆ కాలంలో ఆనందుడనే శిల్పాచార్యుడు కూడా వర్ధిల్లినట్లు తెలుస్తుంది. ఏమైనప్పటికీ ఆకాలంలో శిల్పం మూడుపూవులారుకాయలుగా వర్ధిల్లినట్లు తెలుస్తుంది. చరిత్ర కారుల దృష్టిలో అసలు విగ్రహ నిర్మాణానికీ శిల్పకళ అభివృద్ధికీ ఆనాడే శ్రీకారం చుట్టడం జరిగింది. ముమ్మరంగా శిల్పకళాభివృద్ధి జరగడానికి కారణం ఆనాటి రాజపోషణం, ప్రజాదరణ, మతప్రచార తీతీక్షా కలిసి దోహదం చేశాయి. ఈ కాలంలో తెలుగు శిల్పులు అనేక శిల్పకళాఖండా ల్ని సృష్టించారు.

4.06 శాతవాహనుల కాలం తర్వాత ఇక్ష్వాకుల కాలం వచ్చింది. కృష్ణాలోయలో విజయపురి కేంద్రంగా బౌద్ధవైదిక మతాల సమాన అభివృద్ధి స్థానంగాఇక్కడ శిల్పం వర్ధిల్లిన విషయం గమనించదగ్గది. ఇక్ష్వాకుల యిండ్లలో రాజులు వైదిక మతాన్ని అభిమానించి యజ్ఞయాగాదులాచరించి, పౌరాణిక మతానికి ప్రాణం పోసినట్లు తెలుస్తుంది. చైత్య స్థానానికి ఏర్పాటు చేసిన స్నాన ఘట్టాలు, చక్రాకారంలో ఏర్పాటు చేసిన నిర్మాణాలు, పుష్పభద్రస్వామి మహాసేన స్వామి మొదలైన దేవతల విగ్రహాలూ ఆ కాలంలో వెలిసిన మత విశ్వాసాలకు అద్దంపడుతున్నాయి. రాజులిలా వైదిక మతావలంబులైనా రాణులు బౌద్ధాన్ని ప్రేమించి ఆదరించినట్లు తెలుస్తుంది. ఈ కాలంలో కృష్ణాలోయలో అనేక బౌద్ధనిర్మాణాలు వెలిసినట్లు తెలుస్తుంది.

4.07 ఇక్ష్వాకుల తరువాత సాలంకాయనులు రాజ్యమునకు వచ్చి శిల్పకళాభివృద్ధికి

దోహదం చేశారు. ఆకాలమున వెలసిన శిల్పకళాక్షేత్రాల్లో పెదవేగిలోని "చిత్రరథ స్వామి దేవాలయము" చెప్పుకోతగినది. సాలంకాయన రాజన్యులు వైదిక మతావలంబులై దేశాన్ని వైదికమతంవైపు మరల్చినట్లు తెలుస్తుంది. ఆకాలంలో కొన్ని నైష్టిక శిల్పి కుటుంబాలు వెలిసి చతుర్వేద విశారదులై యజ్ఞయాగాదులొనర్చినట్లు తెలుస్తుంది.

(1950 జనవరి భారతి సంచికలో భావరాజు వెంకటకృష్ణరావు గారు - నందివర్మ పౌత్రులైన హస్తివర్మ పుత్రుడు, చిత్రరథ స్వామి భక్తుడు శాలంకాయనుడూ ఐన స్కందవర్మ చతుర్వేద పారగులైన రథకార బ్రాహ్మణులకు బ్రహ్మదేయంగా ఇచ్చిన దానాన్నికీర్తించే శాసనాలు ప్రకటించారు. అందులో సనాతన గోత్రజులు అహభూన గోత్ర జులైన శిల్పాచార్యులు రథకార చతుర్వేదులని కీర్తింపబడ్డారు.)

4.8 కృష్ణాజిల్లా కోడూరు రాజధానిగా బృహత్పలాయనులు 20 సం.లు గుంటూరు జిల్లా చేజేర్ల రాజధానిగా ఆనందరాజులు 20 సం.లు, ఏలూరువ ద్ద వేంగిరాజధానిగా సాలంకాయనులు 50 సం॥లు పాలించారు. తర్వా 420-620 మధ్య 2000 సం.లు విష్ణుకుండిన రాజులు ధాన్య కటకం రాజధానిగా కృష్ణా గోదావరి మధ్య ప్రాంతాన్ని పరిపాలించారు.

4.09 విష్ణుకుండిన రాజులకు పూర్వమున్న చిన్నరాజులందరూ పల్లవులతో రాజీ పడ్డారు. కృష్ణ దక్షిణ భాగమంతాపల్లవులు ఉత్తరాన చిన్నరాజులు పాలించారు. కాని విష్ణుకుండినులు పల్లవ అధిపత్యాన్ని కూలద్రోసి ఆంధ్రదేశాన్నంతా ఐక్యం చేయ ప్రయత్నించారు. ఈ రాజులంతా బ్రాహ్మణులేకావడాన వైదిక మత విజృంభణ చూడవచ్చు. తెలంగాణాలోని కీసరగుట్టలోని సహస్రలింగక్షేత్రం - నరమేధాది యజ్ఞయాగాల ప్రచారం యీకాలంలో జరగడం విశేషం. విజయవాడ దగ్గర వెలిసిన ఉండవల్లి మొగల్రాజ పురం గుహ శిల్పాలు వీరి కాలానివే అని చారిత్రకుల నిర్ణయం.

4.10 క్రీ.శ. 420-620 వరకు విష్ణుకుండినులు ఆంధ్రదేశాన్ని పాలించారు. అమరావతి వీరి రాజధాని గుంటూరు జిల్లా వినుకొండవీరి స్వగ్రామం గనుక విష్ణుకుండినులనే పేరు వచ్చిందని చెబుతారు. ఈ వంశంలో మొత్తం 9

మంది రాజులు పాలించారు. వీరి కాలంలో సముద్రగుప్తునితో యుద్ధమూ ఉత్తర దేశంతో గరిష్ఠసంబంధమూ కలగడాన ఎన్నెన్నో లాభాలు కలిగాయి. వరాహమిహిరాదుల వ్రాసి ప్రచారం చేసి "బృహత్ సంహిత" అనే గ్రంథం ద్వారా అప్పటి వాస్తుశాస్త్రం-శిల్పశాస్త్రం. మణి-లోహ శాస్త్రాలు జలార్గళం వంటి విద్యలూ శిల్పాచార్యులెలాప్రచారం చేస్తుండే వారో తెలుస్తుంది.

4.11 విష్ణుకుండిన వంశస్థాపకుడైన మాధవవర్మ (క్రీ.శ. 420-453) అశ్వమేధ రాజసూయాది యాగాల్ని చేశాడు. అమరావతి స్తూపాన్ని ధ్వసం చేశాడు. చైనా యాత్రికుడు 'హూయాన్‌త్సాంగ్'' ఈ క్రింది విధంగా వ్రాశాడు.

4.12 ''అమరావతి స్తూపం బౌద్ధ భిక్షువుల ఆధీనంలో వుంది. బ్రాహ్మణులు ఈ స్తూపం పై పెత్తనం కావాలని తగాదా పెట్టారు. బౌద్ధ భిక్షవులు ఆ రామంలోపల తలుపులు బిగించుకొని కూర్చున్నారు. బైట బ్రాహ్మణులు ముట్టడి చేశారు. చివరికి బౌద్ధ భిక్షువులు తలుపులు తీసి రాజుగారి మధ్యవర్తిత్వం కోరి బయటికి వెళ్ళారు. ఈ అవకాశం దొరకగానే బ్రాహ్మణులు దౌర్జన్యంగా ఆరామంలో ప్రవేశించి ఆక్రమించుకున్నారు. రాజు బ్రాహ్మణులదే న్యాయమని తీర్పు చెప్పాడు. బౌద్ధ భిక్షవులు స్థానభ్రష్టులై లేచిపోయారు. కొద్ది రోజులు తర్వాత బ్రాహ్మణులు ఆరామాన్ని ధ్వంసం చేసి అమరేశ్వర ఆలయాన్ని నిర్మించారు.

4.13 విష్ణుకుండిన రాజుల కాలంలోనే మొగల్రాజపురం, ఉండవల్లి గుహలు నిర్మించబడ్డాయి. ఉండవల్లిలో అంతకు పూర్వమున్న బుద్ధ విగ్రహాన్ని విష్ణువిగ్రహంగా మార్చి అనంతశయనుడు అని పేరు పెట్టాడు.

4.14 అలా విజయవాడ ఆ చుట్టు పక్కల ఉన్న శిల్పాలలో విష్ణుకుండిన శిల్ప ఛాయలు గోచరిస్తాయి. మొగల్రాజపురం గుహల్లో వెలిసిన నటరాజ విగ్రహాన్ని మొట్టమొదట శిల్పించిన కీర్తి వీరిదే అంటే అతిశయోక్తి గాబోదు.

4.15 తర్వాత పల్లవరాజులు రాజ్యమేలారు. పల్లవనాడే పల్నాడు. పల్లవులంతా హిందూమతాభిమానులై శిల్పకళకెంతో దోహదం చేశారు. కృష్ణాతీరం నుండి కావేరి తీరం వరకూ రాజ్యాన్ని విస్తరించుకొని విశిష్టమైన పరిపాలన జేసిన

వీరి కళావైభవం దక్షిణాదిన వికసించింది. కంచిలోను తిరుచిరాపల్లిలోను వీరి నైపుణ్యం చాటే శిల్పాలెన్నో ఉన్నాయి. అలా వీరు తమ శక్తినంతా దక్షిణ దేశం వైపే మరల్చి ఉండడం చేత క్రమంగా వీరి శక్తి యిక్కడ లుప్త మైపోయింది. వీరికాలంలో ఎక్కువగా ఏకశిలారథాలూ దేవాలయాలూ తయారవడం గమనించదగ్గశిల్ప విశేషం.

4.16 పల్లవుల తర్వాత ఆంధ్రదేశాన్ని బాదామి చాళుక్యులు పాలించారు. వీరి సుస్థిర పరిపాలనలో తెలుగు దేశంలో సాహిత్యం కళలు విస్తరించాయి. మహాభారతం తెలుగులో వెలిసింది. లిపి కర్తలుపెరిగారు. తెలుగు భారతాన్ని నన్నయ గారు చెప్పగా గండాచార్యుడు లిఖించాడట. ఆ విధంగా శాసనకర్తలుగానే గాక రాజాస్థానాల్లో శిల్పులు వ్రాయసకారులు కూడా అభివృద్ధిలోకిరావడం గమనించదగ్గ విషయం. ఈ చాళుక్యులు బాదామి చాళుక్యులు - తూర్పు చాళుక్యులు - పశ్చిమచాళుక్యులుగా తెలుగు దేశాన్ని పాలించి ఎన్నో దేవాలయాలు మందిరాలు కట్టించారు.

4.17 రెండవ విజయాదిత్యుడు 108 యుద్ధాలు గెలిచి 108 శైవ దేవాలయాలు నిర్మించాడు. విశాఖ జిల్లా ఎలమంచిలి దగ్గర సర్వసిద్ధి అనే గ్రామం ఉంది. అక్కడి శిల్పాచార్యుల్ని సర్వసిద్ధి శిల్పచార్యులనేవారు. వారు సృష్టించిన శిల్పాలు కళింగ దేశం దాకా ప్రసిద్ధి వహించాయి.

4.18 మహబూబ్‌నగర్ జిల్లాలోతుంగభద్రా నదికి పడమటి తీరాన అలంపురం ఉంది. దీనికి దక్షిణ కాశి అని పేరు. ఇక్కడ ప్రసిద్ధి వహించిన నవ బ్రహ్మదేవాలయాలున్నాయి. ఇవి బాదామి చాళుక్యుల కాలంలో నిర్మింప బడ్డాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న యీ బ్రహ్మాలయాలు చారిత్రకంగానే గాక శిల్పకళా రీతిలోనూ ప్రసిద్ధమైనవే. ఎక్కడో ఉత్తర దేశంలో మాత్రమే కనిపించే నాగరశిల్పశైలి గల విమానాల నిర్మాణం ఇక్కడ ప్రత్యేకత - నిజానికి ఇవి శివాలయాలుగా నేటికి కన్పిస్తున్నా శైలీ విశేషాన్ని బట్టి ఇవి బ్రహ్మసంప్రదాయానికి చెందినవే అని నిరూపించడానికి శిల్పాచార్యులలా కల్పన చేసి ఉంటారనిపిస్తోంది. అలాగేఅక్కడ ఉన్న దేవతల పేర్లన్నీ రసవాద విశేషం గలవే. అవి

1. బాల బ్రహ్మ, 2. కుమార బ్రహ్మ, 3. అర్కబ్రహ్మ, 4. వీరబ్రహ్మ 5.విశ్వబ్రహ్మ, 6. తారక బ్రహ్మ, 7. గరుడ బ్రహ్మ, 8. స్వర్గ బ్రహ్మ, 9. పద్మబ్రహ్మ అనేవి వీటిలో బాల, కుమార, అర్క, వీర, విశ్వ, తారక, గరుడ, స్వర్గ, పద్మలు మూలికల పేర్లని వ్యాఖ్యాతల వాదం.

4.19 తూర్పుచాళుక్యుల నాటి శిల్పాలలో దొరికినవి మద్రాసు మ్యూజియంలో ఉన్నవి క్రీ.శ. ఏడవ శతాబ్దమునకు చెందినవి. ఈ శిల్పములను నిర్మించిన గుండయ తనపేరును శిల్పము వెనక భాగమున చెక్కినాడట. బిక్కవోలు పొలములోఘనమైన గణేశ ప్రతిమా శిల్పం ఒకటి దొరికింది. బిక్కవోలులోని రాజరాజదేవాలయం, గోలింగేశ్వరాలయం గుణగణగ విజయాదిత్యుని కాలంలో వెలిసిన తూర్పు చాళుక్య కళాశిల్పాల్ని తెలుపుతాయి.

4.20 కళింగ రాజ్యముతో గల రాజకీయ సాంస్కృతిక సంబంధముల కారణముగా ఒరిస్సా దేవాలయములోని మిథున శిల్పముల బోలినవి తూర్పు చాళుక్య దేవాలయములందు వెలసినవి. దక్షిణామూర్తి శిల్పముకు బదులు లకులీశమూర్తులు వెలియుట గమనింపదగినది.

4.21 సామర్ల కోటలోని భీమేశ్వరాలయము చాళుక్య భీమునిచే నిర్మింపబడినది. అటువంటిదే ద్రాక్షారామభీమేశ్వరాలయము.

4.22 రాష్ట్రకూటుల కాలమునకు చెందిన శిల్పములు హైదరాబాదునకు సమీప మున గల పటంచెఱువులో దొరికిన హైదరాబాదు మ్యూజియంలో భద్రపరచబడినవి.

4.23 పశ్చిమ చాళుక్యుల శిల్పమునకు సంబంధించినవి వేముల వాడ రాజరాజేశ్వరా లయము కేదారేశ్వరాలయము, నాగేశ్వరాలయము, భీమేశ్వరాలయము, శీతలాదేవి ఆలయము వేణుగోపాలస్వామి ఆలయము, కనకదుర్గాలయము, నరసింహాలయములు ముఖ్యము.

4.24 హైదరాబాదుకుదగ్గరలో ఉన్న కొల్లిపాక లేక కొలనుపాక కళ్యాణీ చాళుక్యులకు కేంద్రంగా ఉండేది. వీరనారాయణ, సోమేశ్వర, కాకతీయ ఆలయశిల్పాలు

న్నాయి. ఇక్కడ ప్రసిద్ధజైన మందిరం అఖిల భారత ప్రసిద్ధి పొందినది. తరువాత చెప్పుకోతగినది కాకతీయవంశము. వీరి పాలనలో మరలా శైవము విజృంభించి, శివాలయముల నిర్మాణము ముమ్మరంగా సాగినది. సమకాలికులైన హోయసల రాజ్యమునందులి శిల్పుల రాకపోకచే గాబోలు వీరి శిల్పాల మీద ఆ శిల్పం యొక్క ప్రభావం కనిపిస్తుంది. త్రికూటాలయాల అభివృద్ధి గమనించదగ్గది. అట్లే ఈకాలమున తోరణ శిల్పము - స్తంభశిల్పము- అధిష్ఠాన శిల్పము వైశిష్ట్యము గమనింపదగియున్నది. నాలుగుతోరణముల మధ్య గల స్వయం భూకేశవాలయములు నేడు ఖండ ఖండములై శిధిలములై దర్శనమిచ్చుచున్నవి.

4.25 మట్టికోటలోమాచల్దేవిగుడి అక్కడి నుండి కొలది దూరంలో ఉన్న రామప్ప దేవాలయం చాలా ప్రసిద్ధమైనవి. ఆ దేవాలయములో గల మదనికాశిల్ప సౌందర్యము ఆ శిల్పుల నాట్యశాస్త్ర పారంగత్వానికి దర్పణముపట్టుతుంది. ఇక్కడి ఇటికల నిర్మాణము గూడ విశిష్టమైనది పరిశోధనీయమైనది. నల్లగొండ జిల్లా పిల్లల మర్రిలో ఏకేశ్వరాలయమనబడే శివాలయం శిల్పవిశేషం గలదు. అక్కడే ఉన్న నామేశ్వర - కోటేశ్వరాలయానబడే త్రికూటాలయాలు గూడ ప్రఖ్యాతమైనవే! కాకతీయ దేవాయాల్లో చిత్ర కళ గూడా ఉన్నదని చెప్పడానికి నామేశ్వరాలయ చిత్రాలు ఆధారమై ఉన్నవి. నాగుల పాడులో ఉన్న త్రికూటాలయాలు రేచర్ల వారి పాలనలో వెలిశాయి. పానూరు కొండలోని సహస్ర స్తంభదేవాలయం పాలంపేటలోని రామప్ప దేవాలయం శిల్పాలు నిగనిగలాడుతూ ఆ శిల్పుల సౌందర్యపిపాసను తెలుపుతాయి.

4.27 తర్వాత వచ్చిన రెడ్డి రాజులు పల్నాడులోను గుంటూరు జిల్లాలోనిపలు ప్రాంతాల్లోను ఆలయాన్ని నిర్మించినట్లు తెలుస్తుంది. అలాగే యీ రాజులు శ్రీశైలంలో ప్రాకార శిల్పాలు మొదలైనవి చేయించినట్లు తెలుస్తుంది.

4.28 ఆ తరువాత గమనింపదగింది విజయనగర సామ్రాజ్యశిల్పం. హంపీలో కనిపించే బ్రహ్మాండమైన విగ్రహాలు, గణపతి, నరసింహ విగ్రహాలు ప్రఖ్యాతి గాంచినవే. హజార రామాలయము, విఠలాలయము, విరూపాక్షాలయము

మొదలైనవి ప్రపంచ ప్రఖ్యాతి గాంచినవే! విజయనగరము తాడిపత్రి, తిరుపతి, పెనుగొండ, లేపాక్షి, నెల్లూరు, చిదంబరము, శ్రీరంగము కాంచీపురము, శ్రీకాళహస్తి, విరించిపురము, నాగలాపురము, మున్నగు చోట్ల ఉన్న దేవాలయాలన్ని యీ శిల్పకళారీతికి చెందినవే! ఈ కాలానికి శిల్ప శాస్త్రాభ్యాసమూ శిల్పకల్పనావైశిష్ట్యము బాగాపెరిగినట్లు తెలుస్తుంది. రాజులు మాత్రమే గాక రాణులు, సామంతులు మొదలైనవారు కూడా పోటీపడి శిల్పాలు చేయించి వాని విగ్రహాల్ని సైతం ఆయా క్షేత్రాల్లో నిర్మించుకొన్న విశేషం యీ యుగంలో చూడవచ్చు. ప్రఖ్యాత శిల్పాచార్యులైన టెంకణాదులు యీ కాలంలో వర్ధిల్లినట్లు తెలుస్తుంది.

4.29 విజయనగర రాజ్యం పడిపోయిన తర్వాత మధుర తంజావూర్ నాయక రాజులు శిల్ప కళకు దక్షిణంలో చేయూతనిచ్చినట్లు తెలుస్తుంది. ఈ రాజులంతా తెలుగు వారే అయినందున వారితో ఉన్న తెలుగు శిల్పులు, ఆయా ప్రాంతాల్లో తమ శిల్ప కళను దక్షిణాది వారితో కలిసి వెలయించారని చెప్పవచ్చు. మధుర, తంజావూర్, కుంభకోణం, తెంకాశి, మొదలైన చోట్ల గల నిర్మాణములలో వీరికై వాడం తెలుసుకోవచ్చు.

## సందర్భ గ్రంథాలు


1. రాష్ట్ర గానము - తుమ్మల సీతారామమూర్తి
2. ఖండకావ్యము - గుఱ్ఱంజాషువా
3. ఖండకృతి - జాస్తి వెంకటనర్సయ్య
4. భారతీయ శిల్పము - (ఇం.) డా॥ శివరామమూర్తి
5. భారతదేశ చరిత్ర - (ఇం.) మజుందార్

# అధ్యాయం : 5

## శిల్పము : అర్థము

5.01 శిల్పము సం.వి.అ.న

5.02 కళ (చిత్రలేఖనము మొ॥ కళల ఉవదినాలుగు)

5.03 మూర్తి మందిరాది నిర్మాణము

5.04 మృద్దారు శిలాదులచే నిర్మింపబడిన మూర్తి మందిరాదికము.

5.05 చం॥.... ధాత్రికపూర్వముగా నొనర్చి చెచ్చెరఁ గొనరమ్ము

నీదయిన శిల్పకళా కుశలత్వమేర్పడన్ - (భారత. సభా. 1-5)

5.06 కం................. ఓ విశ్వకర్మ! కుశలమె! నీవె గదా జగతి

సకల నిర్మాణంబుల్, గావించునట్టి శిల్పకళా వేదివి మనవి వినుము లలిమీఅంగన్ - శివరహస్య ఖండము 3.143

5.07 ఆ......... వివిధ శిల్పములఁబ్రవీణనై మఱియును

వలయు పనుల వెంట మెలగనేర్తు భారత - (విరాట. 1.107)

5.08 సంస్కారము, విధివిహితమైన క్రియ, నైపుణ్యము

మ॥ అమలోదాత్తమనీష నేను భయకావ్య ప్రౌఢిఁ

బాటించు నీవాంధ్రభాష శిల్పము మెఱయన్ కేయూర 1-11.

5.09 మ॥ కలహక్షోణిఁబినాకపాణి

కుహనాకౌటిల్య శిల్పంబునన్. - హరవిలాసం

5.10 నేర్పు, 5. హోమమునకై నేయి గ్రహించు పరికరము స్రుక్కు

6. ఆకారము, రూపము, 7. సృష్టి, 8. చుఱుకుందనము -సూర్యరాయాంధ్ర నిఘంటువు పుట 631

---

## సందర్భ గ్రంథాలు


1. ఆంధ్ర మహాభారతము : సభాపర్వము -నన్నయ
2. శివరహస్య ఖండము
3. ఆంధ్ర మహాభారతము విరాట పర్వము - తిక్కన
4. నిర్వచనోత్తర రామాయణము - తిక్కన
5. కేయూర బాహు చరిత్రము - మంచన
6. సూర్యరాయాంధ్ర నిఘంటువు - తెలుగు విశ్వవిద్యాలయము




# అధ్యాయం : 6

## శిల్పము : వైదిక లౌకికములు

6.1 శిల్పము విశ్వజనీనమైన కళ అయినా భారతీయ శిల్పాన్ని గూర్చి ముచ్చటించేటప్పుడు భారతీయ ప్రమాణాల ప్రకారమే ముచ్చటించవలసి ఉంటుంది. భారతీయ విషయాలన్నిటికీ మొదటి గ్రంథం లేక విజ్ఞాన రాశి వేదం అందువలన ఈ విషయాన్ని కూడా వేదరాశి నుండి తీసి చూపించకపోతేదాని ఔచిత్యానికి లోపం కలుగుతుంది. కనుక శిల్ప విషయాన్ని కూడా వైదిక దృష్టితో చూడడం అవసరం. వైదిక దృష్టి అన్నప్పుడు గ్రంథరూపంలో ఉన్న వేదము దాని అనుషంగిక వాఙ్మయము దాన్ని ప్రమాణముగా తీసుకొని పెరిగిన మన భారతీయ సంప్రదాయం మీద ముద్రవేసిన యావత్ లిఖిత సామగ్రినీ స్థాలీపులాక ప్రాయంగానైనా ప్రదర్శిస్తూ యీ విషయాన్ని పరిశీలించవలిసి ఉంటుంది. అందువల్ల యీ శీర్షికలో వేద సంహితలు, తదనుబంధ సాహిత్యమూ స్పృశించడం జరుగుతుంది.

6.02 వేదం జ్ఞాన రాశి. అది కాలాంతరంలోనాలుగు భాగాలైంది. ఋగ్యజుసా' మాథర్వణములుగా లోకంలో ప్రసిద్ధి పొందినది. ఋగ్వేదం లో పలుసార్లు త్వష్ట సవిత, ఇంద్ర మొదలైన దేవతలు ఎలా యీ విశ్వ శిల్పాన్ని సృష్టించారో ప్రశంసిస్తూ పలికిన వ్యాక్యాలెన్నో ఉన్నాయి. అంతకంటే మిక్కిలిగా ఋగ్వేదం దశమ మండలంలో ఉన్న పురుష సూక్తము. విశ్వకర్మ సూక్తములలో ఈ శిల్ప సృష్కిఒక దేవుడ్ని నిర్దేశిస్తూ ఎంతో భావ గంభీర వాక్యాలుపలుకుతుంది. వీటినేపథ్యంగా తరువాతి సంహితలు, ఆరణ్యకములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు. అనేకమైన ఉపనిషత్తులు, ఉపమా, అలంకారిక వచనముల ద్వారా పరమేశ్వరుని శిల్ప కృత్యములతో నిండిన ప్రకృతిని - ప్రపంచ వ్యాప్తముగా పెరిగిన వివిధ శిల్పాల్ని గూర్చి ప్రశంసించడం చూస్తాం.

6.03 వేదంలో కారు శబ్దంతో శిల్పిని గౌరవించారు. దానికుదాహరణ చూడండి. ''దేవా! ప్రపంచంలో సంపత్తు యశస్సు గలవానిగా జేయుము. మేమొనర్చు కర్మలతో మేము భూమిపై గల సకల పదార్థములను సరిగా ఉపయోగించు కొందుము గాక ! -ఋగ్వేద 1-31-8

త్వంనో అగ్నేసనయే ధనానాం
యశసం కారుం కృణుహిస్తవానః
ఋధ్యామ కర్మాపసా నవేన
ధేవై ర్ధ్యావా పృథివీ ప్రావత:నః -ఋ.1.318.

6.04 అట్లే కొన్ని మచ్చునకు :

సర్వ జగన్నిర్మాతయగు ప్రజాపతి శిల్పకౌశలము వలన సవిస్తరమైన యీ భూమిని బలమైన దానినిగా జేసెను. అతని క్రియా కౌశలము చేత ఆకాశమును అంతట చంద్రలోకాదులచే చక్కని రూపము గల దానినిగా జేసెను. అట్టి కళా నైపుణ్యముచే సర్వ పదార్థముల పలుకుబడి గల వాక్కును ప్రసాదించు నేర్పరితనమను బలముగల ఓ అగ్ని! ఈ రాజును యీ లోకమున సమృద్ధివంతునిగా జేయుము. అతని కాసామర్థ్యము నిమ్ము - అని తైత్తిరీయ బ్రాహ్మణము అ. 2. ప్ర. 8. అ. 25. ద. 2. లో వివరించబడినది.

కశ్యపుడను పేరుగల ఓ ప్రజాపతీ! నీ శిల్ప కౌశల్యము కాంతివంత మయినదియు, వీర్యములో గూడుకొన్నదియు, సంపూర్ణమగునదియు, చిత్ర విచిత్రములుగా ప్రకాశించునదియునగును. అట్టి యీ శిల్పమునందు సప్త సంఖ్యాకులైన సూర్యులు గూడి నిలిచియున్నారు. అట్టి శిల్పమునందీ రాజును మిక్కిలిగా నాశ్రితుని జేయుము - అని తైత్తిరీయ బ్రాహ్మణము చెప్పుచున్నది. (తై.బ్రా.అ2.ప్ర7అ.25 ద.3)

యత్తేశిల్పం కశ్యపరోచనావత్
ఇంద్రియావత్పుష్కలం చిత్రభాను
యస్మిన్ సూర్యే అర్పితాస్సప్త సాకమ్
తస్మిన్ రాజాన మధి విశ్రయేమ -తై.బ్రా.అ2.ప్ర.7.అ.25.ద.3.

6.05 శిల్ప శబ్దమే ఆశ్చర్యమును గలిగించునది. ఆ శిల్పము దేవ శిల్పము - మానుషశిల్పము నని రెండు విధములు. నాభానేదిష్ఠాదులైన ఏ శిల్పములు గలవో అయ్యవి దేవతలకు, ప్రీతి హేతువులగుటవలన దేవ శిల్పములని చెప్పబడుచున్నవి. అదియే ఉదహరింపబడుచున్నది. లోకమునందు కర్మకారులగు శిల్పులు మృత్తువు దారువు మున్నగువానిచే హస్తము వంటి అకృతిని నిర్మించుచున్నారు. మరికొందరు కంచము నద్దమును సృజించుచున్నారు. మరికొందరు వస్త్రాదులు సృష్టించుచున్నారు. గర్ధభయందు అశ్వము వలన బుట్టిన దానిని అశ్వతరమనబడును. యీ చెప్పబడిన దంతయు మానుష శిల్పము. దీనిని జూచి నాభానేదిష్ఠాది శిల్ప మాశ్చర్యకరమని నిశ్చయింపబడినది. ఇది తెలిసికొనగా శిల్ప కౌశలము నానావిధములుగా నున్నది. అనునాసికముతో గూడిన ప్లుతవర్ణముచే శిల్పములకు పూజ్యత నెరుగవలెను. అందుచే నాభానేదిష్ఠాదులు (దేవా) శిల్పములుగా జెప్పబడినది. అందుచే సువర్ణాభరణాదులవలె శిల్పములు పూజింపదగినవని అర్థము.

ఋగ్వేదీయ ఇతరేయ బ్రాహ్మణం పం. 20, అధ్యాయం 5

ఇలా శిల్పమును ప్రశంసించుటయే గాక శిల్పము తయారు చేసే ఆయుధములైన సుత్తి, పట్టెడ, మొదలైన వానిని గూడ స్తుతించుట గమనింపదగినది.

“యజ్ఞాయుధములయిన స్ఫక్యము, కపాలములు, యజ్ఞమునకు కరణములగుట వలన ఆయుధములని చెప్పబడుచున్నవి. వానిని ఆధ్వర్యుడను, యాజకుడు సంపాదింపవలెను. సాధింపదగిన యజ్ఞమునకు సాధించుచున్న యజ్ఞాయుధములకు భేదము లేకుండుట వలన, యజ్ఞమాయుధములు గలదగుట వలన ఆయుధ సంపాదనమునందు యజ్ఞమునే సంపాదించుచున్నాడు. అని చెప్పి స్ఫక్యము కపాలములు అగ్ని హోత్రహవణి, శూర్పము, కృష్ణా జినము, శయ్య, ఉలూఖలము, ముసలము, దృషత్తు, ఉపల, అను పది యజ్ఞాయుధములను సంపాదించుటయే యజ్ఞము సంపాదించినంత పనియగును. అని వివరణము లిచ్చినారు.

ఈ యంత్రములన్నియు దర్శపూర్ణమాన చాతుర్మాస్య, షోడశి, ఉక్థ్య, చయన, అగ్ని ష్ఠోమ వాజపేయాది యజ్ఞములకు ముఖ్యావశ్యకములు.

6.08 సుత్తె, పట్టుకారు, గొట్టము - కుంపటి, ఉలి, బాడిసె, గొడ్డలి, జలపాత్ర, కమండలువులు నిత్యవ్యవహార శిల్పశాలలకు అవసరములు.

మేరుం టంకం స్వనం భూషావహ్నించ దథతంకరైః కుద్దాలకరణీం వాసామ మీయంత్రం కమండలుం పద్మపురాణ భూఖండ, విశ్వకర్మోపాఖ్యానం.

6.09 అశ్వమేధాది యాగము లొనరించు కాలమున త్వష్టృ దేవతాకమైన చిత్రానక్షత్రముండవలెను.

*చిత్రానక్షత్రం భవతి చిత్రంవా*
*ఏతత్కర్మ యదశ్వమేధ సమృద్ధ్యై* -తై. బ్రా. అవి. ప్ర.8. అ!8

అశ్వమేధ సంకల్ప కాలమునందు నక్షత్ర విశేషము జెప్పబడుచున్నది. బహువిధములయిన అనుష్టింపదగిన యిష్టి పశుసారమాది రూపములు గలదగుట వలన అశ్వమేధ యజ్ఞము చిత్రము గలదయ్యెను. అందువలన నీ కర్మాభివృద్ధికొఱకు చిత్రా నక్షత్రమున నారంభింపవలెను. ఆ చిత్రమనుననది శిల్పమే! చిత్రాధిపతి శిల్పాధిపతియునొక్కడే" యగుట వలన చిత్రానక్షత్రమునకు త్వష్ట (విశ్వకర్మ) యధిపతి యయ్యెను.

భేశాదస్రయ మాగ్ని ధాతృ శశిన : శర్వోదితాఽర్వకృతిః
కద్రూజా : పితరోభగోయ మరవీత్వష్టాసమీర ః క్రమాత్

అని చెప్పుట వలన 'త్వష్టానక్షత్ర మభ్యేత చిత్రాం' అను శ్రుతి వలన చిత్రానక్షత్రాధిపత్యము త్వష్టకే సంభవించుచున్నది. త్వష్టృనక్షత్రమనిన చిత్రమనియే వ్యవహరించుకొనుచున్నారు. త్వష్టృ సంబంధమయిన చిత్రానక్షత్రము శిల్ప సంబంధమైనదని చెప్పకతప్పదు. అశ్వమేధకర్మ చిత్రకరమైనదగుట వలన శిల్పము చిత్రము నొకటి గనుక అశ్వమేధకర్మ శిల్పకర్మకు సంబంధించినదని నిశ్చితమగుచున్నది.

దీనికి బలము నొసంగునదిగా భాగవత వాక్యము చూపుటయైనది.

ఋగ్యజుస్సామాథర్వాఖ్యాన్ వేదాన్ పూర్వాదిభిర్ముఖైః

శస్త్ర మిజ్యాం స్తుతిస్తోమం ప్రాయశ్చిత్తం వ్యధాత్క్రమాత్

ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం వేదమాత్మ భూః

స్థాపత్యం చాసృజద్వేదం క్రమాత్పూర్వాది భిర్ముఖై ః (భాగవత స్కం.6అ.12)

బ్రహ్మదేవుడు తనకున్న తూర్పు మొదలగు నాలుగు ముఖముల నుండి ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము అను నాలుగు వేదములను శస్త్రము (హౌత్యమంత్రము) ఇజ్య (అధ్వర్యునిమంత్రము) స్తుతి స్తోమము (ఉద్గాతృమంత్రము) ప్రాయశ్చిత్తము (బ్రహ్మమంత్రము) అను ఈ నాల్గింటిని ఆయుర్వేదము (వైద్యశాస్త్రము) ధనుర్వేదము (యుద్ధ శాస్త్రము) గాంధర్వము (సంగీత శాస్త్రము) స్థాపత్యము (విశ్వకర్మ సాధ్యశిల్పి) శాస్త్రము అను నాలుగు ఉపవేదములను వరుసగా సృష్టించెను. అని చెప్పియుండుటచే యజ్ఞకర్మలు చెప్పుచున్న వేదము లెక్కడ బుట్టినవో శిల్పకర్మలు చెప్పుచున్న శిల్పవేదములు నక్కడే పుట్టినవి. అవియు బ్రహ్మముఖముననే బ్రాహ్మణోద్దిష్టములు గనే పుట్టినవి. ఇవియు (శిల్పకర్మాదులను) అట్లే పుట్టినవి. కాబట్టి యజ్ఞ-శిల్పములకు భేదము కనిపించదు.

అట్లే

ఆయుర్వేదశ్చికిత్సాశాస్త్రం ఋగ్వేద స్యోపవేదః

ధనుర్వేదోయుద్ధశాస్త్రం యజుర్వేదస్యోపవేదః

గాంధర్వవేదః సంగీతశాస్త్రం సామవేదస్యోపవేదః

స్థాపత్యవేదో విశ్వకర్మాది శిల్పశాస్త్రం

అథర్వ వేదస్యోప వేదః॥ చరణవ్యూహే చతుర్థఖండః

ఆయుర్వేదం అంటే వైద్య శాస్త్రం అది ఋగ్వేదానికి ఉపవేదంగా పిలువ బడుతుంది. ధనుర్వేదం అంటే యుద్ధశాస్త్రం అది యజుర్వేదానికి ఉపవేదం. గాంధర్వ వేదం అంటే సంగీత శాస్త్రం అది సామవేదానికి ఉపవేదం. స్థాపత్యవేదం

అంటే విశ్వకర్మ ప్రణీతమైన శిల్పశాస్త్రం. అది అధర్వణ వేదానికి ఉపవేదం. పవిత్రమైన శిల్పానికి ఉపవేదనామమే గాక నిఘంటు కోశ ద్వితీయాధ్యాయంలో "అవ ఇత్యారభ్యతు:, భీః, శిల్పం - ఇతి షడ్వింశతికర్మనామాని" అని "అప" అను శబ్దము మొదలుకొని శిల్పం అను శబ్దం వరకు ఉన్న ఇరవై యారు శబ్దాలు కర్మనామాలుగా చెప్పబడడంచేత శిల్పశబ్దానికి క్రతుశబ్దం పర్యాయంగా చెప్పడంలో అభ్యంతరం లేదు. అందువల్లనే "మోక్షేధీర్జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్ర యోః అని నామలింగాను శాసన బ్రహ్మవర్గంలో చెప్పబడినది. దీన్ని ఆధారం చేసుకొనే గాబోలు భాగవత ధవమస్కంధంలో

'ధృశ్యతే యత్రహి త్వాష్ట విజ్ఞానం శిల్పనైపుణం అని వర్ణించారు. కాబట్టి శిల్పంనైపుణ్యం అనేది పిండితార్థం.

6.11 ఇక వేదాంత పద్ధతిలో వ్యాఖ్యానిస్తే కర్మయోగం అంటే క్రియాయోగమే! క్రియా యోగమంటే శిల్పమే శిల్పం స్రువే క్రియాయోగే అని విశ్వమేదినీ కోశం చెబుతున్నది. శిల్పము వలన బుట్టిన దేవమూర్తిని ధ్యానం చేస్తే పూజిస్తే సమాధి సుఖం అబ్బుతుంది. శిల్పం సమాధి సుఖానికి సాధనం. శిల్ప శబ్దానికి వ్యుత్పత్తి చెబుతూ శీల - సమాధౌ- అని పరస్మై పదమైన శీల శబ్దానికి సమాధి అని అర్థం. యత్ శీలతి సమాదధాతి తత్ శిల్పం (కౌశలం) ప్రస్వాదేశః కృత్రప్రత్యయాంతో నిపాత్యతే అనురూపము యొక్క వివరణ ద్వారా శిల్పం అంటే సమాధి సుఖదాయకమైంది అని తెల్తుంది.

6.12 శిల్పం చేయడం వల్ల పుణ్యం లభిస్తుంది.

మీమాంసా శాస్త్రంలో ఒక సూత్రం ఉంది. అది ఏమంటే 'జ్యోతి ష్టోమో స్వర్గ కామో యజేత' అని అంటే స్వర్గం కావాలనుకునే వాడు యజ్ఞం చేయాలి' అని. ఐతే శిల్పం వల్ల ఉపయోగం ఏమిటి? అని అంటే శిల్పం చేసే వాళ్ళు స్వర్గవాసాది సుఖాల్ని చతుర్విద పురుషార్థాల్ని పొంది చివరికి దేవతల్లో కలిసి పోతారు అని వేదం చెబుతోంది.

6.12 విష్టీశమీతరణిత్వేనమఘతోమర్తాసః
సతో అమృతత్వ మానసు :

సౌధన్వానాఋభవ స్సూరచక్షసః
సంవత్సరే సమపృచ్యంత ధీతిభిః

ఋగ్వేద అ॥అ8 మ 30 మం4

భాష్యం =సౌధన్వానా : సుధన్వఋషేఃపుత్రాః ఋభవః మర్తాసోవాఘతః సంతో మరణధర్మాణో యజమానాః సంతోషి తరణిత్వేన శీఘ్రత్వేన శమీ విష్టీ ఆత్మానం కర్మణా వ్యాపృతం కృత్వా కుశల కర్మాణి ఏకంచమనం చతుర: కృణోతనేత్యాదినా దేవై రుక్తాని కర్మాణి కృత్వా అమృతత్వ మానశుః అమరత్వం ప్రాపుః! సంవత్సరే చైకస్మిన్నేవ వర్షేగతే సూరచక్షసః సూర్యపత్తేజో యుక్తా భూత్వాధీతిభి: సమపృచ్యంత ఉపాసక కృతైర్యజ్ఞాదిభిః కర్మభిః స్తోత్రైశ్చ స[illegible]క్తా అభవం స్తేషాం ప్రీత్యర్థముపాసకాః కర్మాణి స్తోత్రాణి చాకుర్వన్॥

సుధన్వన ఋషి పుత్రులగు ఋభువులు తాము మరణ ధర్మము గల వారయ్యు నొక్క చమసమును నాలుగు చమసములుగ జేయుట మున్నగు పనులు దేవతల ఆజ్ఞ ప్రకారము నిర్వర్తించుటచే దేవతలు సంతోషించి వారికి దేవత్వము ప్రసాదించిరి. దేవత్వమును పొందిన తర్వాత ఆ సుధన్వ పుత్రులు సూర్యునితో సమానమైన తేజస్సు గలిగి సంవత్సరభాగమైన వసంతాదికాలములయందు చేయుదగిన అగ్నిష్టోమాది కర్మలలో హవిర్భాగములనుగ్రహించి యజ్ఞములు చేయు వారిని ఆశీర్వదించు అంతస్తును పొందగలిగిరి.

6.13 అట్లే సువర్ణాభరణాది శిల్పములను ధరించుటవలన కూడా మానవులకు ఎన్నో మంచి ఫలితాలు కలుగుతాయని వేదం చెప్పింది.

దృశానో రుక్మ ఉర్వ్యామ్యద్యో
ద్దుర్మర్ష మాయుశ్శ్రియే రుచానః

యజుః కాం. 4. ప్ర.1. అ.10

భాష్యం॥ దృశానః దర్శనీయరూపః రుక్మః సువర్ణ
నిర్మితః ఫలకాకాశ ఆభరణ విశేషః

ఉర్వ్యామహత్యా దీప్త్యావ్యద్వైత్, విద్యో
తతేస్మకింకుర్వన్ దుర్మర్షం అతిరస్కార్యం
ఆయుః జీవనం శ్రియే శ్రీయుతం రుచానః వాంఛన్॥

ఆకర్షవంతమై చూడాలనిపించే మేలిమి బంగారంతో చేసిన ఫలకాకారంగల ఆభరణం బాగా ప్రకాశిస్తున్నది. దీన్ని ఆయుష్యం లక్ష్మి కావాలనుకొనేవారు ధరించాలి. అని దీని అర్థం. దీన్ని పురాణంలో వ్యాఖ్యానిస్తూ "అగ్నిరేతస్సువర్ణ స్యాత్" అని అగ్ని పురాణం చెప్పింది. అంటే బంగారం అగ్నికి రేతోరూపమని అర్థం దీన్నే వేదంలో యింకోచోట

6.14 యోబభర్తి దాక్షాయణా హిరణ్యం

స దేవేషు కృణుతే దీర్ఘమాయుః॥

సమనుష్యేషు కురుతే దీర్ఘమాయః॥

ఋక్ కా.9అ.రి.సూ.16

తా॥ ఎవడు దేవతలయందు ప్రీతిచే బంగారమును ధరించునో వాడు దీర్ఘాయుష్యమును పొందుచున్నాడు. అట్లే బంగారు సొమ్ములు ధరించవలెనని వేదములో చెప్పినందున మన పూర్వులు గృహస్థులగువారికి జరుగవలసిన సంస్కారములలో దీనిని జోడించి ప్రచారములోకి తెచ్చినారు.

స్వర్ణభూషణధారణ వేదోక్త మంత్రములు:-

6.15 వివాహానికి ముందు స్నాతక వ్రతమనే ఒక కర్మ చేస్తారు. అప్పుడు స్నాతకుడనబడే పెండ్లి కొడుక్కి భూషణధారణం చేయించాలి. క్రొత్తగా చేసిన బంగారపుటుంగరాన్ని యివ్వాలి. అదిపెట్టేటప్పుడు ఈమంత్రాల్ని చదవాలి అని ప్రయోగపారిజాతం అనే గ్రంథం చెబుతుంది. "భూషణైశ్చాయుష్యవర్చస్య మితి సూక్తం పఠన్ భూషయేత్"

అథ సూక్తం :

ఆయుష్య మితిసూక్తస్య సానగాద్యాఋషయః

హిరణ్యందేవతా। ఆద్యాశ్చత స్రోనుష్టభః

పంచమి। అలంకార ధారణే వినియోగః॥

ఆయుష్యం వర్చస్యం రాయస్పోషమాద్బిద్యం।

ఇదం హిరణ్యం వర్చస్వం। జైత్ర్యాయా విశతాదిమాం। ఉచ్చైర్వాజిపృతనాషాట్ సభాసాహోధనంజయం। సర్వాః సమగ్రాబుద్ధయో హిరణ్యేస్మిం త్సమాహితాః। శునమహం హిరణ్య పితుర్మానేవ జగ్రభం। తేనమాం సూర్యత్వచమకరం పూరుషప్రియం।

సమ్రాజంచ విరాజంచాభిష్టిర్యాచమే(ధ్రువా) లక్ష్మీ రాష్ట్రస్యయా ముఖే తయా

మామింద్రసంసృజ॥

ఆయుస్సుకూ వర్చస్సుకూ కారణమైనదీ సర్వధనాలకూ మూలమైనదీ కీర్తినిచ్చేది అయిన బంగారం మీపై ప్రవేశించుగాక! ఉచ్చైర్వాదములు శత్రుధనాల్నిజయించడమూ సమగ్రమైన ఐశ్వర్యము ఈ బంగారంలో ఉన్నాయి. ఓ బంగారమా! తండ్రిలా నిన్ను జపిస్తున్న నన్ను సూర్యుని వంటితేజం గలవాడ్నిగాచేయి. ప్రజల్లో ప్రియమైన వానిగా జేయి. నన్ను సమ్రాట్టు అని విరాట్టు అని ఏ లక్ష్మి వలన పొగడబడుతున్నానో ఆ లక్ష్మిని మా యింట్లో ఆనందంతోఉండేట్లుచేయి అని బంగారు వస్తువుల్ని ధరించాలి. ఐతే ఇవి ఋషిప్రోక్తములు సుమా అని చెప్పడానికి సానగాదుల పేర్లు నిర్ధారింపబడ్డాయి. ఇవి వీరిపరంపరలో ఎప్పుడూ ఉండాలని పద్మ పురాణం ఆశీర్వదిస్తున్నది.

సౌవర్ణం రాజతం చైవ

తామ్రం పాషాణదారవీం

శిల్పి త్వత్సంతతౌ స్థాతా

యావత్కలియుగం దృఢం॥

అలాగే శిల్పులు తమ శిల్పాల్ని చేయడానికి అగ్నిని ఉపయోగిస్తారు. గనుక ్బానికి సంబంధం చక్కగా స్తుతింపబడ్డది.

అగ్ని స్పష్టిం వాజంభరం

దదాత్యగ్నిర్ వీరం శ్రుత్యం కర్మ నిష్టాం

అగ్నీ రోదసీ విచరత్సమంజన్ అగ్నిర్ నారీం వీర కుక్షింపురంధి

ఋ.9.3.12.

భా॥ అయమగ్నిః సప్తిం సర్పణస్వభావ మశ్వం వాజంభరం యుద్ధే శత్రూన్ జితా అన్న సంపాదకందదాతిస్తోతృభ్యః॥తథాగ్నిర్వీరం వీర్యవంతం పుత్రం శ్రుత్యం పితృవ్యపదేశకం కర్మనిష్టం యాగోనన్య చిత్తందదాతి అగ్నిరోదసీద్యావా పృథివ్యో సమంజన్ సమ్యగ్జయన్ విచరత్ వివిధం చరతి అయమగ్నినారీం యోషితం వర కుక్షింపురం ధించ

6.17 ఈ అగ్నీ పరుగెత్త గల అశ్వమును యుద్ధమందు శత్రువులను జయించి అన్న సంపాదకమును ఉపాసకులకు ఇచ్చుచున్నావు. అట్లే ఈ అగ్ని పరాక్రమవంతుడగు పుత్రుని యాగమందనన్య చిత్తమును ఇచ్చుచున్నాడు. మఱియు దివమునందును పృథివియందును జయించి చక్కగా తిరుగు చున్నాడు. స్త్రీని వీరులగు కుమారుల నిచ్చు దానిగను ఐదవతనము గల దానిగను చేయుచున్నాడు. ఇట్లనుటచే ఈ అగ్నియందు మరియొక మంత్రము జోడింపబడుచున్నది.

త్వష్టా వీరం దేవకామంజజాన

త్వష్టురర్వా జాయత ఆశురశ్వః॥

అనే మంత్రంలో శిల్ప కర్మ నిష్ఠాగరిష్ఠుడూ ఐన త్వష్టనుద్దేశించియే చెప్పట జరిగినది. అట్లేదీనిలో అగ్నిని త్వష్టగానే చెప్పట చూడవచ్చు.

6.18 ఇంకొ ఋక్కు

అగ్నేరప్నసః సమిదస్తు భద్రాగ్నిర్మహీ

రోదసీ అవివేశ। అగ్ని రేకంచోదయ

త్వమగ్ని ర్వృత్రాణి దయతే పురూణి।

భా॥ అప్నసః కర్మవతోగ్నే! సమిద్భద్రాస్తు॥

అయమగ్నిర్మహీ మహత్యౌ రోదసీ ద్యావాపృథివ్యౌ

నావివేశ ఆవిష్టవాన్ స్వతేజసా। తథాయమగ్నిరేక మసహాయ మేవ చ్ఛోదయతి సమిత్సు సంగ్రామేషు। యుద్ధే స్వభక్తం స్వయం సహాయఃసన్ జయినం కరోతీత్యర్థః తథాగ్ని ర్వృత్రాణి పురూణి బహూన్ శత్రూన్ దయతే హన్తి।

తా॥ శిల్పకర్మాత్మకుడగు అగ్నికి సమిధ కల్యాణదాయకమగు గాక! ఈ యగ్నీ ద్యులోక భూలోకములను ప్రవేశించును. అట్లు ప్రవేశించిన యీ అగ్ని తన భక్తుని స్వసహాయుడై జయమునుబొందువానినిగా చేయుచున్నాడు. అటులనే యీ అగ్ని శత్రువులను చంపుచున్నాడు.

ఇందులో చెప్పిన కర్మ శిల్ప కర్మయేనా? అన్నచో వేఱుగాదని సమాధానము చెప్పబడినది. ఏలన : భాస్కరాచార్యకృతవైదిక కోశమునందు "కర్త్యం కర్తో వ్రతం విష్టీ శగ్నం వేపశ్చ కర్వరం శమీ శిల్ప శమీశక్తిర్థంసోప్న ఇతికర్మణః" అని యన్నందున యీపై శబ్దములన్నియు సమానార్థకములు. అందువలననే సాయణాచార్యులవారు "శమీభిష్టి అప్నసః!... అను పదముల కర్థము వ్రాయునప్పుడు "రథ యజ్ఞ పాత్రాదీని కుశల కర్మాణి కౌశలేన కర్మాణి కుర్వంత ఋభవః" అని వివరించిరి. కావున అప్నసః= అన్నప్పుడుశిల్పకర్మగరిష్ఠులని అర్థముగాక మానదు. ఇక నీ శిల్పము వేప శిల్పములే! ఈ యర్థమునే వేదమెట్లు సమర్థించుచున్నదో గనుడు.

6.19 అగ్నయే బ్రహ్మఋభవస్తతక్షు
రగ్నిం మహిమవోచా మాసువృక్తిం
అగ్నే ప్రావజరితారం యరిష్ఠాగ్నే
మహింద్రావిణ మాయజస్వ

భా॥ అగ్నయే బ్రహ్మస్తోత్రం ఋభవో మేధావినస్తతక్షుః+అకుర్వన్। వయంచ మహా మహాంత మగ్నిం ప్రతి సువృక్తిం స్తుతి మవోచామ! హేయరిష్ట యువతమాగ్నే జరితారం ప్రావప్రచక్షాహ అగ్నే ! మహిమద్ద్రవిణ ధనమాయజస్వ। ప్రయచ్ఛే త్యర్థః। అత్ర ప్రతివాక్య మగ్న్యే భిధానం తస్య స్తుతిత్వ రపదర్శనార్థం॥

6.20 అగ్నికొఱకు స్తోత్రమును మేథా వంతులగు ఋభువులు చేసిరి. ఇక్కడ తతక్షుః అను క్రియావచనమువలన త్వష్ట్యత ప్రతిపాదింపబడినది. మేమును గొప్పవాడైన యీ అగ్నిని స్తుతించుచున్నాము. యువకుని వలె ప్రజ్వలించుచున్న ఓ అగ్నీ! స్తుతించుచున్న మమ్ము రక్షింపుము. ఓ అగ్ని! గొప్పదనము మాకిమ్ము! ప్రతి వాక్యము నందిచ్చుట ఉచ్చరించుట- స్తుతించుట-తెలియుటకొరకు ఇట్లనుటచే రథ-మూర్తి-సూక్తాదులరచించుటలో కలాకౌశలము కలిగిన ఋభువులు శిల్ప వచనము నందు నిర్విఘ్నమగుటకు అగ్నిరూపమగు విశ్వకర్మను ధ్యానమొనర్చి శిల్పకార్యము నెఱవేర్చుకొనుటతెలియుచున్నది. అటులగానిచోనీ సూక్తమునే వాస్తుశాంతి ప్రయోగాంతమునందు.

ఆద్యేత్యాది

వాస్తుపురుష ధ్రువమూర్త్యోః ఘనదోష పరిహారార్థం అగ్న్యుత్తరణ పూర్వకం ప్రాణ ప్రతిష్ఠాం కరిష్యే ఘృతేనాభ్యజ్య అగ్నిః సప్తి మితి సూక్త మగ్నిపదహీనం పఠన్ పునస్యాగ్ని పదం పఠన్ ప్రతిమాయాముదకం పాతయేదిత్యాది॥

6.21 అని దేవమూర్తి ప్రతిష్ఠాకార్యము నందు ఘృతదుగ్ధోదకములచే అభిషేకించునపుడు 'అగ్నిస్సప్తి' అనుఋుక్సప్తకమును పఠింపవలెనని చెప్పియున్నది. దీనివలన గూడ అగ్ని సూక్తము శిల్ప కార్య సంబంధమయినదనియు నీ యగ్ని శిల్పముతో గూడిన వాడనియు తెలియుచున్నది.

కనుక వేద వాఙ్మయములో శిల్పమును వివిధార్థములుచూపించినప్పటికీ దాని పవిత్రత లోకోత్తరత బాగానే ప్రశంసింపబడ్డది.

---

## సందర్భ గ్రంథాలు


1. విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమము - వడ్డెపాటినిరంజన శాస్త్రి
2. శిల్ప దర్శనం - డా॥ కొండూరు వీర రాఘవాచార్యులు
3. వాస్తు సూత్ర ఉపనిషత్ - డా॥ పెదపాటి నాగేశ్వరరావు
4. తెలుగు విజ్ఞాన సర్వస్వము - 14వ సంపుటము

# అధ్యాయం : 7

## శిల్పము : కళ

7.01 మనకు దేశంలో ఎన్నో కళలున్నాయి. అందులో శిల్పం అగ్రశ్రేణిలో నిలిచే కళగానే భారతీయులు గౌరవిస్తారు. మనకున్న అరవైనాలుగు కళల్లో ఇది ఒకటి. ఆ అరవై నాలుగు ఏవీ? అంటే వివిధ శాస్త్ర కర్తలు వేర్వేరు పట్టికలిచ్చారు. కాని వాటన్నిటిలో నియంతగా నిలిచేది శిల్పం. "గ్రంథ సంజ్ఞాదర్పణం" అనే పుస్తకంలో వాటి పట్టిక యిలా ఉంది.

7.02 1. సంగీత, 2. సాహిత్యం, 3 శిల్పం, 4. వాస్తువు, 5. భరతం, 6. బ్రహ్మావాదం, 7. ధాతువాదం, 8. రసవాదం, 9. జలవాదం, 10. విషవాదం, 11. కన్యావాదం, 12. గోలక్షణం, 13. గజలక్షణం, 14. అశ్వలక్షణం, 15. పురుషలక్షణం, 16. స్త్రీలక్షణం,17. తర్కం, 18. మీమాంస, 19. ఇతిహాసం, 20. అలంకారం, 21. అక్షర లక్షణం, 22. మృషావాదం, 23. విషవాదం, 24. క్షాత్రకర్మ, 25. భూతశిలాపాతం, 26. అశ్వవైద్యం, 27. గజవైద్యం, 28. పశువైద్యం, 29. నరవైద్యం, 30. ఇంద్రజాలం, 31. మహేంద్రజాలం, 32. గోకర్ణ విద్య, 33. గజకర్ణవిద్య, 34. తృణావధాన, 35. శబ్దావధాన,36. భుజావధాన, 37. ఘంటావధాన, 38. హస్తచలన, 39. నయనసంజ్ఞ, 40. భాషా విశేష, 41. భ్రమణ, 42. పోషణ, 43. విద్వేషణ, 44. ఉచ్చాటన, 45. ఆకర్షణ, 46. అంజన, 47. అదృశ్య, 48. భృగుమత, 49. భేతాళమత, 50. ఆయుధాభ్యాస, 51. యోగశాస్త్ర, 52. చిత్రకళ, 53. రథారోహణ, 54. గజారోహణ, 55. అశ్వారోహణ, 56. మోహస్తంభన, 57. వయస్తంభన, 58. అగ్నిస్తంభన, 59. బలస్తంభన, 60. ఖడ్గస్తంభన, 61. ఘటికాసిద్ధి, 62. పాదుకాసిద్ధి, 63. మంత్రసిద్ధి, 64. పరకాయ ప్రవేశ.

7.03 ఈకళల్ని చాలా కాలంగా మనదేశంలో ఆదరించి పోషించబడడం చూస్తున్నాం!

7.04 వాస్తువు భవన నిర్మాణానికి సంబంధించినదైతే శిల్పం వివిధ నిర్మాణాలకు సంబంధించిన ప్రక్రియ విగ్రహం-యంత్రం-యానం-చిత్రం-ఇవన్నీ శిల్పం క్రిందకే వస్తాయి. అన్నిటిలోనూ మానవ జీవితాన్ని సుసజ్జితం చేయడమనే ప్రక్రియ ప్రధానంగా ఆయా వస్తు జాలాన్ని శిల్పాలుగా పరిగణించడం జరుగుతుంది. అందుకే

యోగో జ్ఞానం తథాసాంఖ్యం
విద్యా: శిల్పాది కర్మచ
వేదా: శాస్త్రాణి విజ్ఞాన
మేతత్సర్వం జనార్ధనాత్॥ భీష్మయుధిష్ఠిర సంవాదే
మహాభారతేఅనుశాసనపర్వణి దానధర్మే

7.05 సాంఖ్య యోగము, వీనియందలి జ్ఞానము అష్టాంగయోగములు వీనియందలి విద్యలు శిల్పములు మున్నగు కర్మలు, వేదములు శాస్త్రము వీనియందలి విభాగజ్ఞానము, ఈ సర్వము పరమేశ్వరుని వలననే వచ్చినది. అని వేదశాస్త్ర జ్ఞానరాశియంతయు సమానములుగానే పరిగణించి చెప్పబడ్డాయి.

అలాగే భగవద్గీతలో
శమోదమస్తపఃశౌచం క్షాంతిరార్జవమేవచ
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజం - భగవద్గీత 18 అధ్యాయం.

శమము, దయ, తపస్సు, శౌచము, క్షాంతి అర్జవము, జ్ఞానము, విజ్ఞానము, అస్తిక్యము, మొదలగు గుణములు బ్రాహ్మణులకు స్వభావ సిద్ధములు ఇక్కడ జ్ఞానం - విజ్ఞానం అంటే మోక్షే ధీర్జాన మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః' ' అని నామలింగాను శాసనం బ్రహ్మవర్గంలో వివరించబడింది. జ్ఞానం అంటే మోక్షం కొఱకైన బుద్ధి అని విజ్ఞానం అంటే శిల్పమందలి శాస్త్రమందలి బుద్ధి అనీ చెప్పబడడం చేత విజ్ఞాన మయమైన శిల్పం కూడా బ్రాహ్మణులకు స్వాభావికమని తెలుస్తుంది.

7.06 చూడోపనయవాదీని కర్మాణ్యస్య చకార

కృత్వాచాధ్యాపయామాస వేదాన్ సాంగపదక్రమాన్
సుశిల్పానిచ కర్మాణి నిర్మలంజ్ఞానమేవచ
శాస్త్ర లోక ప్రమాణాని తథా శాస్త్రాణి సర్వశః
పంచజ్ఞానాని జాతాని జ్యోతిర్గణ విచేష్టితం
మాతృకంచ మహాతేజో యోగాభ్యాసమనుత్తమం
పంచబుద్ధివైస్సర్వం తేనాధీత మశేషతః

॥సహ్యాద్రి ఖండము॥

బ్రహ్మణ బాలకునికుపనయనం కాగానే షడంగాది పద క్రమంతో కూడిన వేదాలూ, ధనుర్వేద గాంధర్వ వేదాంతర్గతమైన శిల్ప కర్మలూ, ఆధ్యాత్మిక తత్వశాస్త్రాలు, ఇతర లౌకిక శాస్త్రాలు వ్యాకరణ జ్యోతిశ్శాస్త్రాలూ, యోగాభ్యాసాలు మున్నైనవన్నిటినీ దైవమహిమ వల్ల అతడైదురోజుల్లో అభ్యాసం చేశాడు. బ్రాహ్మడు అన్నీ నేర్చుకోవాలి.

7.07 రసాః స్నేహాస్తథాగంధా రత్నాని మణయస్తథా
కాంచనాద్యానిలోహాని చాగ్ని హోత్రకృతే। భవన్
యజ్ఞపాత్ర పవిత్రార్థం ద్రవ్య సంభరణాయచ
సర్వయజ్ఞ వికల్పాయ పురాకల్పం ప్రకల్పితం
సువర్ణాదికం యజ్ఞ పాత్రార్థమేవ
వేద్యర్థం పృథివీ సృష్టా ॥
గావో యజ్ఞార్థ ముత్పన్నా
దక్షిణార్థం తథైవచ
సువర్ణం రాజతంచైవ
పాత్రికం భార్యమేవచ॥
వృద్ధగౌతమసంహితా॥

పాదరసము వంటి రసములు, తైలములు, గంధములు, రత్నములు, మణులు, సువర్ణములు, మున్నగులోహములు అగ్నిహోత్రములో ఉపయోగపడుట కొఱకే పుట్టినవి. సువర్ణాదులు యజ్ఞ పాత్రల కొఱకు

భూమి యజ్ఞవేదిక కొఱకుసృష్టించబడినది. ఆవులు కూడా యజ్ఞం కొఱకే పుట్టాయి. అంటే గోవులు యజ్ఞ దక్షిణ కొఱకే, బంగారు, వెండి అనేవి యజ్ఞ పాత్రలు చేయడానికిపుట్టినవే! కాబట్టి వెండి బంగారం వెండి లాంటివే యజ్ఞం కొరకైతే ఆ పాత్రలలో ఇప్పుడు ఉన్న శిల్పాలు గూడ యజ్ఞార్థమే గదా! శిల్పాలన్ని దైవదత్తాలే! దీనికుదాహరణగా స్కందపురాణం, కాశీ ఖండంలో విశ్వకర్మేశ్వర లింగ మహాత్యం వివరిస్తూ దేవదేవుడేమన్నాడో వినండి.

పార్వత్యువాచ

శ్లో॥ విశ్వకర్మేశ్వరం లింగం యత్కాశ్యాం ప్రథితం పరమ్।
తస్య లింగస్య కథయ దేవదేవ సముద్భవమ్ ॥

॥దేవదేవ ఉవాచ॥

శృణుదేవి ప్రవక్ష్యామి కథాం పాతకనాశినీం ।
విశ్వకర్మేశ లింగస్య ప్రాదుర్భావం మనోహరమ్ ॥

కృతోపనయనః సోథ బాలో గురుకులేవసన్ ।
చకార గురుశుశ్రూషాం భిక్షాన్న కృతభోజనః॥

ఏకదా తద్గురుః ప్రాహ ప్రావృట్ కాలే సమాగతే ।
కురూటజం మదర్థం త్వం యథా ప్రావృణ్నబాధతే ॥

యత్కదాచిన్నభజ్యేత న పురాతనతాం వ్రజేత్
గురుపత్న్యాత్వభి హితో రేత్వాష్ట - కురు కాంచన కంచుకమ్ ॥

మమాంగ యోగ్యం నోగాఢం నశ్లథంచ ప్రయత్నతః।
వినైనవాస సాచారు వల్కలంచ సదోజ్జ్వలమ్ ॥

గురుపుత్రేణ చాజ్ఞప్తో మమార్థం పాదుకే కురు ।
యాభ్యాంచ సంచరే వాథ స్థల భూమా విన ద్రుతమ్ ॥

గురుకన్యాసి తం ప్రాహ త్వాష్ట్ర ! మే శ్రవణోచితే ।

భూషణే స్వేనహస్తేన కురు కాంచన నిర్మితే ॥

కుమారీ క్రీడనీయాని కౌతుకాని చ దేహిమే ।
దంతిదంత మయాన్యేవ స్వహస్త రచితానిచ ॥

గృహోపకరణం ద్రవ్యం ముసలోలూఖలాదికమ్ ॥
తథా ఘటయ మేధావిన్ ! యథాథా త్రుట్యతి న క్వచిత్ ॥

అక్షాలితాన్యపి యథా నిత్యం పీఠాని సత్తమ ।
ఉజ్జ్వలాని భవంత్యేవ స్థాలికాశ్చ తథా కురు ॥

సూపకర్మణ్యపి చ మాం ప్రశాధి త్వష్టృనందన !
యథాంగుల్యో నదహ్యంతే పాకః స్యాచ్చ యథా శుభః॥

ఏక స్తంభమయం గేహ మేకదారువి నిర్మితమ్ ।
తథాకురు వరం త్వాష్ట్ర ! యత్రేచ్ఛా తత్ర ధారయే ॥

యే సహాధ్యాయినోప్యసః వయోజ్యేష్ఠాశ్చతేపిహి ।
సర్వేసర్వ సమీహంతే కర్మ తత్కృతమే వహి ॥

తథేతి సప్రతిజ్ఞాయ సర్వేషాం పురతో ద్రిజే ।
మధ్యేవనం ప్రావిశచ్చ మహాచింతాభయార్ధిత ః॥

కించిత్కర్తుం సజానాతిప్రతిజ్ఞాతంచ తేన వై ।
సర్వేషాం పురత ః సర్వం కరిష్యామీతి నిశ్చితమ్ ॥

కింకరోమి క్వగచ్ఛామి కోమే సాహాయ్యమర్చయేత్ ।
బుద్ధేరపి వనస్థస్య శరణంకం ప్రజామిచ ॥

అంగీకృత్య గురోర్వ్యాక్యం గురుపత్న్యా గురోఃశిశోః।
యోన నిస్పాధయే న్మూఢః సభవేన్నిరయే నరః॥

గురుశుశ్రూషణం ధర్మ ఏకహి బ్రహ్మచారిణామ్ ।
అవిష్పాద్యతు తద్వాక్యం కథం మే నిష్కృతిర్భవేత్ ॥

గురుణాం వాక్యకరణా త్సర్వఏవ మనోరథాః।

సిద్ధ్యం తీతరథా నైవ తస్మాత్కార్యం హితద్వచః॥

కథం తద్వ చః సిద్ధిం ప్రాప్స్యామ్యత్రవనేస్థితః॥
కశ్చమే త్రసహాయీ స్యాద్ధిషణా దుర్బలస్య వై ॥

అస్తాం గురుకథా దూరం యో న్యస్యాపిల ఘోరపి ।
ఓమిత్యుక్త్వా నకురుతేకార్యం సో థవ్రజత్యధః ॥

కథమేతాని కర్మాణి కరిష్యే జ్ఞో సహాయవాన్ ।
అంగీకృతాని తద్భీత్యా నమస్తే భవితవ్య తే ॥

యావదిత్థం చింతయతి సత్వాప్రోవననుధ్యగః।
తావత్తదైవ సంప్రాప్త స్తైన్తై కో దర్శి తాపసః॥

అథ నత్వాస తంప్రాహ వనేదృష్టం తపస్వినమ్ ।
కోభవాన్ మానసం మే యో నితరాం సుఖయత్యహో ॥

త్వద్దర్శనేన మేగాత్రం చింతా సంతాప తాపితమ్ ।
హిమానీ గాహనేనేవశీతం భవతి క్షణమ్ ॥

కిం త్వం మే ప్రాక్తనం కర్మ ప్రాప్తం తాపస రూపధృక్ ।
అథవా కరుణావర్ధి రావిర్భూతః శివోభవాన్

యోసిసోసి నమస్తుభ్య ముపదేశేన యుంక్ష్వమామ్ ।
గురూక్తం గురుపత్న్యుక్తం గుర్వపత్యోక్తమేవచ ॥

కథం కర్తుమహం శక్తః కర్మ తత్రాదిశాద్భుతమ్ ।
కురు మే బుద్ధి సాహాయ్యం నిర్జనే బంధుతాం గతః॥

ఇత్యుక్త స్తేన వనేతాపసో బ్రహ్మచారిణా !
కారుణ్య పూర్ణ హృదయో యథోక్త ముపదిష్టవాన్ ॥

య ఆప్తత్వేన సంపృష్టో దుర్బుద్ధిం సంప్రయచ్ఛతి ।
సయాతి నరకం ఘోరం యావదాభూత సప్తకమ్ ॥

॥తాపస ఉవాచ॥

బ్రహ్మచారిన్ శృణు బ్రూయాం కిమద్భుతతరం త్విదమ్ ।
విశ్వేశానుగ్రహా ద్బ్ర హ్మాప్యభవత్సృష్టికోవిదః ॥

యది త్వం త్వాష్ట్ర సర్వజ్ఞం కాశ్యామారాధ యిష్యసి ।
తతస్తే విశ్వకర్మేతి నామ సత్యం భవిష్యతి ॥

విశ్వేశాను గ్రహా త్కాశ్యా మభిలాషా న దుర్లభాః ।
సులభో దుర్లభో స్వత్ర యత్ర మోక్ష స్తనుత్యజామ్ ॥

సృష్టేః కరణసామర్థ్యం సృష్టిరక్షా ప్రవీణతా ।
విధినా విష్ణునా ప్రాపి విశ్వేశానుగ్రహాత్పరాత్ ॥

యాహి వైశ్వేశ్వరంపద్మ పద్మయా సమధిష్టితమ్ ।
నిర్వాణ సంజ్ఞయా బాల యదీచ్ఛేః స్యాన్మనోరథాన్ ॥

సహిసర్వప్రదః శంభు ర్యాచిత శ్చోపమన్యునా ।
పయో మాత్రం దదౌ తస్మై సర్వం క్షీరాబ్ధిమేవ చ॥

ఆనందకాననే శంభో: కిం కింకేన నలభ్యతే ।
యత్ర వాసకృతాం పుంసాం ధర్మరాశిః పదేపదే ॥

స్వర్ధునీ స్పర్శమాత్రేణ మహాపాతక సంతతి:॥
యత్ర సంక్షయతి క్షిప్రం తాం కాశీం కో నసం శ్రయేత్ ॥

న తాదృద్ధర్మ సంభారో లభ్యతే క్రతుకోటిభిః।
యాదృగ్వారాణసీ వీథి సంచారేణ పదేపదే ॥

ధర్మార్థ కామమోక్షాణాం యద్యత్రాస్తి మనోరథః।
తదా వారాణాసీం యాహీ యాహి త్రై లోక్య పావనీమ్ ॥

సర్వ కామ ఫల ప్రాప్తి స్తదైవస్యాద్ ధ్రువం నృణామ్ ।
యదైవ సర్వదః సర్వః కాశ్యాం విశ్వేశ్వర: శ్రితః॥

స తాపసోక్త మాకర్ణ్య త్వాష్ట ఇత్థం సుహృష్టవాన్ ।
కాశీ సంప్రాప్యపాయంచ తమేవ సమపాచుత ॥

॥త్వాష్ట్ర ఉవాచ ॥

తదానందవనం శంభోః క్వాస్తి తాపస సత్తమ ।
యత్రనో దుర్లభం కించి త్సా ధకానాం త్రయీస్థితమ్ ॥

స్వర్గే వా మర్త్యలోకేవా బలిసద్మని వా మునే ।
క్వతదానందగహనం యత్రానంద పయోబ్ధిజా ॥

యత్ర విశ్వేశ్వరో దేవో విశ్వేషాం కర్ణధారకః।
వ్యాచష్టే తారకం జ్ఞానం యేన తన్మయతాం యయుః॥

సులభా యంత్ర నియత మానంద వనచారిణః॥
అపినై శ్రేయసీ లక్ష్మీః కిమన్యేల్ప మనోరథాః॥

కస్తాం మాం ప్రాపయేచ్ఛంభోః కథం యామితథా వద ।
సతపస్వీతి తద్వాక్య మాకర్ణ్య శ్రద్ధయా న్వితమ్ ॥

ప్రాహాగచ్ఛ నయామి త్వాం యయాసు రహ మప్యహో।
దుర్లభం ప్రాప్య మానుష్యం యది కాశీ న సేవితా ॥

పునః క్వ నృత్యం శ్రేయోభూః క్వ కాశీ కర్మ బంధహృత్।
వృథా గతే హి మానుష్యే కాశీ ప్రాప్తి విసర్జనాత్ ॥

ఆయుష్యంచ భవిష్యం చ సర్వమేవ వృథాగతమ్ ।
అతో హం సఫలీకర్తుం మానుష్యం చాతిచంచలమ్ ॥

యాస్యామి కాశీ మాయాహి మాయాం హిత్వా త్వమప్యహో ।
ఇతి తేన సహత్వాష్ట్రో మునినాతి కృపాలునా ॥

పురీం వైశ్వేశ్వరీం ప్రాప్తామనః స్వాస్థ్య మవాప చ
తతః ప్రాపయ్య తాం కాశీం తాపసః క్వా ప్యతర్కితమ్ ॥

జగామ కుంభసంభూత ! సత్వాష్ట్రో పీత్యమన్యత ।
అవశ్యం సహి విశ్వేశః సర్వేషాం చింతితప్రదః ॥

సత్పథ స్థిరవృత్తీనాందూరస్థోపి సమీపగ ః॥

యస్మిన్ ప్రసన్నదృక్ త్ర్యక్ష స్తందవిష్ఠమపి ధ్రువమ్ ।
సునేదిస్థం కరోత్యేవ స్వయం వర్త్మోపదేశయన్ ॥

క్వాహం తత్ర వనేబాల శ్చింతాకులిత మానసః।
క్వతాపసః స యో మాం వై సోపదిశ్యేహ చానయత్ ॥

శేలో యమస్య త్ర్యక్షస్య యస్యభక్తస్య కుత్రిచిత్ ।
నదుర్బలతరం కించి దహో క్వాహం క్వ కాశికా ॥

నారాధితో మయా శంభుః ప్రాక్తనే జన్మని క్వచిత్ ।
శరీరిత్వానుమానేన జ్ఞాతమేతదసంశయమ్ ॥

అస్మిన్ జన్మని బాలత్వాన్న చైవారాధిత ః స్ఫుటమ్ ।
ప్రత్యక్షమేవ మేవైత త్కుతోనుగ్రహధీర్మయి ॥

అజ్ఞాతం గురుభక్తిర్మే హేతుః శంభు ప్రసాదనే ।
యయేహానుగృహీతోస్మి విశ్వేశేన కృపాలునా ॥

అథవా కారణా పేక్షస్త్ర్యక్ష స్త్వితర దేవవత్ ।
రంక మప్యను గృహ్ణాతికేవలం కారణం కృపా ॥

యది నో మయ్యను క్రోశః కథం తాపస సంగతితాష్ట్రు।
తద్రూపేణ స్వయం శంభూరానినాయేహ మాం ధ్రువమ్ ॥

న దానాని నవై యజ్ఞాన తపాంసి వ్రతాని చ ।
శంభోః ప్రసాద హేతూని కారణం తత్కృపైవ హి ॥

దయామపి తదా కుర్యాద సౌ విశ్వేశ్వరః పరామ్ ।
యదా ఇత్యుక్త మధ్వానం సద్భిః క్షుణ్ణం న సంత్యజేత్ ॥

అనుక్రోశం సమర్థ్యేతి సత్వాష్ట్రః శాంభవం శుచిః ॥
సస్థాప్య లింగమీశ స్యారాధ యత్స్వస్థమానసః॥

ఆనీయ పుష్ప సంభార మార్తవం కాననాద్బహు ।
స్నాత్వాభ్యర్చయతీశానం కందమూల ఫలాశనః॥

ఇత్థం త్వష్టు తనూజస్య లింగారాధన చేతసః ।

త్రిహాయనాత్ప్రసన్నో భూత్తస్యేశః కరుణానిధిః॥

తస్మాదేవహి లింగాచ్ఛ ప్రాదుర్భూయ భవోబ్రవీత్ ।
వరం వరయ హేత్వాష్ట్ర ! దృఢభక్త్యా నయాతవ ॥

ప్రసన్నోస్మి భృశం బాల గుర్వర్థ కృతచేతసః ।
గురుణాగురుపత్న్యాచ గుర్వపత్యద్వయేనచ ॥
యథార్థితం తథా కర్తుం తే సామర్థ్యం భవిష్యతి ॥

అన్యా న్వరాంశ్చ తే దద్యాం త్వాష్ట్ర ! తుష్ట స్త్వదర్చయా ।
తాన్ శృణుష్వ మహాభాగ ! లింగస్యా స్యాద్భుత శ్రియః ॥

త్వం సువర్ణాది ధాతూనాం దారూణాం దృషదామపి ।
మణీ నామపిరత్నానాం పుష్పాణామపి వాససామ్ ॥

కర్పూరాది సుగంధీనాం ద్రవ్యాణా మప్యపామపి ।
కందమూల ఫలానాం చ ద్రవ్యాణామపి చత్వచామ్ ॥

సర్వేషాం వస్తుజాతానాం కర్తుం కర్మ ప్రవేత్స్యసి ।
యస్యస్య రుచిర్యత్ర సద్మ దేవాలయాదిషు ॥

తస్య తస్మేహ తుష్ట్యై త్వం తథా కర్తుం ప్రవేత్స్యసి ।
సర్వ నేపథ్య రచనా సర్వాః సూపస్య సంస్కృతీ ః॥

సర్వాణి శిల్పి కార్యాణి తౌర్యత్రిక మథాపిచ ।
సర్వం జ్ఞాస్యసి కర్తుం త్వం ద్వితీయ ఇవపద్మభూః ॥

నానావిధాని యంత్రాణి నానాయుధ విధానకమ్ ।
జలాశయానాం రచనా ః సుదుర్గ రచనా స్తథా ॥

తాదృక్కర్తుం పురావేత్సి యాదృజ్ఞాన్యాధియాస్యతి ।
కలాజాతం హిసర్వం త్వమేవ యాస్యసి మే వరాత్ ॥
సర్వేంద్రజాలికీ విద్యా త్వదధీనా భవిష్యతి ।

సర్వ కర్మసు కౌశల్యం సర్వబుద్ధి వరిష్ఠతామ్ ॥
సర్వేషాంచ మనోవృత్తిం త్వం జ్ఞాస్యసి వరా న్మమ ।

కిం బహూక్తేన యత్స్వర్గే యత్పాతాలే యదత్రచ ॥
అతి లోకోత్తరం కర్మ తత్సర్వం వేత్స్యసి స్వయమ్ ।

విశ్వేషాం విశ్వకర్మాణి విశ్వేషుభువనేషుచః ॥
యతో జ్ఞాస్యసి తన్నామ విశ్వకర్మేతి తే నఘ ।

అపరః కోవరో దేయ స్తవతం ప్రార్థయా మ్యహో ॥
తవాదేయం నమేకించి ల్లింగార్చన రతస్యహి ।

అన్యత్రాపి హి యోలింగం సమర్చయతి సన్మతి ః॥
తస్యాపి వాంఛితం దేయం కిం పునర్యో పికాశికమ్ ॥

యేన కాశ్యాం సమభ్యర్చ్య యేన కాశ్యాం ప్రతిష్ఠితమ్ ।
యేన కౌశ్యాం స్తుతం లింగం సమే రూపాయ దర్పణః ॥

తత్త్వం స్వచ్ఛోసి ముకురో మమ నేత్ర త్రయస్య హి ।
కాశ్యాం లింగార్చనాత్త్వాష్ట్ర! వరం వరయ సువ్రత ॥

కాశ్యాం యో రాజధాన్యాం మే హిత్వా రునన్య మర్చయేత్ ।
సవరాకోల్ప ధీర్మ్మష్టో ల్పతుష్టి ర్ముక్తి వర్ణితః॥

తదానందనవనే హ్యత్ర సమర్చ్యో హం ముముక్షుభిః।
ద్రుహిణోపేంద్ర చంద్రాదే రిహాన్యోన సమర్చ్యతే ॥

యథానందవనం ప్రాప్య త్వం మా మర్చితవా నసి ।
తథాన్యేపుణ్యకర్మాణో మావుభ్యర్చ్యైవ మా హితాః ॥

అనుగ్రాహ్యోసి నితరాం తతో వరయ దుర్లభమ్ ।
శ్రావితం తదవైహి త్వం వద మా చిరయస్వ భో ॥

॥విశ్వకర్మోవాచ॥

ఇదం యత్థాపితం లింగం మయాజ్ఞేనాపి శంకర ।
తల్లింగమన్యే ప్యారాధ్య సంతు సద్బుద్ధి భాజనాః॥

అన్యచ్ఛనాథ ప్రార్థ్యోసితచ్ఛ విశ్రాణయిష్యసి ।
భవాన్మయా వినిర్మాపయితీ స్వం ప్రాసాదం కదా భవ ॥

దేవదేవ ఉవాచ॥

ఏవమస్తు యదుక్తం తే తవ లింగ సమర్చకాః।
సద్బుద్ధి భాజనం వైస్యుః స్యుశ్చ నిర్వాణ దీక్షితాః॥

యదా చ రాజా భవితా దివోదాసో విధే ర్వరాత్ ।
తదామే వచనా త్తాత ప్రాసాదంమే విధాస్యతి ॥

నవీకృత్య పునః కాశీ నిర్విష్టా తేన భూభుజా ।
గణేశ మాయయా రాజ్యాత్సరినిర్విణ్ణ చేతసా ॥

విష్ణోః సదుపదేశా చ్చ మా మేవ శరణం గతః।
నిర్వాణలక్ష్మీః ప్రాప్తేహ హిత్వారాజ్యశ్రియం చలామ్ ॥

విశ్వకర్మన్! వ్రజ గురోః శాసనాయ యత స్వచ ।
గురుభక్తికృతో యస్మా న్మద్భక్తా నాత్ర సంశయః ॥

యే గురుం చావమన్యంతేవమాన్యా మయా వ్యహో,
తస్మా ద్గురూపదిష్టం హికురు శిష్య సమీహితమ్ ॥

తత ఆగత్యమే పార్శ్వం యావన్ని ర్వాణ మేష్యసి ।
తావత్థాస్యసి శుద్ధాత్మా దేవానాం హిత మాచరన్ ॥

తవాత్ర లింగే స తతం స్థాస్యామ్యహ మభీష్టదః ।
అస్య లింగస్య భక్తానాం నిర్వాణశ్రీ రదూరతః ॥

అంగారేశా దుదీచ్యాం యేతల్లింగస్య సమర్చకా ః।
తేషాం మనోరథావాప్తిర్భవిష్యతి పదే పదే ॥

ఇత్యుక్త్వార్ధధే దేవ స్త్వాష్ట్రోసి గురు మాప్తవాన్ ।
గురోః సమీహితం భూరి విధాయ సగృహాన్యయా॥

గృహేపి మాతాపితరౌ సంతోష్య నికర్మణా ।
తదుక్తాజ్ఞాం సమాధాయ పునః కాశీం సమాయయౌ ॥

స్వలింగారాధనా సక్తో నా ద్యాపి త్వష్టునందనః।

కాశీం త్యజతి మేధావీ సర్వదేవ ప్రియం చరన్ ॥

॥ఈశ్వర ఉవాచ॥

కాశీముక్తా సమర్థాని తాన్యుక్తాని మయా తన ॥

తింగ మోంకారసంజ్ఞశ్చ తథా దేవం త్రివిష్టనమ్ ।
మహాదేవః కృత్తివాసా రత్నేశ శ్చంద్రసంజ్ఞకః॥

కేదార శ్చాపి ధర్మేశ స్తథా వీరేశ్వరాభిధః।
కామేశ విశ్వకర్మేశౌ మణికర్ణీశ్వర స్తథా ॥

మమార్చ్య మవిముక్తాఖ్యం తతో దేవి మమాఖ్యకమ్ ।
విశ్వనాథేతి విశ్వస్మిన్కల్పకోటిశతేష్వపి ॥

అష్టౌ మాసా న్విహారః స్యాద్యతీనాం సయతాత్మనామ్ ।
ఏకత్రి చతురో మాసా నబ్దం వావాస ఇష్యతే ॥

అవిముక్తే ప్రవిష్టానాం విహారో నైవ యుజ్యతే ।
మోక్షస్యసంశయ శ్చాత్ర తస్మా త్త్యాజ్యా న కాశికా ॥

ఆనంద కాననం హిత్వానా న్యద్గచ్ఛే త్త పోవనమ్ ।
తపోయోగశ్చ మోక్షశ్చ యతోత్రైవ మదాశ్రయాత్ ॥

కృపయా సర్వ జంతూనాంక్షేత్ర మేతన్మయా కృతమ్ ।
ఆవశ్యమేవ సిద్ధ్యంతి క్షేత్రస్మిన్ సిద్ధి కాంక్షిణః॥

అతీతం వర్తమానంచ జ్ఞానతో జ్ఞానతః కృతమ్ ।
యదేనస్తల్ల యం యాయా దానందవనవీక్షణాత్ ॥

అత్యుగ్రైశ్చ తపోభి ర్యన్మహాదానైర్మహావ్రతైః।
నియమైశ్చ యమైః సమ్యక్ స్వయోగేన మహామఖైః॥

వేదాంతశాస్త్రాభ్యసనైః సర్వోపనిషదాశ్రయాత్।
ఏభిర్వైయదవాప్యేత తత్కాశ్యాం హేలయాప్యతే ॥

కర్మస్త్రాణ బద్ధా వై భ్రామ్యంతే తావదేవ హి ।

యావద్దైశ్వేశ్వరే ధామ్ని మమ నైవ తనుత్యజః ॥

కాశ్యాం స్వలీలయా దేవితిర్యగ్యోని జుషామపి ।
దదామి చాంతే తజ్ఞానం యత్ర యాంతి న యజ్ఞికా ః॥

భూత గ్రామోఖిలో ప్యత్ర ముక్తి క్షేత్రే కృతాలయః।
కాలేన నిధనం యాతో యాత్యేవ పరమాం గతిమ్ ॥

విషయాసక్తచిత్తోపి త్యక్త ధర్మరతి స్త్వపి ।
కాలేన నిధనం యాతో యాత్యేవ పరమాం గతిమ్ ॥

విషయాసక్తచిత్తోపి త్యక్త ధర్మరతి స్త్వపి ।
కాలేనో జ్ఝితదేహోత్ర నసంసారం పున ర్విశేత్ ॥

ప్రయాగే యత్ఫలం దేవి మాఘే చోషసి మజ్జనాత్
తత్ఫలం కోటిగుణం వారాణస్యాం క్షణే క్షణే ॥

అస్య క్షేత్రస్య మహిమా కోపి వాచా మగోచర ః।
ఉద్దేశమాత్ర మాఖ్యాయి మయా తేప్రీతికామ్యయా ॥

చతుర్ధశానాం లింగానాం శ్రుత్వాఖ్యానాని సత్తమః।
చతుర్ధశసు లోకేషు పూజాం ప్రాప్స్య త్యనుత్తమాన్ ॥
ఇతి శ్రీ స్కందపురాణే కాశీఖండే విశ్వకర్మేశ ప్రాదుర్భావో నామ

షడశీతితమో ధ్యాయః

"పార్వతి యడుగుచున్నది. దేవతలకు దైవమగునో యీశ్వరా! కాశీయందు విశ్వకర్మేశ్వరమను లింగము మిక్కిలి పురాతన కాలము నుండియు ప్రసిద్ధికెక్కియుండెను గదా? దాని పుట్టుక మున్నగునవి యానతీయుడు అనిన పార్వతీ దేవికి దేవదేవుడు చెప్పుచున్నాడు. 'ఓదేవీ వినుము. మనోహరమైనదియు పాతకము నశింపజేయునదియు, నైన విశ్వకర్మేశ్వర లింగము యొక్క జన్మరూపమైన కథను జెప్పుచున్నాను. పూర్వము బ్రహ్మయొక్క రెండవశరీరమో యనదగిన త్వష్టు ప్రజాపతియొక్క కుమారుడు సమస్త కర్మలయందు మిక్కిలి సమర్థుడైన విశ్వకర్మయను వాడుండెను. అతడు పనయనము చేయబడినవాడై. బాల్యమందు

భిక్షాన్న భోజనమునొనర్చుచు నాచార్యునికి పరిచర్యలొనర్చుచు గురుకులమునందుండెను. అంతట వర్షాకాలము రాగా నొకనాడు గురుడిట్లు పలికెను. 'ఓ త్వాష్ట్రా! వర్షాకాల బాధను తొలగించునదియు నెన్నటికిని ప్రాతదిగా కుండునదియు, ఎప్పటికిని విరిగిపడనిదయునగు (నుటజము) పర్ణశాలను నా కొఱకై నిర్మింపుము.'' తర్వాత నతని భార్య యిట్లనియె. "త్వష్టృ సుపుత్రా! నా శరీరమునకు దగినదియు బిగువు గాక వదులు గాక నుండునదియు నగు రవికెను ప్రయత్నముతో నొనర్పుము. మరియు వస్త్రము గాకుండా ప్రకాశించునట్టి మృదువైన వల్కలము (నాచీరను) గూడ నిర్మింపుము.'' తరువాత గురుపుత్రుడిట్లనియెను "ఓయీ! నాకు పాదుకలను జేయుము. వానిపై నొక్కినపుడు నా పాదములు గొంచెమైనను బురదయంటకూడదు. పరుగెత్తునపుడు కూడా చర్మము నొత్తుకొనకుండ సుఖముగా నుండవలెను. వానిపై నీటియందు దిరిగినను, భూమిపై దిరిగినట్లుండవలెను. పిమ్మట నాగురుని కూతురిట్లని పలికెను. 'ఓ విశ్వకర్మా, నా చెవులకనుకూలించునట్లుగా బంగారు కర్ణభూషణములు నీ చేతితో నొనర్పుము. పిల్లలాడుకొనుటకు దగిన దంత నిర్మితంబులగు బంతులనొనర్చియిమ్ము, ఎప్పుడును విడవకుండునట్లు రోలురోకలి మున్నగు గృహోపకరణములు నిర్మించి యిమ్ము, ఓ శక్తివంతుడా! కడుగకుండనే నిత్యము ప్రకాశించునట్టి యొంటి కాలుగల పీట నమర్పుము. ఓ మేధావీ! వంటపనులు జేయునపుడు కూడనా వ్రేళ్లు కాలకుండ పాకమగునట్లు ఉపాయము జెప్పుము. త్వష్టపుత్రుడా! ఒక కర్రతో జేయబడినదియునొక్కస్తంభము కలదియునగు గృహము నొక్కదానినీయిష్టము గల చోటనిర్మింపుము''. తర్వాత నతని కంటె పెద్దవారగు సహాధ్యాయులందరును మరికొన్ని పనులు జేయగోరిరి. అప్పుడు ద్విజుడైన యా విశ్వకర్మ వారందరి యెదుటనట్లే చేసెదని ప్రతిజ్ఞ చేసెను. పిదప చింతయుభయము కలవాడై వన మధ్యమమున ప్రవేశించి యిట్లనుకొనెను. "అందరి ఎదుటను నంతయు జేసెదనని నిశ్చయముగా బల్కితిని, ఎప్పుడును కొంచెము కూడ నెరుగనైతిని. ఏమి చేయుదును? ఎక్కడికేగుదును ఎవడు సహాయపడును? తెలిసినవాడైన ఏయాటవికుని శరణు వేడుదును గురువు మొదలగు వారి వాక్యములంగీకరించి చేయని మూఢుడు నరకమధ్యమున బడునే? బ్రహ్మచారులకు

గురుశుశ్రూషయే గదా ధర్మము ఆ గురుని వాక్యము నుల్లంఘించిన నాకెట్లు నిష్కృతి గలుగును? గురువాక్యమువల్లనే కదా! మనోరథములన్నియు సిద్ధించవలయును. అయిన నీ వనమందుండి యెట్లు ఆగురు వచన సిద్ధి బొందుదును? బుద్ధి బలములేని నాకిచ్చట నెవని సహాయము గలుగును? గురుకథ నట్లుంచుము. అన్యుడైన ఒకయల్పునకేని యీ పనినీకు నెరవేర్చెదనని చెప్పి చేయక పోయిన బాపమే కదా! ఫలము! అసహాయుడనై అజ్ఞుడనై యెట్లు ఆకర్మములను జేయుదును? అప్పుడు భీతిచే వారి ఎదుటనంగీకరించితిని. ఓ విధి! నమస్కారము ఈ విధముగా మనసు మధ్య మంత్రాలకు చింతించుచుండగా నంతలో దైవికముగా నొకతాపసి, వానిముందు కనబడెను. అంతనమస్కరించి యట్లు కనబడిన తపస్వి జూచి యిట్లు పల్కెను. 'స్వామి! ఎవరు మీరు? నా మనస్సునకు మిక్కిలి సుఖమిచ్చినారు. మీ దర్శనముచే జింతతో దంచుచున్న నా శరీరము పన్నీరు స్నానము జేసినటుల చల్లగానైనది. నా పురాతన కర్మఫలమే యిట్లు తాపసరూపమున ప్రాప్తించినదియా? లేక దయా సముద్రుడైన భగవానుడే యిట్లు వచ్చెనా? మీరు ఎవరైనా కానిండు మీకు నమస్కారము. ఉపదేశముచేతనన్ను రక్షింపుడు. గుర్వాదులచే నియోజితమైన వాక్యార్థము నెట్లు నిర్వహింతును. దానినద్భుతముగా జెప్పుడు. ఈ నిర్జనవనమున బంధువువలె వచ్చిన మీరు నాకు బుద్ధి సహాయము సేయుడు. ఆ వనమందీవిధముగా చెప్పిన బ్రహ్మచారికి తాపసుడు కరుణచే నిండిన హృదయము కలవాడై యథోక్తముగా నుపదేశించెను. ఆప్తుడని తలచి యడిగిన వానికి దుర్బుద్ధి తలంచు మానవుడు వేద భూతములు నుండునంతకాలము ఘోరమైన నరకమును బొందును గదా! అది విని అప్పుడు తాపసి, ఇట్లని పల్కుచున్నాడు.

ఓ బ్రహ్మచారీ! చెప్పుచున్నాను వినుము. ఇది యేమి అద్భుతమైనది? విశ్వేశ్వరుని యనుగ్రహము వలన బ్రహ్మసైతము సృష్టి పాండిత్యము నందించినాడు. అందుచేనోత్వాష్ట్రా! నీవు విశ్వేశ్వరునారాధించుటవల్ల నెట్టియభిలాషయు దుర్లభము కాజాలదు. ఇట్లా తాపసి చెప్పగా నాత్వష్ట కొడుకు విన్నవాడై స్నానము చేసి కందమూల ఫలాశనుడై యా యీశానునర్చించెను. ఇట్లు దృఢభక్తిచే నర్చించు నాతనికి ప్రసన్నుడై విశ్వేశ్వరుడు 'గుర్వభిప్రాయము నెరవేర్చు దీక్ష గలయో

బాలుడా! గురువు మున్నగు వారెట్లు నిన్నర్థించిరో అట్లట్లు నెరవేర్చుటకు నీకు శక్తి గలుగజేసితిని. మరియు నీయర్చనకు సంతుష్టుడనై యితరములైన వరముల నిచ్చుచున్నాను. ఓ మహాభాగా! వానిని వినుము. అద్భుత సంపత్తి గల యీ లింగము యొక్క ప్రభావము వలన నీవు ఎక్కడ సువర్ణాది ధాతువులు, దారువులు. రాళ్ళు, రత్నములు, పూవులు, వస్త్రములు, కర్పూరము మున్నగు సువాసన వస్తువులు తటాకములు కందమూల ఫలములు, గృహములు గలవో, ఆ వస్తువులన్నిటి యందును అద్భుత కర్మల ప్రవేశపెట్టి యొనర్తువు. దేవాలయాదులందెచ్చట విశేషములుండునో చూచినంత మాత్రమున నచ్చటచటగా విశేషము యథారూపముగా చిత్రింపనేర్తువు. సమస్తమైన యంత్రనిర్మాణములు సమస్త శిల్పకర్మలు, అనేక విధములైన యంత్రములు వివిధములైన యాయుధ విధానములు జలాశయాది నిర్మాణము దుర్గ నిర్మాణము మున్నగునవినీ పద్ధతి కితరులు జొరకుండునట్లు నిర్మింపనేర్తువు. నా వరముచే విద్యారహస్యములెల్ల గ్రహింతువు. ఇంద్రజాల విద్యలన్నియు నీయధీనములగును. అన్ని పనులయందు నైపుణ్యము,. మిక్కిలి బుద్ధి విశేషము, అందలి మనోవృత్తుల నెరుంగుట నా వరముచే నొందుదువు. మిక్కిలి చెప్పనేల? స్వర్గమర్త్య పాతాళ లోకములో నతిశయించిన కర్మలన్నిటియందును నీకు ప్రవేశము కలుగును. ఓ అనఘా! విశ్వమందలి సమస్తకర్మల చాకచక్యము నెరింగితివి గదా! నీకు విశ్వకర్మనామము అర్థవంతమగుగాక. ఇంకనేమైనా వరముగావలసినగోరుము. లింగము యాచించు వారికి కోరదగినది లేదనువరకు వరమొసగుచుండ వలెను. లింగార్చనా తత్పరులెచ్చోటనైన నిష్ట సిద్ధి నందెదరన్న గాశిలో పూజించువానికిజెప్పనేల? కాశిలో లింగమును పూజించువాడును. తత్ప్రతిష్ఠ సేయువాడును, స్తోత్రము సేయువాడును, నా రూపమును బొందుటకు లింగము దర్పణము వంటిది. అట్టి లింగార్చన జేసిన నీవును నా కన్నుల మూడింటికి స్వచ్ఛమైన దర్పణము వంటివాడవైతివి. కావున త్వాష్ట్రా! వరమును గోరుము". ఈ ప్రకారముగా పార్వతి ప్రశ్నింపగా! దేవదేవుడు కాశియందలిలింగోద్భవ కథను చెప్పెను. అట్లు రథకారుడు విశ్వకర్మ వంశజుడగుటచేత విశ్వకర్మ గురూపపత్తి మూలకమైన సర్వ విద్యా పారంగతుడగుట వలన నతను కూడ బ్రాహ్మణుడే!

అని సమర్థించుట జరిగినది.

కనుక భగవద్ధత్త సామర్థ్యమే కళ అని చెప్పటలో గూడ మన ప్రాచీనులు వినిపించిన పై స్కాంద కాశీఖండ కథలో శిల్పము యొక్క ప్రాచీనత, ప్రచురతలు కనిపించుచున్నవి గదా!

4.10 1. God is the beautyof all things beautiful - St. Augustine
2. Any thing is beautiful that partakes of Absolute beauty - Plato

3. Beauty absolute - Dionysius

4. Art as a special mode of self entering into relation with the absolute with the summom Bonum with the ultimate root of things - Plosinees.

A. Certain splendour is indeed according to all the ancients, the essentiall character of beauty - Jacqes Masitian

Vedic Rishi saw beauty in nature and in view of the fact that the nature represented in the incarnations of the Divine. Thus led by the most manifold paths to the world of the dieties - Olden burg.

7-11 ఇట్లుపాశ్చాత్యుల దృష్టిలో కూడ దైవికమైన సౌందర్యము నుండి వెలువడినదే కళయని గొంతెత్తి చెప్పుచున్న వాక్యము లెన్నో ఉన్నాయి.

7-12 భారతీయ కళాకారుడెప్పుడో ఆ రహస్యాల్నిసాధించి లోకానికి పంచిపెట్టాడు. దాన్ని మన శిల్ప కళాలయాలన్నిటిలోనూ చూడవచ్చు.

---

సందర్భ గ్రంథములు

1. విశ్వబ్రహ్మ కులోత్సాహ (మరాఠీ) శ్రీ నారాయణ శాస్త్రి

2. విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము । శ్రీ వడ్డెపాటి నిరంజన శాస్త్రి

3. కాశీఖండము - వ్యాసముని

4. రథకారాధికరణము - శ్రీ దంతనాల నాగేశ్వర శాస్త్రి

5. తెలుగు విజ్ఞాన సర్వస్వము - 14వ సంపుటము

6. కళలు : శ్రీ గడియారం రామకృష్ణ శర్మ

# అధ్యాయం : 8

## సంస్కృతి : ఒక నిర్వచనం

8.01 శిల్పము శాస్త్రముగా ప్రవర్థిల్లిన సంగతి భారతీయులెల్లరికి విదితమే! ఈ శాస్త్రమును పూర్వము మహర్షులు లోకములో ప్రచారం చేశారని పురాణాల్లో ఉంది. అలాగే సంప్రదాయంలోనూ ఉంది. మత్స్య పురాణంలో 18 మంది మహర్షుల పేర్లు ఉన్నాయి.

భృగురత్రిర్వసిష్ఠశ్చ విశ్వకర్మామయస్తథా
నారదోనగ్న జిచ్చైవ విశాలక్ష: పురందర:
బ్రహ్మ కుమారో నందీశః శౌనకో గర్గఏవచ
వాసుదేవోనిరుద్ధశ్చ తథా శుక్ర బృహస్పతీ
అష్టాదశైతే విఖ్యాతా: శిల్ప శాస్త్రోప దేశకాః

(మత్స్య పురాణం, అధ్యా. 25)

8.02 భృగువు. అత్రి, వసిష్ఠుడు, విశ్వకర్మ మయుడు, నారదుడు, నగ్నజిత్తు, విశాలాక్షుడు, పురందరుడు బ్రహ్మ, కుమారుడు, నందీశ్వరుడు, శౌనకుడు, గర్గుడు, వాసుదేవుడు, అనిరుద్ధుడు, అనే 18 మంది శిల్ప శాస్త్ర ప్రచారకులు మానసారంలో 32 శాస్త్రాల పేర్లూ, సంప్రదాయంలో 64 పేర్లు ఉన్నాయి. (వాటిని పీఠికలో పేర్కొనడం జరిగింది. గనుక ఇక్కడ ఇవ్వడం లేదు.)

8.03 కొన్ని శిల్పశాస్త్ర గ్రంథముల పేర్లు

1. విశ్వకర్మ మతము, 2. విశ్వకర్మము, 3. మహావిశ్వకర్మీయము, 4. విశ్వకర్మవిద్య, 5. విశ్వకర్మ ప్రకాశము, 6. విశ్వకర్మ శిల్పము, 7. విశ్వకర్మ రహస్యము, 8. విశ్వకర్మ సిద్ధాంతము, 9. విశ్వకర్మ సంహిత, 10. విశ్వకర్మవాస్తు, 11. విశ్వకర్మాగమము, 12. విశ్వకర్మావతారం, 13. పరశివ విశ్వకర్మాగమము, 14.

ఆయతత్త్వము, 15. వాస్తువిచారము, 16. అపరాజిత వాస్తు శాస్త్రము. 17. జ్ఞానరత్న కోశం, 18. క్షీరార్ణవం, 19. వాస్తు శాస్త్రం, 20. వాస్తు విచార (మయ బ్రహ్మ ప్రోక్తములు), 21. మయ శిల్పం, 22. మయమాయ, 2. మయ విద్యా ప్రకాశం, 25. మయ బోధ ప్రకాశం, 26. మయ దీపిక, 27. మయ సంగ్రహం, 28. మయ శిల్ప శాస్త్ర విధి, 29. మయ గురుదేవ పద్ధతి.

8.04 మను బ్రహ్మ ప్రోక్తములు

30. మనుతంత్రం, 31. మానవ సూత్రం, 32. మనుసారం, 33. మానసార వాస్తువు

త్వష్టు బ్రహ్మ ప్రోక్తములు

34. త్వష్టు తంత్రం

35. వాస్తు మండనం,36. ప్రసాద మండనం, 37. రూపమండనం, 38. రాజవల్లభమండనం

8.05 ఇతరములు

39. గృహవాస్తు సారం, 40. తారలక్షణం, 41. దారు సంగ్రహం, 42. నిర్దోష వాస్తు, 43. ప్రాసాద కల్పం 44. మూర్తి ధ్యానం, 45. వాస్తు రాజవల్లభం, 46. శిల్ప కళాదీపిక (అగస్త్యకృతం), 47. శిల్ప సూత్రం (నగ్నజిత్తు), 48. శిల్పోపనిషత్తు (కౌమార భాష్య సహితం), 49. శిల్ప సాహిత్యం, 50. శిల్ప రత్నాకరం, 51. శిల్పావతంసం (గోవిందానంద కృతం), 52. శిల్పశాస్త్రజ్ఞానం, 53. శిల్పసంహిత (కాశ్యపప్రోక్తం), 54. శిల్ప జ్ఞానం, 55. శిల్ప సంగ్రహం, 56. శిల్ప ప్రకాశం, 57. శిల్ప సర్వసంగ్రహం, 58. శిల్పార్థసారం, 59. కల్పసారం, 60. శిల్పశాస్త్రసారం, 61. శిల్పలేఖ, 62. శిల్ప గ్రంథము, 63. శిల్ప దీపిక, 64. శిల్ప విషయం, 65. శిల్పతంత్రం - 9కుమార భట్టకృతం), 66. శిల్ప శాస్త్రం, 67. శిల్ప సర్వస్వ సంగ్రహం, 68. శిల్ప నిఘంటువు, 69. వాస్తు బోధము, 70. వాస్తు మంజరి, 71. వాస్తు విచారము, 72. వాస్తు సముచ్చయము, 73. వాస్తు పద్ధతి, 74. వాస్తు శాస్త్రము భోజదేవుడు), 75. వాస్తు తంత్రము, 76. వాస్తు సారము, 77. వాస్తు

మహాత్మ్యము, 78. వాస్త్వధికారము. 79. వాస్తు కోశము. 80. వాస్తు రత్నావళి, 81. వాస్తు ప్రకాశము, 82. వాస్తు చక్రము(వీక్షాచక్రము), 83. వాస్తు అస్త్రము. 84. వాస్తు రాజము (రాజ సింహకృతి), 85. వాస్తుకరణము, 86. వాస్తు పురుషము, 87. వాస్తువిధి, 88. వాస్తు నిర్మాణము, 89. వాస్తు శిరోమణి, 90. వాస్తువిద్య,91. వాస్తు తిలకము (కేశవాచార్యకృతి), 92. నారాయణ శిల్పము (నారాయణుడు), 100. సృష్టి శిల్పము, 101. కల్పశిల్పము, 102. కణ్వ శిల్పము, 103. ఆత్రేయశిల్పము. 104. ప్రాజాపత్య శిల్పము, 105. శౌనకశిల్పము, 106. మల్ల శిల్పము (భానురాజాశ్రితము), 107. విశ్వశిల్పము, 108. పాద్మీయ శిల్పము. 109. ఔశనస శాస్త్ర శిల్పము (శుక్రాచార్యునిది), 110. ఈశాన కల్పము. 11. వాల్మీకిశిల్పము, 112. సాధక శిల్పము, 113. వజ్ర శిల్పము, 114. ప్రబోధ శిల్పము, 115. ప్రయోగ శిల్పము. 106. భారద్వాజ శిల్పము, 117. యమ శిల్పము, 118. విశ్వామిత్ర శిల్పము, 119. పారాశర శిల్పము, 120. అనిరుద్ధ శిల్పము, 121. కుమార శిల్పము, 122. వాసుదేవ శిల్పము, 123. చిత్రకర్మ శిల్పము, 124. సనత్కుమార శిల్పము, 125. సారస్వతశిల్పము, 126. మనశ్శిల్పము. 127. ఆదిసారము, 128. విశాలాక్షము. 129. తాపదృక్కు, 130. కాశ్యపము, 131. నామసంగిల్యము, 132. అంశుమాన భేద కల్పము, 133. గౌతమము, 134. ప్రభోదకము, 135. భోజమతము, 136. మహాసారము, 137. సారము, 138. పరావచిత్రకము, 139. కేసరీ రాజము, 140. కుండమండప దర్పణము, 141. గార్గేయాగమము, 142. విశ్వేశము, 143. విస్తారకము. 144. మహతంత్రము, 145. చైత్రకము, 145. బహుశ్రుతము, 146. అగస్త్యసంహిత, 147. కార్వార్యము, 148. నారదీయము, 149. భృగుమతము, 150. మార్కండేయము. 151. ఆయాదిలక్షణము, 152. ఉద్విష్ఠానయనము, 153. కుండ మార్తాండము, 154. కేసరీ వాస్తు, 155. గాంధర్వ విద్య, 156. చిత్ర శాలము, 157. చాయా పురుష లక్షణము, 158. నిర్దోషక వాస్తు, 159. ప్రమాణ మంజరి, 160. ప్రతిష్ఠా సార సంగ్రహము, 161. ప్రతిష్ఠామయూఖము, 162. విశ్వసారము, 163. విరింత, 164. కాపిలకాలయూపము, 165. మనోబోధము, 166. గోపాసవము, 167. నగ్నసిద్ధ కల్పము. (గోవిందస్థపతికృతి), 168. కుమార వాస్తు, 169. గుంజకల్పము. 170. చిత్రకుండము, 171. జలాయన జ్ఞానము, 172. ద్వారదీపిక (గోవిందస్థ పతి

కృతి)173. నకుల శిల్పము, 174. ప్రాసాద కర్తనము, 175. ప్రాసాద కేసరి, 176. విశ్వ బోధము, 177. భానుమతము, 178. మానసారము, 179. సాద్ధికము, 180. సోమ శిల్పము, 181. కాలయూపము, 182. అపరాజిత పృచ్ఛ, 183. కశ్యప సంహిత, 184. చిత్ర బాహుళ్యము, 185. సింధువు, 186. జలార్గళం, 187.కాష్టశాల, 188. కాష్ఠశాల, 189. కాష్ఠ సంగ్రహం, 190. కుండప్రదీపం, 191. శిల్ప గాద్య చింతామణి, 192. చిత్రలక్షణం, 193. ధాతుకల్పం, 194. నందిఘనం, 195. నలతంత్రం, 196. పద్మ సంహిత, 197. ప్రాసాద లక్షణము, 198. పాషాణ విచారం, 199. విశ్వధర్మం, 200. అరుణికం, 201. ఐంద్రమతం, 202. బృహస్పతీయం, 203. లావజ్ఞము, 204. సాకము, 205. ఉద్ధార ధోరణి (గోవిందస్థపతి), 206. కుండతత్వ ప్రదీపం, 207. కాపింజల సంహిత. 208. గ్రహపీఠమాల, 209. తత్వమాల, 210. ధ్యానపద్ధతి, 211. నక్షత్రకల్పము. 212. ప్రయోగమంజరి, 213. ప్రసాదాలంకారమాల, 214. ప్రాసాదవిచారము. 215. ప్రసాద నిర్ణయము, 216. భువన దీపిక, 217. విమానాది మానం, 218. జ్ఞానరత్నకోశం. 219. తంత్ర సముచ్ఛయం, 220. పాంచరాత్రాగమము, 221. బృహత్సంహిత, 222. బృహత్సంహిత, 223. విశ్వసారోద్ధారం, 224. శత్రుఘ్నయం, 225. సాథకసారం, 226. సమరాంగణ సూత్రధారం, 227. సనత్కుమారవాస్తు, 228. మంజుశ్రీ సాధనం, 229. యుక్తి కల్పతరువు, 230. వర్ణసంగ్రహం, 231. సార సంహిత, 232. సుప్రభేద శైవతంత్రం, 233. సుప్రభేద ప్రతిష్ఠా తంత్రం, 234. కులార్ణవ తంత్రం, 235. కామికాదీప్తం, 236. రత్నావనసారం (మార్కండేయ కృతి), 237. పాద్మతంత్రక్రియావళి, 238. యంత్రచింతామణి, 239. రుద్రయామళవాస్తు తంత్ర, 240. విశ్వంభరవాస్తు, 241. సూత్రధారణము, 242. సూత్ర సంతానం, 243. హేమాద్రి ప్రతిష్ఠా తంత్రం, 244. జయమధ్య మానం, 245. రత్న పరీక్ష,, 246. మహావజ్రభైరవి తంత్రం, 247. నగ్నిజిత్ కృత ప్రతిమాలక్షణం, 248. మూలస్తంభ నిర్ణయం, 249. మృత్సంగ్రహణం 250. రూపవిధి, 251. రాజగృహ నిర్మాణము, 252. విధ్యాసనము, 253. వాపీచక్రం, 254. విమాన విద్య, 255. శక్తి సూత్రాణి, 256. సౌదామనీకలా, 257. వాయుతత్వ ప్రకరణ (శాకటాయనీయం), 258. యాన బిందువు (వాచస్పతి), 259. విశ్వామిత్ర శిల్పం, 260. పారాశర్య శిల్పం,

261. రత్నలక్షణం, 262. మణి పరీక్ష, 263. రత్నశాస్త్రం, 264. సకలాధికారం, 265. సూర్య సిద్ధాంతం, 266. హరి సంహిత, 267. ప్రాసాద దీపిక, 268. సుఖానంద వాస్తు, 269. కౌమార సంహిత, 270. హనుమత్ శిల్పము. 271. రూపావతారం, 272. గోభిల గృహ్యసూత్రం, 273. ప్రాసాదానుకీర్తనం, 274. రాజవల్లభటీక, 275. క్రియా సంగ్రహపంజికా (హరదత్త సూరికృతం), 276. పాకప వివక్ష, 277. వృక్ష దోహదం, 278. వృక్షాయుర్వేదం, 279. సస్యానందం. 280. విశ్వర్మోపనిషత్తు, 281. రత్నాది పరీక్ష, 282. అంకణ శాస్త్రం, 383. కాశ్యపీయం, 384. కూపాది జల స్థానలక్షణం, 285. క్షేత్ర నిర్మాణ విధి, 286. గృహపథిక, 287. గోపుర విమానాది లక్షణం, 288. చక్రశాస్త్రం, 289. చిత్రపటం, 290. జలార్గళం (వరాహమి హిర), 291. జలార్గళయంత్రం, 292. దేవాలయ లక్షణం, 293. ద్వార లక్షణ పటలము, 294. ప్రక్రిమనుష్యాలయ లక్షణము, 295. ప్రసాద లక్షణము, 296. ప్రసాద లక్షణం, వరాహిమిహిర, 297. ప్రాసాదాలంకార లక్షణం, 298. బలిపీఠ లక్షణం, 299. మనుష్యాలయ చంద్రిక, 300. మరిచీ పటలము, 301. మాన కథనము, 301. మానవ వాస్తు లక్షణము, 302. మానవసారం, 303. మానసం, 304. రథలక్షణం, 305. సద్విరిక్సంధానం, 306. పీఠలక్షణం, 307. ప్రతిమాద్రవ్యాదిరచన, 308. కౌతుకలక్షణ, 309. చత్వారింశద్విద్యిక్, 310. అంశుమాన కల్పము, 311. ఆగార వినోదం, 312. జయమాధవ మానసోల్లాసం, 313. భార లక్షనం, 314. మణిపరీక్ష, 315. ఆగమాది ప్రతిష్ఠా పద్ధతి, 316. గ్రహనిరూపణ సంక్షేపం చిత్రకర్మ శిల్ప శాస్త్రం, 317. నవరత్న పరీక్ష, 318. మయూర చిత్రకళ, 319. మూర్తి లక్షణం, 320. సముచ్ఛయం, 321. లోహరత్నాకరం, 322. లోహార్ణవం, 323. వైగ్రాసనం, 324. జలాధిరత్నం, 325. సర్వ విహారయ యంత్రం, 326. సారస్వతీయ శిల్ప శాస్త్రం, 327. రత్న (కందేశ్వరునిది), 328. విశ్వవిద్యాభరణము, 329. విశ్వబ్రహ్మకులోత్సాహం (నారాయణ శాస్త్రి), 330. రథకారాధికరణం, 331. ప్రతిష్ఠా తంత్రం, 332. కృషివిషయం, 333. రత్నమాల (పశుపతి), 334. మానసోల్లాస వృత్తా ప్రకాశం, 335. పంచరత్న దీపిక, 336. గృహ నిర్మాణ విధి, 337. రెట్టమతం (భాస్కరుడు), 338. అంశుమత్కాశ్యపీయం, 339. క్షేత్ర గణిత శాస్త్రం, 340. అభిలషితార్థ చింతామణి, 341. రత్నశాస్త్రం, 342. నౌకాశాస్త్రం, 343. దేవతా శిల్పం,

344. గోసూత్రం, 345. గోశాంతి, 346. గోవైద్య శాస్త్రం), 347. గో శాస్త్రం, 348. కలాశాస్త్రం, 349. చిత్ర భారతం, 350. శిల్ప రత్నం (శ్రీకుమారాచార్య), 351. వాస్తు ప్రకరణము, 352. మయమతవాస్తు శాస్త్రం భాషా ప్రకాశ, 353. మయవాస్తువు వ్యాఖ్యా, 354. మయశిల్పవ్యాఖ్యా, 355. ఆత్రేయ తంత్రం, 356. కోదండమండనం (మండన సూత్రధారి), 357. ఆగమ కల్పద్రుమము, 358. మహానిర్వాణ తంత్రం, 359. శాక్తానందతరంగిణి, 360. మాయా తంత్రం, 361. గంధర్వమాలికా, 362. విశ్వకర్మాన్వయ ప్రదీపికా, 363. స్వతంత్ర తంత్రం, 364. బృమత్శ్రీక్రమము, 365. కాళ్యూర్ధ్వామ్నాయం, 266. తంత్ర జీవనం, 267. కంకాళ మాలినీ తంత్రం, 268. మహేశ్వర సంహిత, 269. బాలా విలాస తంత్రం, 270. లింగార్చనాతంత్రం, 271. గోరక్షసంహిత, 272. కాలికతంత్రం, 273. స్వచ్ఛంద సంగ్రహం, 274. కాళికాపురాణం, 275. మత్స్య మహాపురాణం, 276. శ్రీమద్భాగవతం.

8.06. శైవాగమాలు వీటన్నిటిలో క్రియాపాదంలో ఎన్నో శిల్ప విషయాలుంటాయి. అందువల్ల శిల్ప శాస్త్ర ప్రేమికులు తప్పకుండా వీటిని చూడాల్సే ఉంటుంది. ఈ అగమాల్ని ప్రచురిస్తున్న పాండిచ్చేరి ఫ్రెంచ్ ఇన్స్టిట్యూట్ వారు ప్రశంసార్హులు.

401. ప్రోద్గీతం, 402. లలితం, 403. సిద్ధం, 404. సంతానం, 405. శర్వోక్తం, 406. పరమేశ్వరం, 407. కిరణం, 408. వాతూలం, 409. వారాహం, 410. కవచం, 411. పాశబంధం, 412. పింగలామతం, 413. అంకుశం, 414. దండధరం, 415. ధనుర్ధరం, 416. శిజ్ఞానం, 417. విజ్ఞానం, 418. శ్రీకాలజ్ఞానం, 419. ఆయుర్వేదానము, 420. ధనురాగం, 421. సర్వదంష్ట్ర విబేదనం, 422. గోరకం, 423. భరతం, 424. ఉతద్యం, 425. లలితోత్తరం, 426. కౌమారం, 427. సారోత్తరం, 428. ఔశనస, 429. శంకరం, 430. శశిమండలం, 431. లింగాభ్యక్షం, 432. సురాభ్యక్షం, 433. అమరేశ్వరం, 434. శంకరం, 435. అసంఖ్య, 436. అనుపవలం, 437. ద్వంద్వం, 438. శిశధర్మోక్తం, 439. వాయు ప్రోక్తం, 440. దివ్యప్రోక్తం, 441. ఈశానం, 442. మాతంగం, 444. యక్షిణీ పద్మం, 445. పారమేశ్వరం, 446. పుష్కరం, 447. సుప్రయోగం, 448. హంసం, 449.

సామాన్యం, 450. గారుడం, 451. నైఋతం, 452. నీలం, 453. రూక్షం, 454. భానుకం, 455. ధేనుకం, 456. కాలాఖ్యం, 457. ప్రబుద్ధం, 458. బుద్ధం, 459. వాతులం, 460. వాతూలోత్తరం, 461. కాలజ్ఞానం, 462. ప్రరోహితం, 463. సర్వం, 464. ధర్మాత్మకం, 465. నిత్యం, 466. శ్రేష్ఠం, 467. శుద్ధం, 468. మహాసనం, 469. విశ్వం, 470. విశ్వాత్మకం.

8.07. పై వానివలె ఈ క్రింది పంచరాత్ర ఆగమసంహితలును.

636. పాద్మ సంహిత, 637. పాద్మోద్భవం, 638. మాయావైభవం, 639. నలకూబరం, 640. త్రైలోక్య మోహనం, 641. విష్ణుతిలకం, 642. పరమం, 643. నారదీయం, 644. ధనదీయం, 645. వాసిష్ఠం, 646. వైసిష్టం, 647. పౌష్కరం, 648. హంసం, 449. సామాన్యం, 450. గారుడం, 451. నైఋతం, 452. నీలం, 453. రూక్షం, 454. భానుకం, 455. ధేనుకం, 456. కాలాఖ్యం, 457. ప్రబుద్ధం, 458. బుద్ధం, 459. వాతులం, 460. వాతూలోత్తరం, 461. కాలజ్ఞానం, 462. ప్రరోహితం, 463. సర్వం, 464. ధర్మాత్మకం, 465. నిత్యం, 466. శ్రేష్టం, 467. శుద్ధం, 468. మహాసనం,469. విశ్వం, 470. విశ్వాత్మకం.

8.07 పై వానివలె ఈ క్రింది పంచరాత్ర ఆగమసంహితలును.

636. పాద్మ సంహిత, 637. పాద్మోద్భవం, 638. మాయావైభవం, 639. నలకూబరం, 640. త్రైలోక్య మోహనం, 641. విష్ణుతిలకం, 642. పరమం, 643. నారదీయం, 644. ధనదీయం, 645. వాసిష్ఠం,646. వైసిష్ఠం, 647. పౌష్కరం, 648. సనత్కుమారం,649. సనకం, 650. సత్యం, 651. విశ్వం, 652. అనంత పూర్వం, 653. మహీప్రశ్నం, 654. శ్రీ ప్రశ్నం, 655. పురుషోత్తమం, 656. మహేంద్రం, 657. పంచప్రశ్నం, 658. తత్వ సాగరం, 659. వాగీశం, 660. విష్ణుతంత్ర, 667. కుమారతంత్రం, 668. అహిర్బుధ్న్యసంహిత, 669. విష్ణువైభవ తంత్ర, 670. శ్రీ కుమార తంత్ర, 671. సౌరతంత్ర, 672. సౌమ్యతంత్ర, 673. ఈశ్వర సంహిత, 674. అనంత, 675. భాగవత, 676. జయాఖ్య, 677. మూల, 678. పుష్టి, 679. శౌనకీయ, 680. మరీచి, 681. దక్ష, 682. ఉపేంద్ర, 683. యోగిహృదయ, 684. హారీత, 685. పారమేశ్వర,

686. ఆత్రేయ, 687. మాందర, 688. విష్వక్సేన, 689. ఔశనస, 690. వైఖానస, 691. విహగేంద్ర, 692. భార్గవ, 693. పరమ పురుష, 694. యాజ్ఞవల్క్య, 695. గౌతమ, 696. పౌలస్య, 697. శాకల, 698. జ్ఞానోవ, 699. జామదగ్ని, 700. యామ్య, 701. నారాయణ, 702. పారాశర, 703. జాబాల, 704. కపిల, 705. వామన, 706. ఉత్తరజయాఖ్య, 707. భార్హస్పత్య. 708. జైమినీయ (ఉత్తర), 709. సాత్వత (ఉత్తర), 710. కాత్యాయన, 711. వాల్మీకి, 712. ఔపగాయన, 713. హిరణ్యగర్భ. 714. అగస్త్య, 715. కాణ్వ, 716. బోధాయన, 717. భారద్వాజ, 718. నారసింహ, 719. ఉత్తర గార్గ్య, 720. శాతాతప, 721. అంగిరస, 722. కాశ్యప, 723. పైంల, 724. త్రైలోక్య విజయ, 725. యోగరహస్య, 726. వాయవీయ, 727. వారుణ, 728. కృష్ణ, 729. అంబర, 730. ఆగ్నేయ, 731. మార్కండేయ సంగ్రహ, 732. మహాసనత్కుమార, 733. వ్యాస, 734. విష్ణుసంహితా, 735. మార్కండేయ, 736. పారిషద, 737. బ్రహ్మసంహిత, 738. ఉత్తర నారద, 739. శుక సంవాద, 740. రుద్ర సంవాద, 741. ఉమామహేశ్వర, 742. దత్తాత్రేయ, 743. శర్వ, 744. వరాహిమిహిర, 745. సంకర్షణ, 746. ప్రద్యుమ్న, 747. ఉత్తర వామన, 748. కల్కి, 749. రాగవ, 750. ప్రాచేతన, 751. హయశీర్ష, 752. వైభవ, 753. పౌష్కర, 754. ప్రహ్లాద,755. గార్గ్య, 756. గాలవ, 757. నారదీయ, 758. శాండిల్య, 759. ఈశ్వర, 760. సత్య, 761. శౌనక, 762. జ్ఞానసాగర, 763. తార్క్ష్య, 764. ఆనంద, 765. అరుణ.

8.08 వైఖానస సంహితలు

766. అత్రి, 767, భృగు,768. కశ్యప, 769. మరీచి

8.09. స్మార్త ఆగమములు

770. సర్వజ్ఞానోత్తరం, 771. జ్ఞానార్ణవం, 772. విశుద్ధేశ్వరం, 773. మహాదేవం, 774. కాలసారం, 775. యోగీశ్వర శతం, 776. దక్షిణామ్నాయం, 777. ఉత్తరామ్నాయం, 778. ఊర్ధ్వామ్నాయం, 779. వీణా తంత్రం, 780. కులచూడామణీ తంత్రం, 781. చంద్రజ్ఞానం, 782. అరుణేశ్వరం, 783. త్రైపురం, 784. న్యాయోత్తరం, 785. కాలవాదకం, 786. పూర్వామ్నాయం,

787. పశ్చిమామ్నాయం, 788. అనుత్తరామ్నాయం, 789. కుండేశ్వరమతం, 790. గుహ్యతంత్రం, 791. కులసారం, 792. వాతులం, 793. వాతులోత్తరం, 794. సర్వవీరమతం, 795. త్రితలోత్తరం, 796. యామళాష్టకం, 797. మాతృభేదం, 798. త్రోతలం, 799. బహురూపాష్టకం, 800. కిరణాగమమ్.

8.10 విష్ణుప్రకాంత తంత్రములు

802. సిద్ధేశ్వరి, 803. కాళీ, 804. కులార్ణవ, 805. జ్ఞానార్ణవ, 806. నీల తంత్ర, 807. ఫేత్కారీతంత్ర, 808. దివ్యాగమ 809. ఉత్తర, 810. శ్రీక్యమ, 811. సిద్ధయామళ, 812. మత్స్యసూక్త, 813. సిద్ధసార, 814. సిద్ధసారస్వత, 815. వారాహి, 816. యోగినీ, 817. గణేశ విమర్శినీ, 818. నిత్యా, 819. శైవా,820. చాముండా, 821. ముండమాలా, 822. హంసమాలేశ్వర, 823. నిరుత్తర, 824. కుల ప్రకాశిక,825. దేవీ కల్ప, 826. గాంధర్వ, 827. క్రియాసార, 828. నిబంధం, 829. స్వతంత్ర, 830. సమ్మోహన , 831. 832. లలితా, 833. రాధా, 834.మాలినీ, 835. రుద్రయామళ, 836., బృహత్‌విక్రమ, 837. గవాలి, 838. సుకుముదిని, 839. విశుద్ధేశ్వరి, 840. మాలినీవిజయం, 841. సమయాచార, 842. భైరవీ, 843. యోగినీహృదయ, 844. భైరవ, 845. సనత్కూమార, 846. యోని, 847. తంత్రాంతర, 848. నవరత్నేశ్వర, 849. కుల చూఆమణి.

8.11 రథక్రాంత తంత్రములు

850. చిన్మయ తంత్రం, 851. మత్స్య సూక్తం, 852. మహిషమర్ధిని, 853. మాతృకోదయ,854. వారుణేశ్వర, 855. మేరు, 856. మహనీల, 857. మహానిర్వాణ, 858. భూతాడామర, 859. దేవదామర, 860. బీ/చింతామణి, 861. ఏకజాత, 862. వామదేవరహస్య, 863. బృహద్‌గౌతమీయ, 864. వర్ణోద్ధృత, 865. ఛాయనీల, 866. బృహద్‌యోని, 867. బ్రహ్మజ్ఞాన, 868. గరుడ, 869. వర్ణవిలాస, 870. బాలావిలాస, 871. పురశ్చరణ చంద్రికా, 872. పురశ్చరణరసోల్లాస, 873. పంచదశి, 874. పించిలా, 875. ప్రపంచ సార, 876. పరమేశ్వర, 877. నవరత్నేశ్వర, 878. నారదీయ, 879. నాగార్జున, 880. యోగసార, 871. యక్షిణీతంత్ర, 882. దక్షిణామూర్తి, 883. యోగ స్వరోదయం, 874. నారదీయ, 879. నాగార్జున, 880. యోగసార,

881. యక్షిణీతంత్ర, 882. దక్షిణామూర్తి, 883. యోగ స్వరోదయం, 884. జ్ఞానభైరవ, 885. ఆకాశభైరవ,886. రాజరాజేశ్వర, 887. రాజరాజేశ్వరీ, 888. దేవతీ, 889. సారసం, 890. ఇంద్రజాల, 891. కృకలాసదీపికా, 892. కంకాళమాలినీ, 893. యక్షడామర, 894. సరస్వతి, 895. శారద, 896. శక్తిసంగమ, 897. శక్తికాగమసర్వస్వ, 898. సమ్మోహిని. 899. ఆచారసార, 900. సీవాసార, 901. సదామ్నాయ, 902. కచీనాళభైరవ, 903. శోధా, 904. మహాలక్ష్మీ 905. కైవల్య, 906. కుల సద్భావన, 907. సిద్ధివిద్ధరి, 908. కృతిసార, 909. కులభైరవ, ఉడ్డామరేశ్వరి, 911. మహాకాల, 912. భైతభైరవ.

8.12. అశ్వక్రాంత తంత్రములు

913. భూత శుద్ధి, 914. గుప్తదీక్షా, 915. బృహత్సార, 916. తత్వసార, 917. వర్ణసార, 918. క్రియాసార, 919. గుప్తతంత్ర, 920. గుప్తసార, 921. బృహత్తోడల, 922. బృమత్ నిర్వాణ, 923. బృహత్ కంకాలినీ, 924. సిద్ధతంత్ర, 925. కాలతంత్ర, 926. శివతంత్ర, 927. సారాత్సార, 928. గౌరీతంత్ర, 929. యోగతంత్ర, 930. ధార్మిక తంత్ర, 931. తత్వ చింతామణి, 932. బిందుతంత్ర, 933. మహాయోగిని, 934. బృహద్యోగిని, 935. శివార్చనా, 936. శంబర, 937. శూలిని, 938. మహామాలిని, 939. మోక్ష, 940. బృహత్మాలిని, 941. మహామోక్ష, 942. బృహన్మోక్ష, 943. గోపీతంత్ర, 944. భూతలిపి, 955. కామిని, 946. మోహిని, 947. మోహన, 948. సమీకరణ, 949. కామేశ్వర, 950. మహావీర, 951. చూడామణి, 952. గుర్వర్చన, 953. గోష్య, 954. తీక్ష, 955. మంగళ, 956. కారురత్న, 957. గోపలీలామృత, 958. బ్రహ్మాండ, 959. శేన, 960. మహానిరుత్తర, 961. భూతేశ్వర, 962. గాయత్రి, 963. విశుద్ధేశ్వర, 964. యోగార్ణవ, 965. భేరండ, 966. మంత్రంచింతామణి, 967. యంత్రచూడామణి, 968. విద్యుల్లతా, 969. భువనేశ్వరి, 970. లీలావతి, 971. బృహచ్చీన, 972. కురంజ, 973. జయరాధామాధవ, 974. ఉజ్జారక, 975. ధూమావతీ, 976. శివ, 983. యామల, 984. బ్రహ్మయామల, 985. విశ్వసార, 986. మహాకాల, 987. కులోద్దేశ, 988. భూతడామర, 989. కుబ్జికా, 990. యంత్రచింతామణి, 991. కాళీవిలాస, 992. మాయాతంత్ర.

8.13. శైవాగమాలు

471. కామికం, 472. యోగజం, 473. చింత్యం, 474. కారణం, 475. అజితం, 476. వక్త్రారం, 477. భైరవోత్తరం, 478. నారసింహం, 479. తారం, 480. వామం, 487. పాపనాశనం, 488. పరోదభవం, 489. అమృతం, 490. పావనం, 491. మారణం, 492. దౌర్గం, 493. మహేంద్రం, 494. భీమసంహితా, 495. కారణం, 496. విద్వేషం, 497. ప్రభాతం, 498. వరోద్భుతం, 499. పార్వతీ సంహితా, 500. పాద్మసంహితా, 501. దీప్తం, 502.సూక్ష్మం, 503. సహస్రం, 504. అంశుమంతం, 505. సుప్రభేదం, 506. అమేయం, 507. అబ్దం, 508. అచ్ఛాదం, 509. అసంఖ్యం, 510. అమితేజసం, 511. ఆనందం, 512. మాధవోద్భూతం, 513. అద్భుతం, 514. అక్షయం, 515. సూక్ష్మం, 516. అతీతం, 517. ఆనందం, 512. మాధవోద్భూతం, 513. అద్భుతం, 514. అక్షయం, 515. సూక్ష్మం, 516. అతీతం, 517. మంగలం, 518. శుద్ధం, 519. అప్రమేయం, 520. భూతతంత్రం, 531. ఆత్మాలంకారం, 532. కాశ్యపం, 533. గౌతమం, 534. ఇంద్రం, 535.. బ్రహ్మం, 536. వాసిష్ఠం, 537. ఈశానోత్తరంబ, 538. విజయం, 539. నిశ్వాసం, 540. స్వాయంభువం, 541. అనలం, 542. వీరం, 543. ఉద్భవం, 544. సౌమ్యం, 545. అఘోరం, 546. మృత్యునాశనమ్, 547. కౌబేరం, 548. మహాఘోరం, 549. విమలం, 550. విజయం, 551. నిశ్వాసోత్తరం, 552. నిశ్వాసనయనం, 553. విశ్వాస నయనం, 554. నిశ్వాస కారికా, 555. నిశ్వాస ఘోరం, 556. నిశ్వాస గుహ్యాం, 557. మంత్రవిశ్వాసం. 558. మహాఘోరం, 549. విమలం, 550. విజయం 551. నిశ్వాసోత్తరం, 552. నిశ్వాస నయనం, 553. విశ్వాసనయనం, 554. నిశ్వాస కారికా, 555 నిశ్వాస ఘోరం, 556. నిశ్వాస గుహ్యాం, 557. మంత్ర విశ్వాసం, 558. ప్రజాపతిమతం, 559. పర్యం, 560. నలనోద్భవం, 561. విరాగమం, 562.ప్రస్తరం, 563. పుల్లం, 564. అమలం,565. ప్రబోధం, 566. అమోఘం, 567. మోహసమయం,568. శకటం,569. శకటాధికం, 570. భద్రం, 571. విమోచనం, 572. వీరంగం, 573. హలం, 574. బోధబోధకం, 575. రౌరవం, 576. మకుటం, 577. విమలం, 578. చంద్రజ్ఞానం, 479. ముఖబింబం, 580. సౌఖ్యం, 581. కాలదహనం, 582. రౌరము, 583. రౌరవోత్తరం, 584.మహాకాలమతం, 585.

ఇంద్రం, 586. మకుటం, 587. మకుటోత్తరం, 588. అవన్తం, 589. భోగం. 590. ఆక్రాంతం, 591. వృషహిగం, 592. వృషోదరం, 593. వృషోదరం, 594. రౌద్రం. 595. సుదస్తం, 596. ధారణం, 597. ఆకాంతం, 598. అతిక్రాంతం, 599. అట్టహాసం, 600. భద్రనాధం, 601. అర్చితం, 602. అలంకృతం, 603. నందికేశ్వర, 604. చంద్రజ్ఞానం, 605. స్తిరం, 606.స్థాణం, 607. మహాంతం, 608. వారుణం, 609. నందికేశ్వర, 610. ఏకపాదపురాణం, 611. శాంకరం, 612. నీలరుద్రకం, 613. శివభద్రకర్ణ, 614. కల్పభేదం, 615. శ్రీముఖం, 616. శివశాసనం, 617. శివశేఖరం, 618. దేవమతం, 619. ముఖబింబం, 620. చతుర్ముఖం, 621. సంస్తాంభం, 622. ప్రతిబింబం, 623. అయోగజం, 624. ఆత్మాలంకారం, 625. వాయువ్యం, 626. ాటికం, 627. తాటికం, 628. తుటనీరకం, 629. కుట్టిమం, 630. తులాయోగం, 631. కాలాత్యయం, 632. మహాసారం, 633. పట్టశేఖరం, 634. నైఋతం,635. మహావిద్యా, 636. శివవిద్యా.

8.14 పాంచరాత్ర సంహితలు - ప్రత్యేకములు

6.37 శ్రీధర తంత్రం

638. శ్రీనివాసతంత్రం, 639. శ్రీ వల్లభతంత్రం, 640. శ్వేతకేతుతంత్రం, 641. సదావిష్ణుతంత్రం, 642. సనందన తంత్రం, 643. సర్వమంగళ తంత్రం, 644. సాత్వతతంత్రం, 645. సుబోధకతంత్రం, 646. స్కంద తంత్రం, 647. స్వాయంభువ తంత్రం, 648. హయగ్రీవ తంత్రం, 649. హరితంత్రం, 650. హృషీకేశతంత్రం, 651. కాలోత్తర తంత్రం, 652. చిత్రశిఖండీ తంత్రం, 653. జయత్సేన, 654. తేజోద్రవణ, 655. సాత్యకి తంత్ర, 656. సామంతర సంహితా

(ఇవి గాక అనేక ప్రయోగ గ్రంథములు వివరణ గ్రంథములు నున్నవి విస్తార భయముచే వానిని విడువవలసి వచ్చినది)

8.15 ఇట్లు శాస్త్రముఖముగా విల్పము వివిధ మార్గములలో ప్రవహించును.

1.కృషి శాస్త్రము, 2. భూగర్భ శాస్త్రము, 3. జలశాస్త్రము, 4. నౌకా శాస్త్రము. 5. రథ శాస్త్రము. 6 విమాన శాస్త్రము., 7. వాస్తుశాస్త్రము. 8. ప్రాకార శాస్త్రము, 9.

నగర రచన శాస్త్రము, 10. యంత్ర శాస్త్రము.

8.16 ఈశాస్త్రముల వివరణ వ్యాఖ్యానాదికములు దేశభాషలలో గావింపవలసిన దనియున్నది. దానిని కీ.శే. వినాయక్ కృష్ణ శర్మావఝె గారు గత శతాబ్దములోనే మహరాష్ట్రభాషలో మొదట ప్రారంభించినారు. దాని ననుసరించి ఆంధ్రమునను కన్నడమునను కొందరు ఉత్సాహవంతులైన యువకులు అంకురార్పణ చేసినారు. గాని తగినంతప్రచారము కాలేదు. ఈమధ్య ఎ.ఆర్ జోస్యర్ గారు మైసూరు నుండి భరద్వాజుని యంత్ర సర్వస్వము అను విమాన నిర్మాణమును ప్రకటించగా దానిపై మహారాష్ట్ర విద్వాంసులు కొన్ని పరిశోధనా పత్రములు ప్రకటించినారు.

8.17 కనుక శిల్పమన్నప్పుడు భారతీయ జీవనవికాసమునకుపయోగించిన వివిధ శాస్త్ర సముదాయమునకు ప్రేరకమైన శక్తి అనికూడా గ్రహించాలి. ఎన్ని రచనలు, ఎన్ని విజ్ఞాన వీచికలు - ఎన్ని సౌందర్యములు ఎన్ని సౌకర్యములు ప్రకృతి శక్తుల పోరాటములపై మానివుని ఎంతగొప్పవిజయములు!!!

---

## సందర్భ గ్రంథాలు


1. విశ్వబ్రహ్మకులోత్సాహము : శ్రీ నారాయణ శాస్త్రి
2. ఆగమశిల్పశాస్త్ర పరిచయము - డా॥ పెదపాటి నాగేశ్వరరావు
3. సహస్రకుండ యజ్ఞ సంచిక - శ్రీ మన్నారాయణ జీయర్
4. పాంచరాత్ర ప్రాసాద ప్రసాధనం - హెచ్. డానియల్ స్మిత్
5. ఓరియంటల్ మాన్యు స్క్రిప్ట్ లైబ్రరీ కేటలాగు - తంజావూరు
6. ఓరియంటల్ మాన్యు స్క్రిప్ట్ లైబ్రరీ కేటలాగు - భండార్కర్ - పూనా
7. ఓరియంటల్ మాన్యు స్క్రిప్ట్ లైబ్రరీ కేటలాగు - దక్కన్ కాలేజ్ పూనా.
8. ఓరియంటల్ మాన్యు స్క్రిప్ట్ లైబ్రరీకేటలాగు - బనారస్

# అధ్యాయము : 9

## శిల్పము : సాహిత్యము

9.01. శిల్పము శారీరక పరిశ్రమతో కూడిన మేధా సంపత్తి, సాహిత్యము మానసిక బలముతో కూడిన మేధాసంపత్తి శిల్పములో రూపము ప్రాధాన్యము. సాహిత్యములో భావమే ప్రధానముగాని రూపముగాదు. కొన్ని భావములలో రూపములే ఉండవు. అందువలన కొన్నిటిని విడమరచి చెప్పే అవకాశం గూడా లేదు. కానిశిల్పంలో అలా కాదు చూడగానే అదేంటోతెలిసి పోతుంది. కనుక భావానికి ఒక చివరశిల్పం అయితేఇంకోవైపు సాహిత్యం అనవచ్చు. ఇలా పరస్పరం విరుద్ధంగా కనిపించే ఈ రెంటికీ ఆధారం మేధస్సు మాత్రమే. ఈ రెండూ మానవ మేధస్సుకు అద్దం పట్టేందుకే ఉద్భవించాయి. అలా రెండూ మానవుని ఉన్నత శిఖరాలకు జేర్చడానికే శ్రమిస్తాయి. ఒకదానిలో అర్థం స్పష్టంగా గోచరిస్తుంటే ఇంకో దాంట్లో అర్థం ఆలోచన చేస్తే గాని కనిపించదు. అందుకే

"సంగీత మపిసాహిత్యం సరస్వత్యా: స్తనద్వయం, ఏకమాపాత మధురం అన్యదాలో చనామృతం" అన్నారు.

9.02. ఈ శిల్పం ప్రాచీనం నుంచీ మానవమేధస్సును గిలిగింతలు పెట్టిన కళే గనుక ఈ కళను గూర్చి సాహిత్య కారుడుకూడా కొన్ని భావాలు వెలిబుచ్చాడు. అలాగేసాహిత్యా కాశంలో మెరిసే మహాత్ములు యీ శిల్పాన్ని చూచి ఏమనుకొన్నారో వివరించడం అటు పాశ్చాత్యదేశాలవారును, సాహిత్యమునకు కల్పన మూలము. ఈ కల్పనలంటే అరూపమైన భావాలకు రూపాలనివ్వడమే. ఆ విధంగా కవి కూడా ఒక రకమైన శిల్పియే. అందుకేఅతడ్ని కూడా మన ప్రాచీన గ్రంథాలైన వేదాల్లో కవి కారు అని అన్నారు.

కవిర్మనీషీ పరిభూ : స్వయం భూ :

ఈ శావాస్యోపనిషత్తు
సుపర్ణం విప్రా : కవయోవచోభి
రేకం సంతం బహుధా కల్పయన్నిత

ఋగ్వే 10.114.5

యోనఃపితాజనితా యోవిధాతా
ధామానివేద భువనాని విశ్వా
యో దేవానాం నామధా ఏకేఏవ
తం సంప్రశ్నం భువనాయన్త్యన్యాం

ఋగ్వేద 10.82.

9.03. వీటన్నిటిలోపరమాత్మ ఆదిశిల్పియని అతని కల్పనల మూలంగానే ప్రపంచం వచ్చిందనీ చెప్పబడింది.

9.04 అట్లే శిల్పాచార్యులైనవారు కూడ తమ కార్యముకావ్యమయమని ధ్వనించునట్లువాక్యములుచూడదగ్గవి.

అహంహి విశ్వకర్మావై
దానవానాం మహాకవి ః వ్యాసభారతం సభాపర్వం 1.6.
దీనిపైనీలకంఠునివ్యాఖ్యయిట్లున్నది.
విశ్వకర్మకృతి సాధ్యం యస్యసః విశ్వకర్మా మహాకవిః శిల్ప పండితః।
కవితారథం నాశిల్పం అంటున్న మరో మహర్షి ఋగ్వేద గానం వినండి
అభితష్టేవ దీధయా మనీషా మత్యోన
వాజీ సుధురో జహానః
అభిప్రియాణి మర్మృశత్ పరాణి
కవీన్ రిచ్ఛామి సందృశేసుమేధాః

ఋగ్వేద 3.38.1

కట్టెలను చెక్కువడ్రంగి శిల్పివలె ధ్యానమగ్నుడనై, సంయోజితమైన

జవనాశ్వము వలె చురుకైన బుద్ధితో చక్కగా భావించి, నేనొకమంత్రాన్ని తయారు చేశాను. ఉదాత్తభావాలతో ఉన్నతాదర్శాలలో విద్వాంసుల సందర్శనం కోరుతున్నాను.

9.05 ఆహుత్యష్టేవ కంధురం పర్చచామి హృదా మతిమ్

ఋగ్వేద 10.119.42.

కవితారథ శిల్పములు సమానధర్మము గలవి. రెండును కల్పనా చమత్కారము గలవే. కావుననే వైదిక ఋషులు తమ సూక్తాల్ని రథశిల్పంతో పోల్చుకొన్నారు.

9.06 శిల్పములో చిత్రలేఖనంలో సంగీతంలో సాహిత్యంలో సువర్ణదారు, దంత, శిలాది అనేకరకాలైన రూపాల్ని సామాన్లను తయారుచేసే వివిధ సంకేతాలతో ప్రతిసృష్టి చేసే శక్తి మన శిల్పకళాకారుల్లో అపరిమితంగా ఉంది. శిల్ప సాహిత్యాలలోనూ తదితర కళల్లోనూ దాని ప్రాచుర్యం ఇంతింతని చెప్పవీలుగాదు.

రవీంద్రనాథ ఠాగూర్
("కళ సౌందర్యానుభోధి" పుట 83.)

లోకమునకు దర్పణము బట్టెడు రచనలుసాహిత్యంలో కోకొల్లలు. కవులంతా వివిధ విషయాల్ని తీసుకొని వివిధ దృక్కోణాల్లో తమ రచనలు చేశారు. అలాంటప్పుడు మన కవులు మన శిల్పుల్ని గూర్చి ఏం వ్రాశారు. అని చర్చిస్తే మన కవులెందరో అందంగా వర్ణించిన వర్ణనలున్నాయి.

9.07 కరువున బూరితమై లో
హరసము లోగాలు నట్టు లంగజ శోకో
ద్ధర శాఖ రతి తను నిమ్మగ
గరిగియుఁబోడవఱక లోన గాలుచునుండెన్

(కవి సు. ఆ. 5.99)

మూసగట్టి పోసిన లోపము పయికి చల్లారియున్నట్లుకన్పించినను అంటుకొన్నచో చుఱుక్కుమనును. అట్లే మన్మథునివలన దుఃఖాగ్ని రతీదేవిశరీరము యవస్థ కింత కంటెను నిదర్శనమేమి కావలెను.

9.08 కసటువోవదొడగి కడిగిన కనకంపు
ప్రతిమవోలెనొప్పు నతివ మేను

(కుమార సం. ఆ. 7. ప. 80)

ఇట మూసకట్టి పోసిన బంగరు బొమ్మవలె నున్నదని చెప్పబడెను. కావున పరితల హృదయములో నాయామూర్తులు ప్రతిబింబింపకెట్లుండును? తప్పక ప్రతిబింబించును.

9.10 హరిహర బ్రహ్మ మహానుభావులు
ఒక్కటి గాగ గరిగిన గుటకయనగ

(భారతం విరాట పర్వం. ఆ. 2.241)

అని సూర్యుడ్ని వర్ణించారు. బ్రహ్మవిష్ణుమహేశ్వరతత్వాలు మూడూ కలిపి కరిగిపోసిన గుళికవలె సూర్యుడున్నాడని యందలి భావం. దీనివల్ల సూర్యుడు త్రిమూర్త్యాత్మకుడని వేరుగా చెప్పాలా?

9.11 మనము శిల్పమె తనదు విన్నను వు మెఱసి
గాలినశ్వరూపంబులుగా దరించే
గాక యీ జనసత్వముల్ గలవె ఘోటకముల కెందు (నిర్వచనోత్తర రామాయణం ఆం. 1.54)

మనస్సనెడి శిల్పి తన చాక చక్యంతో గాలిని అశ్వములుగా మలిచాడని యిందులో ఉన్న భావం అంటే గుఱ్ఱములు మనో వేగం - వాయు వేగాలు కలవని అర్థం.

9.12 వెరవు గల్గి మనోభవు వీరరసము
నిరంతముగా నేర్పు వాటించి కరువు గట్టి

పోసి చేసిన రూపుల పోల్కి వార
వనిత లొప్పెడు రప్పురవరము నందు (నిర్వచనోత్తర రామాయణము) ఆ. 1. ప.55

పట్టణంలో ఉన్న వారకాంతలు మన్మధుని పరాక్రమం అనేద్రవాన్ని మూసపోసి చేసినట్లున్నారని భావం. వారకాంతల రూపాల్ని విచ్చలవిడి ప్రవర్తనల్ని సూచిస్తూ కవి చేసిన వర్ణన సహజ సుందరం కదా!

9.13 జక్కన "విక్రమార్క చరిత్ర" లో
కమ్మని పసిడి టంకమున గరంగిన
లాలిత నూత్న శలాకవోలె (విక్రమార్క చరిత్ర) ఆ. 8. ప 44

బంగారపు రజనుతో కరిగిపోసిన మెరుగు తీగెలా ఉన్నదని స్త్రీని వర్ణించాడు.

9.14 'ఆముక్త మాల్యద' లో శ్రీకృష్ణదేవరాయలు
అలపర్జన్యు డుభానుడన్కొలిమిలో నభ్రంపు పెన్గొప్పెరన్
జలమాగన్ బిడుగుక్కు జాత్యపుటయస్కాంతంబు నత్తున్కలో
పలజూపన్ మహి మీది లోహరజమున్ బైబర్వెనాలేచె వా
త్యల బ్రాగ్దావమషుల్ మొగిల్మొదల గ్రద్దంతై దివిన్ బర్వినన్

ఆముక్త మాల్యద ఆ. 4. ప. 80)

అనగా తొలదొల్త మేఘం ఆకాశంలోగ్రద్ధలా అతిస్వల్పంగా ఉంది. భూమి మీద కార్చిచ్చుల నల్లని పొగలు సుడిగాడ్పులతో పైకి లేచి స్వల్పమైన ఆ మేఘాన్ని విస్తరింపజేసింది. అదెలా ఉందంటే పర్జన్యుడనే కుమ్మరి సూర్యుడనే కొలిమిలో మేఘమనే నీళ్లకారు పెట్టి దాంట్లోంచి నీరు పోకుండా ఉండడానికి పిడుగు అనే ఉక్కుకు సజాతియైన సూదంటి రాతి తునకల్నిలోపల అతుకు పెట్టడం చేత భూమిలో ఉన్న లోహజం ఆకర్షింపబడి ఆ మేఘాన్ని ఆవరించి వృద్ధి పొందించినదా? అన్నట్లు ఉన్నది. ఇంతకీ భూమిమీది కార్చిచ్చుల పొగలు ఆకాశాన్నాక్రమించి మహా మేఘరూపం దాల్చింది. అని దీని భావం.

ఉ॥ హెచ్చిన మైత్రి బద్మినులకెల్ల ఘనాత్యయకారకుండు సొ

మ్మొచ్చు పడంగ జేయుటకునై యల గ్రాంచ నగంబు పేరిక
మ్మొచ్చున నీడ్చు శర్వగిరి యందలి వెండిశలాకపిండు నా
వచ్చి మరాళ మాలికలు వ్రాలె గొలంకుల జక్ర ఝుంకృతిన్ (ఆముక్త మాల్యద ఆ. 4. ప. 148)

శరదృతువు అనే అగసాలె పద్మములకు (పద్మినీ జాతి స్త్రీలకు)

సొమ్ములుచేసి యివ్వడానికి క్రౌంచ పర్వతం అనే

కమ్మొచ్చున తీసిన కైలాసం అనే వెండి తీగెల

గుంపో అన్నట్లు రాజహంసలు వచ్చి సరస్సుల్లో వ్రాలాయి.

9.16 సున్నము మెత్తుటయుబట్టుకారులంబట్టుటయు

సౌధసౌవర్ణ భూషాది నిర్మాణమ్ములయంద (ఆముక్త మాల్య ఆ. 4. ప. 187)

సున్నమువేయుట భవనములకు, పట్టుకారులతో బట్టుట బంగారు వస్తువుల చేయుటకు అని భావము.

తెలివి వెన్నెల వెండితీగెలు నిగుడించు

కదలు కమ్మొచ్చు బెజ్జములనంగ (పారిజాతాపహరణం ఆ. 2. ప. 37)

9.17 తెల్లని వెన్నెలఅనేవెండి తీగెలు తీసె ఆకాశం అనే కమ్మొచ్చు బెజ్జాల్లా నక్షత్రాలగుపిస్తున్నై అని భావం.

తొలిమల ఱాతితో నొరయు దూరువు దొయ్యలిముత్తియంపు గుం

డలమున మానికంబు వడినన్ గనుపట్టెడు లక్కగూడు నా

జలువలఱేని యప్పొడుపు జాయదొఱంగినకందుదోచెరే

చెలువ గనుంగనం గమియజెందిన కాటుకప్పుకైవడిన్ (పారిజాతాపహరణం ఆ. 2. . 46)

ఉదయగిరి శిలతో ఒరిసిన ప్రగ్దిశాకాంతకు చెవి పోగులో ఉన్న మాణిక్యం

జారిపోగా ఎర్రగా కనిపించే లక్కగూడులా చంద్రుని ఉదయ కాంతి నశించడంతో ఆకందుకనిపించింది. ఆకురాయి రాత్రి అనే స్త్రీ పెట్టుకొన్ని కాటుకలా ఉంది.

9.18 గగన సౌధా లేపకర కాల శిల్పి ని
రుక్త సుధావస్త్ర ముష్టియనగా (పారిజాతాపహరణం ఆ.2.ప.58)
ఆకాశం అనే మేడకువెల్లవేసే కాలమనే శిల్పి చేతి లోనుండి జారిన సున్నపు గుడ్డ ముడియా? అన్నట్లు చంద్రుడున్నాడు అని దీని భావం!

9.19 సూరన 'కళాపూర్ణోదయం' లో
కుందనపు గమ్మి దిగిచిన
యందంబున జవరఁదనము నలరుందేనెల్
చిందినగతి మాధుర్యము
పొందుపడన్ వీణె ముట్టి పొలతుక పాడెన్ (కళాపూ. ఆ. 2. ప. 53)

బంగారు తీగె లాగినట్లు జవర గుణాన్ని పూదేనెలు చిందినట్లు తియ్యదనం ఒలికేటట్లు ఒక స్త్రీ పాటపాడింది అని బాపం.

9.20 నందుల కూర్మి యన్నసిడిమేల్తెలుపవా
రిధి నిల్పు నొరగంటి రేకలనగ (కళాపూర్ణోదయం ఆ.ప.)
నందుకూర్మి అనే బంగారం యొక్క వన్నె తెలిపే సముద్రంపై నిల్చిన గీటు రాయిపై ఉన్న గీతలోఅనేలా ఉన్నాయని భావం.

కాలకలాదుడెంతయును గాంచన రేణువు ప్రత్యగాశనా
గ్రాలెడు క్రొవిగూర్చి కరగంగ ప్రవర్ధన మొందు జాళువా
మేలిమి పూదెనా బొలుపు మీ ఱని నుండది గాక యార్ప
గీ లాలనిమజ్జితంబయిన లాగున గ్రుంకెను పశ్చిమాంబుధిన్

కాలమునేసువర్ణశిల్పి బంగారు రజన్ని పడమటి దిక్కు అనే మూసలోపట్టి కరగడం వల్ల ఎర్రని కాంతులు గ్రక్కే బంగారు గుళికెలా సూర్యుడు ప్రకాశించాడనిదాన్ని చల్లార్చడానికి పశ్చిమ సముద్రంలో గ్రుంకాడనీ భావం!

9.20 యయాతి చరిత్రలో

సరగమిన్నను కమ్మరి సంజకొలిమి
బెట్టుగా గాల్చి బంగారు చుట్టు వాలు పదను పెట్టంగగొనిపోయి పట్టలేక
విడిచెనన బ్రొద్దు పడమటి కడలి మునిగె (యయాతి చరిత్ర ఆ. 2. ప.67)

ఆకాశమనెడి కమ్మరి సంధ్యయనెడికొలిమిలోబంగారం కడియాన్ని కాల్చి నీళ్ళలో ముంచి పదనుపెట్టాలనుకొని పట్టుకొని ఆ వేడిని సహింపలేకర, విడిచిపెట్టాడో అన్నట్లు సూర్యుడు పశ్చిమ సముద్రంలో గ్రుంకాడు అని తాత్పర్యం.

ఇందులో ఒకతికమక ఉంది. ఈ పద్యంలోకవి ఆకాశాన్ని కమ్మరిగా పోల్చాడు. కమ్మరి అంటే ఇనుముతో పనిచేసేవాడు. అతడు బంగారు కడియాన్నికాల్చడు కదా! కనుక కమ్మరి శబ్దానికి బదులు ఆ పనిచేసే వానిని సూచించే శబ్దం వాడితే బాగుండేది.

9.21 కూచి మంచి తిమ్మకవి వర్ణన చూడండి.

బొమ్మయను పేరి యగసాలె పూట చెలిమి
గోరి యలరించుటకు జదలగుట గాచి
నీటముంచిన మేటివన్నియ పసిండి
పూండెయన గ్రుంకు కడలిలో బ్రొద్దు వ్రాలె (నీలా సుందరీపరిణయం ఆ. 3/3)

బ్రహ్మ అనే బంగారు పనివాడుకాలం అనే స్త్రీని సంతోష పెట్టడానికి ఆకాశమనేకుంపటిలో కాచి నీళ్ళలో ముంచిన బంగారుగుళికయా అన్నట్లు సూర్యుడుపశ్చిమసముద్రంలో క్రుంగాడు అని తాత్పర్యం.

9.22 నరసీజోద్భవ రుక్మకారకుడు ఘుస్ర స్త్రీ మణిం బ్రేమతో
గరమింపొంద నలంకరించుటకు వేగంగాచి తానీటిలో
బరగన్ ముంచిన యట్టి మేల్మియగు బల్బంగారపుంఖూదె య
స్కరణిన్ భానుడు పశ్చిమాంబునిధి జక్కంగ్రుంకె నొక్కుమ్మడిన్ (రాజశేఖర విలాసం ఆ. 1. ప. 126)

బ్రహ్మ అనేస్వర్ణకారుడు దినమనే స్త్రీని అలంకరించాలనుకొనిబంగారు గుళికను నీటిలో ముంచాడా? అన్నట్లు సూర్యుడపరాబ్ధిలో గ్రుంకాడని భావం.

నిజానికి పై రెండు పద్యాల్లోనూ భావం ఒకటే ఒకేకవి తన భావాన్ని తన గ్రంథాలయన్నిటిలోనూ ఉపయోగించుకోగలడు గదా!

9.23 మునుదన్ను శాణకర్షితుగను జేసిన విశ్వకర్మ గాంచిన సుతులీ

ఘనులేమి సేతురో యని

వనధింబడే ననగ ధరణి వడకుచుగ్రుంకెన్ (ధర్మపాల విజయము ఆ.1.ప.129)

ఇలా వృత్తి ధర్మాల్ని - పరికరాల్ని - ఆయా సందర్భాల్లో వినియోగించి ఆయా దృశ్యాల్ని సాక్షాత్కరింపజేసే వారై తమకున్న శిల్ప సాన్నిహిత్యాన్ని వెల్లడించుకున్నారు.

9.24 ఇక స్వాతంత్ర్యోత్తర కాలంలో జాతీయ పునరుజ్జీవనోద్యమ ఫలితంగా భారతీయమైన అన్ని కళలతో బాటుచిత్రశిల్పాలకు గూడ కొంత ప్రచారముప్రకాశమూ లభించాయి. రవీంద్రనాథటాగోర్ మొదలైన జాతీయ నాయకులు తమ కవిత్వాలతో బాటుచిత్ర శిల్పాల్ని గూడా ఆదరించి స్వయంగా శిల్పులు చిత్రకారులుగా జీవించడం మొదలు పెట్టారు. శాంతినికేతన్‌లో నందలాల్ బోస్ లాంటి వారు నవీన భారతీయ చిత్రకళకు ప్రాణం పోశారు.

9.25 సంస్కృత పండితులీ సడించుకొనే శిల్పశాస్త్రాల విశిష్టమైన భావాల్ని వెలికి తీసి ప్రచారం చేయడంలోడా౹7 ఆనందకుమార్ స్వామి, ఓ.సి. గంగూలీ, మొదలైన మహామహులు చేసిన కృషివల్ల మన శిల్ప శాస్త్రాలకు ప్రచారం కలిగింది. డా. ప్రసన్నకుమారాచార్య - డా॥ వాసుదేవ్ శరణ్ అగర్వాలా, ఫణీంద్ర నాథ్ బోస్ మొదలైన వారి రచనలు తర్వాతి వారికి మానసోల్లాసం కలిగించి అఖిల భారతం లోను సాహిత్యోపాసకులకు గూడా శిల్పకళోపాసనమూ అవసరమేనన్న భావాన్ని కలిగించి దేశాన్ని ఉద్రూతలూగించాయి.

9.26 ఆ నేపథ్యంలో ఆంధ్ర దేశంలో కూడా ఎంతో మంది పండితులు ప్రాచీన

భారతీయ శిల్పాల్ని కళనూగురించి వ్యాఖ్యానించడం మొదలు పెట్టార
అదే సమయానికి గాంధీగారి స్వదేశీ ఉద్యమం కూడా కలిసి రావడంత
దేశీయమైన చేతిపనుల్ని కళల్నీ ఉద్ధరించడానికి ప్రచారోద్యమాల
బయల్దేరాయి. ఆ నేపథ్యంలో కొందరు మహాత్ములు తెలుగుసాహిత్యంల
కూడా శిల్పుల్ని చిత్రకారుల్నీ గూర్చి వ్రాయడం జరిగింది. తుమ్మ
రాష్ట్రగానలో తెలుగు శిల్పిపై పద్యాలూ, డా॥ సి.నా.రె. గారి అజంతా, అడ
బాపిరాజు నవల హిమబిందు.

9.27 నాగార్జునసాగరంలాంటి గీతి కావ్యాలూ, డా॥ కొండూరు వీరరాఘవాచార్యుల
వ్రాసిన కళారాధన, లేపాక్షి వంటి నవలలు పులివర్తి శరభాచార్యులుగార
'కల్హారమాల' వంటి ఖండకావ్యాలూ, పూసపాటి నాగేశ్వర రావుగారి శిల
సుందరి, తత్వానంద స్వాముల వారి వ్యాసగ్రంథం, శిల్పులు దేశాభ్యుదయ
కరులు దంతనాల నాగేశ్వరశాస్త్రి - రథకారాధి కరణం, వడ్డెపాటి నిరంజన
శాస్త్రి మరాఠీ నుండి అనువదించిన విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమం, స్వర్ణ
సుబ్రహ్మణ్య కవి భారతీయ మహాశిల్పం, డి. సోమేశ్వరరావు వ్రాసిన మన
శిల్పం, గడియారం రామకృష్ణశర్మగారిమన వాస్తువు డా॥శ్రీపాద గోపాల
కృష్ణమూర్తి గారి ఆంధ్రశిల్పం, పద్మశ్రీ గణపతి స్థపతి పెదపాటి నాగేశ్వరరావు
వ్రాసినకాశ్యప శిల్ప శాస్త్రము - వాస్తుసూత్రోపనిషత్‌లు, దురిశేటి
వెంకటరామాచార్యులు మధువిద్య - దాశరధి, జాషువాల మధుర ఖండికలు ఈ
నేపథ్యంలో స్మరింపదగిన సాహిత్య కళాఖండాలు.

9.28 ఇందులో కొన్ని ప్రచారం పాలుగాను కొన్ని కళాత్మకంగానూ వచ్చాయి. ఏది
ఏమైనా సాహిత్య పరంగా యీ మాత్రం రచనలు రావడానికి కారణంసాహిత్య
వేత్తల హృదయాల్లో శిల్పం కూడా ఒక విలువైన కళే అన్న గుర్తింపు రావడం
ఎందరెందరో శిల్పులు చిత్ర కారులు నేడు తెలుగులో ఉన్నారు. వారందరు
వివిధ వర్గాలు - పార్శ్వ భూమికల నుండి ఆలోచించి వీటిని అభివృద్ధి
చెందిస్తారనడంలో అతిశయోక్తి ఉండదు.

# సందర్భ గ్రంథాలు


.1. ఈశ ఉపనిషత్ - గీతా ప్రెస్

2. ఋగ్వేదం - బనారస్

3. మహాభారతం, సభాపర్వం

4. కళ : సౌందర్యానుభూతి - రవీంద్రనాథ టాగోర్

5. కుమార సంభవము - నన్నెచోడకవి

6. తెలుగు భారతం - విరాట పర్వం

7. నిర్వచనోత్తర రామాయణం - తిక్కన

8. విక్రమార్క చరిత్ర - జక్కన

9. ఆముక్త మాల్యద - 4-80; 148, 187

10. పారిజాతాపహరణం - ముక్కుతిమ్మన; 2,37,46,58,53

11. కళాపూర్ణోదయం : సూరన, 6,11,8,9

12. యయాతి చరిత్ర - తెలుగు 2,67

13. నీలాసుందరీ పరిణయం - కూచిమంచి తిమ్మకవి 3-3

14. రాజశేఖర విలాసం -1,126 మాదయ గారి మల్లన

15. ధర్మపాల విజయం -బొమ్మకంటి ప్రభాకర కవి

# అధ్యాయం : 10

## శిల్పము : పరిభాష

10.1 మన భాష మన భాబాలకు అద్దం పడుతుంది. భాష మహా ప్రవాహం. ఇది అందిరి సొత్తును. అందువల్ల అందరి భావాలు యిందులో ఉంటాయి. దీనికి ప్రాంతం కాలం అనేవాటి పరిధులున్నాయి. వాటి ననుసరించి దీని రూపాలు మారుతుంటాయి. వాటిని వివిధ వృత్తుల ప్రవృత్తులు గల మానవులు వాడుతున్నప్పుడు వివిధ రూపాలు తయారౌతాయి. ఈ రూపాలన్నీ భాషయొక్క సంపదలోకి వస్తాయి. ఐతే ఈ అన్ని రూపాలూ అందరూ వాడరు. కొన్ని అసలు అందరికీ తెలిపేవిగా ఉండవు. కారణం వాటి వాడుక ఏ కొద్ది విషయాలకో ఏ కొద్ది సమయానికో ఏ నిర్ణీత ప్రదేశానికో పరిమితమై ఉంటుంది గాబట్టి. ఐనా ఆయా రూపాల్ని అలా వాడితేనేసహజంగా ఉంటుంది.

10.2 కాబట్టి యీ శబ్దాలు అందరికీ అర్థంకావు. వాడరు. అందువల్ల యిలా నిరర్థకాలు అని అనడానికి వీల్లేదు. వాటిని కావాల్సిన వారు వాటిని వాడతారు. మీకు అవసరం లేనందువల్ల మీరు వాడకపోవచ్చు. వాటి అవసరాన్ని గుర్తించినవారు వాటిని వాడతారు అని సమాధానింపవలసి వస్తుంది. అలా ఏర్పడ్డవే ప్రాంతీయాలు పారిభాషికాలూను. ఈ పారిభాషికాలన్నవి ఆయా శాస్త్రాలకు వృత్తులకు ప్రవృత్తులకూ మాత్రమే పరిమితమై ఉంటాయి. అందువల్ల పెద్దలు పారిభాషిక కోశాలు తయారు చేసి తరువాతి తరాల వారి కోసం అందించారు. కాలాంతరంలో పరిధి - దేశ - కాలముల ప్రభావాలు ఎక్కువైనప్పుడు వీటి వాడకాలూ సంకేతాలు కూడా ఎక్కువైనాయి. అందువల్ల యీనాడు వివిధ రంగాల్లో దేశీయ విదేశీయ పదబంధాలు పదాలు కోకొల్లలుగా వస్తూ సామాన్య భాషను సుసంపన్నం చేస్తున్న తరుణంలో మన సామాన్య పౌరునికి ఏది సత్యం ఏదసత్యం అనే

వివాదం విస్తృతమైంది. శాస్త్రాధ్యయనం, సంప్రదాయ పరిచయం ఆచార్య గురుశుశ్రూషణంలాంటి వాటికి అవకాశమూ, ఆలంబనమూ లేని నేటి కాలపు విద్యార్థికి గ్రంథాలయాల ఆధారంగా ఈ పారిభాషి కోశాల ఆధారంగా మన ప్రాచీన - ఆలోచన - సంప్రదాయ, సాంకేతిక వాఙ్మయాన్ని అర్థం చేసుకోవలసి ఉంటుంది. దానికి దివిటీ పట్టడానికే యీ వ్యాసం.

10.3 మానవుడు భూమిపై పడ్డది మొదలుకొని నీడకోసంపరితపిస్తాడు. వెలుగెంత ప్రధానమోనీడకూడ అంతేప్రధానం. ఆది మానవుడు చెట్ల నీడనే జీవితం గడిపాడు. కాల క్రమేణ నాగరికత పెరిగిన కొద్దీ యీ నీడను గృహశిల్పంగామలిచాడు. దీన్ని భోజ మహారాజు సమరాంగణ సూత్రధారమనే గ్రంథంలో (6వ. అధ్యాయంలో) ఎలా అలంకారికంగా వివరించాడో చూస్తే మన సంప్రదాయవాదుల కథనం తెలుస్తుంది.

10.4 "మహాప్రళయావసానమున కృతయుగారంభములో ప్రాణిసృష్టి అనంతరము భూమి మీద దేవతలు - మానవులు అందరూకలిసి యుండిరి. ఈ సమయమున దేవతలకు వలెమానవులుకూడ ఆకలి దప్పిక - దుఃఖమువ్యాధి, ముసలితనము మరణము మొదలగునవి లేకుండాస్థిర యౌవనముకలిగి యుండిరి. విమానాకాశమునుబోలిన కల్పద్రుమ్మము లందువసించుచు, అందరు కలిసి, పర్వతములందు, సరస్సులందు చిత్రవిచిత్ర వనములందు విహరించును, స్వర్గాది లోకములకు వెళ్ళుచువచ్చుచు అనేక విధములయిన అలంకారములను చిత్ర విచిత్రములను ధరించుచు అనేక విధముల భోగభాగ్యముల ననుభవించుచు, మానవులు కూడా దేవతల వలె ప్రకాశించుచుండిరి. అయినను మానవులు దేవతలందు భక్తి విశ్వాసములుంచి పూజించుచువారి అనుగ్రహమును పొందుచుండిరి. 1728 వేలసంవత్సరములు ప్రమాణముగా గలిగిన కృతయుగములోఈ విధముగా 10వేల సంవత్సరములు గతించినవి తరువాత.

10.5 మానవులు ఒకసమయములో భూరసము (చెరుకు రసము) ను త్రాగుట తటస్థించినది. (ఇంతవరకు మానవులు కల్పద్రుమము యిచ్చిన

ఆహారాదులనే) గాని భూ సంబంధముగా ఏ విధమైన ఆహారము తీసుకొనలేదనిగ్రహించగలము. తదాదివారు కామోద్రేకము గలవారై స్వేచ్ఛాపూర్వకముగా ఆహార విహారములను చేయసాగిరి.

కామాత్క్రోధోభిజాయతే (భగవద్గీత)

తా॥ కామము నుండి క్రోధము పుట్టుచున్నది

10.6 అనుక్రమము ననుసరించి క్రోధము ఆవిర్భవించగా పరస్పర శత్రుత్వ మిత్రత్వములు ఆరంభమయి హద్దు తప్పిన స్వాతంత్ర్యమును అనుభవించ సాగిరి. ఇట్లు చాలా కాలము సాగినది. క్రమముగా దేవతలను అనాదరముతో చూడనారంభించిరి.

10.7 ఈ విషయమును గమనించిన దేవతలు, కల్పద్రుమములనుకదల్చి స్వర్గ లోకములో ప్రతిష్ఠించుకొని అచ్చటనే నివసించసాగిరి. ఇందువలన మానవులలో స్వర్గమునకు వెళ్లు శక్తి దివ్యత్వము నశించినవి. ఫలితముగా దివ్యములయిన వస్త్రములు, నివాసములు, భోగములు, అన్నియు అంతరించగా, నిరాధారముగా, వికృతాకారములతో, దిశ మొలలతో మిగిలిరనుట అతిశయోక్తి కాదు. ఈ విధముగా నున్న మానవులు కల్పద్రుమము యొక్క దేవతల యొక్క ప్రభావమును స్మరించుకొనుచు తమ పొరబాటుకు దుఃఖించుచు 'ఆకలి దప్పికలతో తిరుగుచుండిరి'

(ఆగమశిల్ప శాస్త్ర పరిచయము పు.2)

ఇలా మొదలైన కథల్లోని సారాంశమేమంటే చెట్టునీడ - చెట్టులో యిల్లు - తొర్రలో నివాసం చెట్టు వంటి యిల్లు - క్రమంగా మానవుడు రూపొందించా డని చెప్పడం. ఇల్లుతో మానవుని జీవన విధానం క్రమంగా పెరిగి శాస్త్రీయత వైపు పరుగులెత్తింది. దానివల్ల సుఖం పొంది విశ్వాసం పెరిగి ఈ విషయాలపై ఆలోచన చేయడం మొదలు పెట్టాడు. ఏ ఏ వస్తువుల వలన తాను యీ నీడా సుఖం పొందుచున్నాడో దాన్ని వస్తువుల ఆశ్రయం - వాస్తువు అని అన్నాడు. దాన్ని క్రమంగా 'వాస్తోష్పతి' కల్పన వరకూ అంటే పదార్థంలో బ్రహ్మ సారూప్యాన్ని దర్శించే

ఆధ్యాత్మిక భావన వరకూ మానవుడు వెళ్లాడని భోజుడు చెప్పాడు.

10.8 వాస్తోష్పతి సూక్తం వేదాల్లో ఉంది అలాగే వాస్తుపతి ఒక దేవతగా నిత్యనైమిత్తికాల్లో పూజనీయుడు గా సంప్రదాయం అంగీకరిస్తుంది. కాని కొన్ని పురాణాల్లోనూ ఆగమశాస్త్రాల్లోనూ వాస్తువు నొక రాక్షసుడిగా చెబుతూ కొన్ని కథలు వచ్చాయి. పురాణాల్లో మత్స్య పురాణం ఆగమగ్రంథాలూ - ఈశాన శివగురు దేవ పద్ధతి లాంటి ప్రయోగ గ్రంథాల్లోనూ యీ భావాలున్నాయి. కాని స్కాంద నాగర ఖండంలో మాత్రం స్పష్టంగా యీ వాస్తు పదాధి దేవత బ్రహ్మ అనీ ఆయన పూజ విశ్వకర్మకే చెందుతుందనీ స్పష్టీకరించడం జరిగింది తాత్వికంగా చూస్తే భోజుడందించిన సమాచారం వాస్తు బ్రహ్మ సిద్ధాంతం మేధావులకు ఆహ్లాదకరమైన విషయం.

10.9 సామాన్య మానవుడికి యీ వాస్తు దేవతా పూజనం వల్ల కలిగే లాభమేమిటి? అని ప్రశ్నిస్తే - ప్రతి నిర్మాణంలోనూ ఆకారమూ అనేవి ఇమిడి ఉన్నాయనీ - వాటి సద్వినియోగం కొఱకు వాటిని ఆవేవించి ఉండే వాటిలో నిండి ఉండే దేవతల్ని / దేవుడ్ని పూజించేదే పిండితార్థమనీ తేలుతుంది. గాలి, నీరు, నిప్పు, ఆకాశం, భూమి ఇవి ప్రధానంగా ఉన్న ఈ ప్రపంచానికి ఇవే దేవతలు గా ఏలుతున్నవని మన ప్రాచీనార్యులు విశ్వసించి పూజించిన సంగతి ఋగ్వేదాదులు పరిశీలించినవారికి స్పష్టంగా తెలుసు. ఆ నేపథ్యంలోచూస్తే యీ వాస్తుపూజ ప్రాచీన దేవతారాధనమే. ప్రాకృతికమే. ఎటొచ్చి దీన్ని మరో విధంగా వ్యాఖ్యానించడమనేది తరువాతి దేవతల పూజలు ప్రబలిన తర్వాతనే! శైవ - వైష్ణవాది అవాంతర దేవతారాధన పెరిగినప్పుడు దీన్ని వెనక్కు నెట్టి ఆయా గాథలు కల్పించబడ్డాయి. ఐనా అవి నిర్మాణంతో అవసరాన్ని బట్టి ప్రక్కకు సర్దుకోబడ్డాయి. దిక్ పరీక్ష - స్థల పరీక్ష - ప్లవ పరీక్ష మొదలయిన వాటిని నిర్వహిస్తూ ఆయా దేవతల్ని పూజించడం ఎంతో ఆసక్తికరమైన విషయం. ఇలాగ విదేశాల్లో కూడా ఆయా సందర్భాలలో ఎన్నో పూజలు చేస్తూ నిర్మాణాలు జరుపుతూ ఉండేవారని ప్రపంచ నాగరికతా చరిత్రతెలిసిన వారికి విదితమే.

10.10 సామాన్యుడికి వాస్తువెంత అవసరం?
దిక్కులు చూచుకొని ఇల్లుకట్టుకోవడం
స్థలం అనుకూలమైనదిగా సరిచూచుకోవడం
ఇల్లు వాస్తు సూత్రానుగుణంగా నిర్మించుకోవడం
ఇంటి పారిశుద్ధ్యం గమనించడం
దిఙ్నిర్ణయాన్ననుసరించి పాకశాల - శౌచశాల - గోశాల
ధన శయన శాలలు ఏర్పాటు చేసుకోవడం లాంటివి

సామాన్యాలు

వీటిని గ్రామాల్లో అందరూ తెలుసుకొని నలుగురికి చెప్పి మరీ ఆచరించేవారు.
బావి ఎక్కడ ఉండాలో శౌచాలయం ఎక్కడ ఉండాలో
మన గ్రామాల్లో అందరూ తెలుసుకొని ఆచరిస్తుండేవారు.

కాని యిప్పుడు ఆ సంస్కృతి మారింది. అందువలన విపరీతంగా పెరిగిన జనసమ్మర్ధానికి అనుకూలంగా గృహవసతి పెరగవలసి ఉన్నా అది జరగడం లేదు. అందువల్ల విపరీత ఫలితాల్ని - అనుభవిస్తున్నాం. విపరీత ఫలితాల బాధల నుండి దూరంగా ఉండడానికే వాస్తు విజ్ఞానం దోహదం చేస్తుంది. ఈ శాస్త్రం విలువ తెలిసి ఉపయోగించుకొనేలా ఉపయోగించుకుంటే మానవుడు సౌఖ్యం పొందుతాడు. ఈ వాస్తు గృహనిర్మాణ కార్యక్రమం నిత్యమూ జరుగుతూ దినదినాభివృద్ధి పొందు తున్న పరిశ్రమ.

10.11 1961 నాటి జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో వేయింట పదిమంది మగవాళ్లూ ముగ్గురు ఆడవాళ్లు గృహనిర్మాణ వృత్తిలో ఉన్నట్లు తెలుస్తుంది. కాని రాతిపని వంటి అనుబంధ వృత్తుల్లో ఉన్నవారి సంఖ్య యింకా ఎక్కువగా ఉంటుంది.

| | పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|---|
| పల్లెల్లో | 1,01,815 | 28,314 | 1,30,129 |
| పట్టణాల్లో | 72,352 | 17,769 | 90,121 |

1,74,167 46,083 2,20,250

పరిస్థితి యీ విధంగా ఉండగా గృహనిర్మాణ వృత్తిలో ఉన్న పనివాళ్లు ఎక్కువ మంది నగర ప్రాంతాల్లోనే ఉన్నట్లు కనబడుతున్నదన్న జనాభా లెక్కల వారిమాట వాస్తవానికి దూరంగా కనబడుతుంది.

తమకది వృత్తిగాని, వినోదంకాని కాకపోయినా అనసరాలను బట్టి గ్రామీణులు చాలా మంది గుడిసెలు, షెడ్డులను తామె నిర్మించుకొంటున్నారు. బావులు త్రవ్వడం గాతాలు తీయడం మొదలైన పనులను తాపీవారు గాక ఇతరులే చేస్తున్నారు. గృహనిర్మాణానికి కావాల్సిన రాళ్లు కలప మొదలైన వాటిని అవి దొరకే చోటు నుంచి నిర్మాణ స్థలానికి వేర్వేరు వృత్తులవారు గాని వ్యాపారస్థులు గాని చేరుస్తున్నారు. కట్టడపు పనిలోని విశేషాల్ని బట్టి దూర ప్రాంతాల నుంచి పనివాళ్లను పిలిపించడం కద్దు. ఇటుక, పెంకు, సున్నం మొదలైన అవసరవస్తువుల్ని ఇతర వృత్తుల్లో ఉన్నవారు తయారు చేసి సరఫరా చేస్తున్నారు. నిజానికి వీరంతా గృహనిర్మాణానికి కాకపోయినా దానికి సంబంధించిన వృత్తుల్లో ఉన్నవారేఅందువల్ల నిర్మాణ వృత్తిలో తత్సంబంద వృత్తుల్లో మొత్తం ఎంతమంది పనిచేస్తున్నారోనిక్కచ్చిగా చెప్పడంసాధ్యం కావడం లేదు. అందువల్ల యీవాస్తు విషయం సర్వజనీనంగా అభివృద్ధి పొందినది. దేశంలో అన్ని కులాలు వర్గాల వారికి ఆప్యాయన గృహం. ఈ ప్రాముఖ్యాన్ని గమనించిన మహర్షులు గృహసూత్రాల్ని ప్రసాదించారు. అలాగే గృహం ఎలా నిర్మించాలో తెలిపే శిల్పవాస్తు శాస్త్రాల్ని ప్రసాదించారు. ఎటొచ్చి ఆ గృహ సూత్రాల్లో మా యీ శిల్ప వాస్తు శాస్త్రాలలోను సమాజంలో అర్థిక పుష్టికలిగి సమయాన్ని కేవలం ధార్మికంగా నడపగలిగే వారికేనున్నట్లు వర్ణనలు ఉన్నాయి గాని సామాన్యుల పేదల విషయం అక్కడ ఉండదు. ఐనా ఆ ఋషుల గురించి స్మరించకపోతేయీ విషయం అసంపూర్ణమే అవుతుంది. గనుక ఆ అష్టాదశ సూత్రకారుల పేర్లు అష్టాదశ శిల్ప శాస్త్ర కారుల పేర్లు పొందుపరచడమైంది.

10.12 అష్టోదశ గృహ్యసూత్రకర్తలు     అష్టాదశ శిల్ప శాస్త్రాల కర్తలు

| | అష్టోదశ గృహ్యసూత్రకర్తలు | | అష్టాదశ శిల్ప శాస్త్రాల కర్తలు |
|---|---|---|---|
| 1. | మను | 1. | భృగు |
| 2. | ఆపస్తంబ | 2. | అత్రి |

| | | | |
|---|---|---|---|
| 3. | బోధాయన | 3. | వసిష్ట |
| 4. | అశ్వలాయన | 4. | విశ్వకర్మ |
| 5. | కాత్యాయన | 5. | మయ |
| 6. | శాంఖాయణ | 6. | నారద |
| 7. | లాట్యాయన | 7. | నగ్నజిత్ |
| 8. | పారస్కర | 8. | విశాలాక్ష |
| 9. | భారద్వాజ | 9. | పురందర |
| 10. | హిరణ్యకేశీ | 10. | బ్రహ్మ |
| 11. | సత్యాషాఢ | 12. | నందీశ్వర |
| 13. | జైమినీయ | 13. | శౌనక |
| 14. | అగస్త్య | 14. | గర్గ |
| 15. | శాల | 15. | వాసుదేవ |
| 16. | మాధ్యందిన | 16. | అనిరుద్ధ |
| 17. | కౌషీతకీ | 17. | శుక్ర |
| 18. | బార్హస్పత్య | 18. | బృహస్పతి |

గృహం ఉంటేనే కదా గృహ్యం. సూత్ర కారులంతా సమాజం బాగా పెరిగిన తర్వాతనే యీ సూత్రాన్ని రాసినట్లు తెలుసుకోవచ్చు. గృహాలతో పెరిగింది. గృహస్థాశ్రమవ్యవస్థ. తక్కిన ఆశ్రమాలకూ యిదే ఆధారమైంది కూడా అందుకే మను చరిత్రలో అల్లసాని పెద్దన్న ఇలా అంటాడు.

కెలకులనున్న తంగెటి జున్ను గృహమేధి, యజమాను డంకస్థితార్థ పేటి
పండిన పెరటి కల్పకము వాస్తవ్యుండు, దొడ్డి బెట్టిన వేల్పుగిడ్డికాపు
కడలేని అమృతంపు నడబావి సంసారి, సవిధమేరునగంబు భవన భర్త
మరుదేశపథమధ్యమప్రప కులపతి, ఆకటి కొదవు సస్యము కుటుంబి
బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి, జటి పరివ్రాజకాతిథి క్షపణకావ

ధూత కాపాలి కాద్య నాధలకు [illegible]రోత్తమ గార్హస్థ్యమునకుసరియె॥
మనుచరిత్ర (1-66)

10.13 ఈ యజమాని  కొన్ని కర్మల్ని ప్రధానంగా ఆచరించాలి.  ఆయా కర్మలు ఆదరించడానికి కొన్ని శిల్ప కర్మల్ని కూడా అనుబంధించారు.  ఈ విధంగా కర్మలూ వాటిని దాటడానికి చిహ్నాలుగా కొన్ని శిల్పాలు తగిలించారు. కాలక్రమంలో ఆ చిహ్నాల్ని చూడగానే ఆ సంస్కారం ద్వారా ఆ వ్యక్తి సంస్కరింపబడ్డాడని తెలుసుకోవచ్చు. ఉదాహరణకు ఒకవ్యక్తి శరీరంపై 'యజ్ఞోపవీతం' అనే శిల్పాన్ని - చిహ్నాన్ని చూడగానే ఆ వ్యక్తికి ఉపనయన సంస్కారం జరిగినట్లు తెలుసుకోవచ్చు.  అలా షోడశకర్మలూ వాటికి అనుబంధంగానో ప్రధానంగానో జోడింపబడిన చిహ్నాశిల్పాలూ గమనింపదగ్గవి.

1. జాతకర్మ : పిల్లవాడు పుట్టగానే చేసే సంస్కారం బంగారు శలాకతోతేనె లేక నేతిని పిల్లవాడికి  నాలుకపై పెట్టి నాకించాలి.

2. నామకరణ : తండ్రి పిల్లవాడి చెవిలో పేరు చెప్పాలి "రూపం ప్రతిరూపం బభూవ" అంటూ భగవంతుడు రూపాలెలా చేస్తాడోవివరించే శిల్పాత్మకమైన మంత్రాన్ని స్మరించాలి.  ఇక్కడ తల్లిదండ్రులు తాతలు తప్పక ఆభరణం ఇవ్వడం రివాజు.

3. నిష్క్రమణ : పిల్లవాడ్ని ప్రసూతి గృహమునుండి తన గృహానికి తెచ్చుకోవడం - సామాన్యంగా అత్తగారింటినుండి అక్కడినుండి పిల్లవాడికి ఆభరణ ప్రాప్తి సూచించబడింది.

4. అన్నప్రాశన : పిల్లవాడికి క్రొత్త పాత్ర నిచ్చి దానిలో అన్నం ముట్టించడం.

5. చౌలం : చెవులకు పోగులు కుట్టడం

6. ఉపనయనం : గాయత్రీ మంత్రోపదేశంతో బాటు యజ్ఞోపవీతం అనేకార్పాస సూత్రాన్ని మేఖలాది అలంకారాల్ని ధరింపజేయడం

7. వేదవ్రతం : ఈ కాలంలో పూర్తిగా లోపించిన సంస్కారం

8. మహానామ్ని

9. మహావ్రతం : పరమ వైదిక కర్మలు సామాన్యులకు ఎప్పుడో దూరమైనవి

10. గోదానం

11. సమావర్తనం: వివాహానికి అర్హత సంపాదించుకోవడం అర్థం. అందం సామాన్యులు ఉపయోగించడానికిఅనుమతి సంపాదించుకోవడం.

12. వివాహసంస్కారం : గృహస్థాశ్రమానికి ఒక తోడునుసంపాదించుకొని ఆమెకు మంగళసూత్రం మట్టెలు మొదలైన అలంకారాలు ధరింప జేయడం

13. గృహప్రవేశం: ఆ వ్యక్తికి గృహం ఉన్నాలేకపోయినా సంస్కారం కొఱకైనా యీ కార్యక్రమం జరపడం ఆచారం. నవీన పత్నితో పతి దేవుడు ఇంట్లో ప్రవేశించడం.

14. గర్భాదానం : సంతానోత్పత్తికి పురుషుడుప్రయత్నించడం

15. పుంసవనం : గర్భిణికి 6వమాసంలోపుత్ర సంతానం కొరకు మూలికా ప్రయోగం సంస్కారరూపంలోపెట్టారు. కాని ప్రస్తుతం యీ మూలికా ప్రయోగంమరిచిపోయి కేవలం నామమాత్ర సంస్కారం జరిపిస్తున్నారు. అందువల్ల పురుష సంతాన లాభాన్ని పోగొట్టుకొంటున్నారు.

16. సీమంతోన్నయనం : ప్రతి-పత్నికి సుఖ ప్రసవం కలగడానికి దర్భలతో తలపై పాపట మీద రుద్దడం ఇవన్నీ పూర్వ కర్మలు. ప్రతి హిందువు తెలుసుకొని తప్పక ఆచరించాలి.

ఈ కర్మలన్నిటిలోనూ అగ్నిపూజలు వేదఘోష గృహయజమాని సన్మానము బంధుమిత్ర భోజనము ఆచార్య సన్మానము మొదలైన మర్యాదలెన్నో ఉన్నాయి.

10.14 ఆధునిక కాలంలో అందరూ యీ కర్మల నన్నిటినీ ఆచరించడంలేదు. కాని అందరూ విధిగా (గృహాన్నీ) గృహస్థ ధర్మాన్నీ ఆచరిస్తున్నారు. గృహాన్నిఎంతో అందంగానూ సుఖవంతంగానూ రూపొందించుకోవడంలో అహమహమికతో ఉరుకులెత్తుతున్నారు. దీనివల్ల 'గృహాలంకరణ శిల్పం' అనే మరోశాఖ

చివురించింది. కాని అది మనదేశంలోయింకా బాల్యావస్థలోనేఉంది పాశ్చాత్య దేశాలతో పోల్చి చూస్తే

10.15 ఇప్పుడు సింహావలోకనంగా మనం గృహం గృహపతి-గృహిణి-గృహ్యాం అనే శబ్దాలతో సమాజానికి యీ శిల్పి కర్మ అందించిన మహత్తరమైన కేంద్ర బిందువును గుర్తుచేసుకొంటే మన ప్రాచీన శిల్పాచార్యుల దూరదృష్టి తెలుస్తుంది. మన సాంస్కృతిక సంబంధాల విలువ తెలుస్తుంది. భారత శిల్ప సంస్కృతి పటిష్టతకు ఆధారం తెలుస్తుంది.

10.16 ఇప్పుడు మనకు వాడుకలో ఉన్న గృహసంబంధమైన కొన్ని శబ్దాలు కేవలం గృహనిర్మాణానికి లేక గృహం యొక్క భౌతిక రూపానికి సంకేతాలైతే మరికొన్నిదాని సాంస్కృతిక రూపానికి సంకేతాలు

ఉదాహరణకు గృహిణి : గృహపతి భార్య

"నగృహం గృహమిత్యాహుః

గృహిణీ గృహముచ్యతే"

అని భౌతిక రూపాన్ని దాటి గృహిణి యొక్క విశ్వరూపానికి ప్రాధాన్యత నిచ్చే సాంస్కృతిక లోకోక్తిగుర్తు చేసుకొని ఆలోచిస్తే యీ శిల్ప కర్మననుసరించి పెరిగినపరిధి తెలుస్తుంది.

గృహము యొక్క భౌతిక రూపానికి
ఇంటి స్థలమూ
ఇంటి రూపము
దాని ఇతర అందాలైన ప్రహరీ - వాకిలీ
గోడలు - అరుగులు - కప్పు - కిటికీలు
లోపలి నివాస గృహం - అరలు
వంటిల్లు - దొడ్డి - మొదలైనవి
బాహ్యరూప సంకేతాలైతే
దానిలో ఉండే

గృహపతి + గృహిణి

అనే జీవులు ఆధారంగా వారి సంస్కారాల్ని చేప్పే శిల్పాలు సంకేతాలుగా ఉంటాయి. అందువల్ల దీనికి గృహం అనే చిన్న శిల్పమే ఆధారమనీ - అది లేకపోతే యీ సంస్కృతికి ఆధారం అర్ధమూ ఉండదని తెలియాలి.

గృహంలేని గృహపతి ఉంటాడా?
గృహం లేక గృహ్యం ఉంటుందా?

10.17 కనక

గృహస్థాశ్రమానికి గృహశిల్పం ఆధారం.

అలాగే రోలు, రోకలి, సన్నెకలు, పొయ్యి, నిప్పువంటివి కేవలం దైనందిన గృహోపయోగ శబ్దాలే అయినా వాటికున్న సాంస్కృతికమైన విలువలుసామాన్యుడికి తెలియవు. వివాహాదులలో సన్నెకలు త్రొక్కించుట అనేక గృహ్యాకర్మలలో పొయ్యిలోని నిప్పునుపయోగించుట అనేవి ఆ యింట్లో ఉన్న వారికి ఆయా కర్మల్లో భాగస్వామ్యం కల్పించడానికినిర్దేశింపబడ్డాయి. ఆయా సంస్కారాలకు అవి ప్రధానాంగాలు. ఆ కర్మలు జరిగినప్పుడు యాంత్రికంగా వానిని ఉపయోగించి విసర్జించటంతో వాని పవిత్రతను సామాన్యులు గుర్తింపలేకున్నారు. పురోహితులు ఆయామంత్రప్రయోగం తర్వాత వారేనిర్లక్ష్యంగా విసర్జిస్తుంటే గతానుగత చర్యలకు దిగి ఉంటే సామాన్య గృహస్థుడు ఎలా వానిని గమనించగలడు? కనుక వేదవిదులైన వారు యీ విషయాల్ని సామాన్యులకు బోధించాలి.

రోలు - రోకలి - సన్నెకలు - చెంబు - బిందె మొదల్... ఎ కేవలం గృహ...కరణాలుగా మాత్రమే. వాటికి సా...స్కృతిక జీవనంలో పూజ్యస్థానం ఉన్నదన్న సంగతి గుర్తు చేయాలి.

1. భూమి - దాని వివిధరకాల పేర్లు
2. ఇల్లు - దాని వివిధ రూపాలూ
3. ఇల్లు - దాన్ని కట్టడానికి కావల్సిన ద్రవ్యాలు, రాయి, ఇటుక ఇత్యాదులు
4. ఇల్లు - దాన్ని కట్టడానికి కావల్సిన సాధనాలు ఉపకరణాలు, తాపీ,

సుత్తి,రంపం ఇత్యాదులు

5. ఇల్లు - దాన్ని కట్టేవాడు - మేస్త్రీ - కూలీ ఇత్యాది వ్యక్తులు
7. ఇల్లు - దాని అనుబంధ నిర్మాణాలు ఇల్లు, బావి, - సందు, వీధి, రోడ్డు
8. ఇల్లు - దాని అలంకరణ - నిర్వహణ
9. ఇల్లు - విభజన - విస్తరణ
10. భూమి వివరం

గృహనిర్మాణానికి ఆధారంభూమి గనుక మొదట భూమి లక్షణం శాస్త్రంలో వివేచింపబడింది. ఈనాడు ఏవిధమైన విచక్షణా లేకుండా నిర్మాణాలు సాగుతున్నందున శాస్త్రీయత లోపించిందనీ, జన ప్రవాహం విపరీతంగా పెరిగినందున ఈ కట్టడాల పరిస్థితీ అలాగే పెరగవలసి ఉందనీ సమర్థించుకోవలసి వస్తుంది. శాస్త్రీయ పరిశోధనలో మన ప్రాచీనులిచ్చిన నిర్ణయాలు సరైనవే. ఆధునికులు శాస్త్రీయమైన పరీక్షలో భూమిని ఎన్నుకొనిఉపయోగించుకోవాలి.

10.19 2. ఇల్లు - దాని వివిధ రూపాలు

1. పర్ణశాల 2. కుటి, 3. లతాగృహం, 4. పూరిగుడిసె, 5. బుడిమి,6. కమ్మరిల్లు, 7. చుట్టిల్లు, 8. గుడిసె, 9. పూరిల్లు, 10. వాసిల్లు, 11. కొమరిల్లు, 12. చౌకపిల్లు, 13. కాశెగుడిసె, 14. గోలిల్లు. 15. నేలపాక, 16. చుట్టుపాక, 17. దోనిపాక, 18. వారపాక, 19. పెంకుటిల్లు, 20. సంకిట్లు, 21. చాటాకుల్లారి, 22. లోగిలి, 23. సరాలిల్లు, 24. కురుమాడిల్లు, 25. మిద్దె, 26. చౌడుమిద్దె,27. తీరుమిద్దె, 28. డాబా, 29. మేడ, 30. లోగిల్లు, 31. డేరా, 32. వడ్డీ, 33. నేలమాళిగ, 34. డోము, 35. మండపం, 36. పందిరి, 37. చలువ పందిరి, 38. ప్రాలంకార పందిరి, 39. శాల, 40. సత్రశాల,

అనేక రకాలతో మనం ఇప్పుడు వాడుకలోఉన్న వాటిని చూడవచ్చు.

శాస్త్రంలో మాత్రం చిన్నదానికి పెద్దదానికికలిపే పేర్లు వ్యవహరిస్తూ వచ్చారు.

ప్రాసాద : సదనం పద్మ వస్తుధామ నికేతనం

మందిరం భవనం వాసో గేహవేశ్మ విమానకం

ఆశ్రయం చాస్పంద చైవ ఆధారంచ క్రమేణతు
ఆధారం చాస్పంద చైవ ఆధారంచ క్రమేణతు
ఆధారం ప్రతిదిష్ణ్యంచ హర్మ్యపర్యాయ వాచకా ః

తస్మాదత్ర పరోనాస్తి పరిమాణం సముచ్యతే(కాశ్యపశిల్ప శాస్త్రం 23వ పటలం)

ప్రాసాదము సదనము - సద్మము వస్త్యము - ధామము - నికేతనము మందిరము - భవనము - వాసము - గేహము - వేశ్మము - విమానము ఆశ్రయము - ఆస్పదము - ఆధారము - ఆధారప్రతిధిష్ణ్యము - హర్మ్యము - అనేవి ప్రాసాదమునకు పర్యాయపదములుగా కాశ్యప శిల్పశాస్త్రములో చెప్పబడినవి. కాని యివి గాక నీడం, నివాసం -గృహం - శాల - సౌధం మొదలైన శబ్దాలు గూడా ఉన్నాయి. ఇందులో ప్రతి శబ్దానికి అర్థం వేరు. కొన్ని శబ్దాల్ని సామాన్యంగా వాడవచ్చు. కొన్నిటిని అలా వాడడానికి వీల్లేదు హర్మ్యము - ఆశ్రయము సమానాలుకావు. అలాగే నీడము గేహము సమానాలు కావు. ఏదైనా నివాసయోగ్యమైనవే అన్నసామాన్యార్థంలోవీటినన్నిటిని కలుపుకోవాలే తప్ప అన్యధా కాదు.

10.20.కట్టుబడికి కావల్సినవి

సామాన్యంగా యిళ్లను పూర్వం మట్టితోనే కట్టేవారు. అది కొంత కాలానికి సున్నంతో సాగింది ఇప్పుడు అచ్చంగా సిమెంటు తప్పయితరం వాడడం లేదు. రాతి కట్టడాలు చాలా ఖరీదైనందున, అందానికి అందుబాటుకీ సిమెంటుకట్టడా లే ప్రబలంగా వస్తున్నాయి సిమెంటు యినుము కలిపి కట్టడం వల్ల నగరాల్లో నివాస గృహాలన్నిమూసపోసిన రీతిలోనేతయారౌతున్నాయి. చాలా వరకు శాస్త్రీయత లోపించిన కట్టడాలే వస్తున్నాయి కారణం - నగరాల్లో స్థలం కట్టడాలపై మోజు లాంటి విషయాలు మనుష్యుల్ని ఒక అడుగు ముందుకు మరో అడుగు వెనక్కు తీసుకెళ్లింది. నగరాల్లో కాంక్రీటు అరణ్యాలుపెరిగాయి.

10.21 ఇల్లు కట్టడానికి కావాల్సిన సాధనాలు

ఇవి యధాపూర్వాలే. వీనిలో మార్పు అంతగా లేదు. తాపీ వాడకం పోలేదు. పడంబము సాపు బద్ద మొదలైన పరికరాలు అలాగే ఉన్నాయి. గజంబద్ద -కొయ్య తాపీ - గడ్డపార - గంప -దిమ్మె అను మొదలైన వాటినినేటికి వాడుతున్నాం.

10.22 ఇల్లు కట్టేవాళ్లు

పూర్వంయిల్లు కట్టడానికి శాస్త్రం తెలిసిన శిల్పాచార్యులుండేవారు. కాల క్రమంలో అది మారిపోయింది. ఇప్పుడు కేవలం కొన్ని అంచనాలతో పనిచేసే కూలీలుమాత్రమే రంగంలోఉన్నారు. అందువల్లనే గృహం కట్టుకునేవారు గృహారంభం ముహూర్తానికొక దగ్గరికీ వాస్తుచూడ్డానికొకరి దగ్గరికీ నిర్మాణానికి ఒకరి దగ్గరికీ సరుకులకు యింకోదగ్గరికీ పరుగెత్తాల్సి వస్తుంది. క్రమంగా ఇప్పుడు గుత్తేదార్లు యీ వృత్తికి ప్రధానులుగా నిలుస్తారని తెలుస్తుంది.

10.23 ఇంటి నిర్మాణ దశలు

ఇంటి నిర్మాణం అంటే ఒకటి రెండురోజుల్లోనేవారాల్లోనో జరిగిపోయే కార్యక్రమం కాదు. మంచి ముహూర్తాన వాస్తుపూజ సేయాలి. తర్వాత పునాదులు త్రవ్వాలి. ఆపై గోడలు లేపాలి. ద్వారాలు పెట్టాలి చివరిగా కప్పువేయాలి. ఇందులో ఒక దశకూ మరో దశకూ సమయం పడుతుంది. ఈ సమయాన్ని తప్పకుండా పాటిస్తేనేఇంటి యొక్క సౌష్ఠవం నిలిచేది.

10.24 ఇంటికి అనుబంధ నిర్మాణాలు

ఇంటికీ దొడ్డి -దోవ - బావి సందు, వీధి మొదలైనవి చూడడం పరిపాటి. ఇవి యింటికి అందాన్నీ సౌకర్యాల్నికలగజేస్తే ఇవి లేకపోతే కొన్ని సమయాల్లో అది ఎంత పెద్ద యిల్లైన శోభారహితంగానూ సౌకర్య రహితంగానూ ఉండి నివాస యోగ్యతను కోల్పోతుంది.

10.25 ఇంటి అలంకరణ

ఇంటి అలంకరణ అనేది ప్రాచీన కాలంలోనూ ఉండేది. కాని ప్రస్తుతం పాశ్చాత్య దేశాలనుండి దిగుమతి యైన సరుకులతో అది యింకోమార్గంలో జరుగుతుంది. ఏమైనప్పటికీ ఇంటికీ అలంకరణ అనేదికూడా చాలా ముఖ్యమైన

విషయమని మరచి పోకూడదు.

ఆధునిక కాలానికి అనుగుణంగా వసతులూ వైభవాలు పెరగడానికి ఇండ్లను అంతస్తులతో పెంచడం - పెద్ద పెద్ద ప్రహరీలతోఅలంకరించడం - ఓ స్థాయిలో అపార్ట్‌మెంటులుగా విభజించి ఎన్నో కుటుంబాలకు ఆవాసంకల్పించడం లాంటి విశేషాలు గమనార్హాలు.

10.27 ఇంటి ఆచార విచారాలు

ఇంటికి ముగ్గు పోసిన దగ్గరినుండి భూమి పూజ, భూశోధన, గోపూజ, వాస్తుపూజ క్స్రాధన, శంకుస్థాపన, పునాదితీసేపూజ, మొదటి రాయి పెట్టిన పూజ, పునాదులు నింపిన తర్వాత ఇంటికి దిమ్మెతయారౌతుంది. దానిపై ద్వార బంధాలు నిలిపేటప్పుడు పూజ, కిటికీల స్థాపన, ఇత్యాదులూ జరుగుతాయి. ఇవన్నీ పూర్తియిన తర్వాత గృహప్రవేశం అనే కర్మ జరుపుతారు. అలాగే ఆ యింట్లో పెండ్లయినప్పుడల్లా క్రొత్త పెండ్లి కూతురు, ఇంటికి వచ్చినప్పుడల్లామళ్లీ గృహప్రవేశం అనే కార్యక్రమం జరుపుతారు. ఇవి గాక అవసరాన్ని బట్టి మత్స్య యంత్ర స్థాపన, వాస్తుపూజలు జరుపుతారు. ఇవి సామాన్యంగా యింటికిసంబంధించినంత వరకు అవసరమైన పూజలు. ఈ పూజల్లో యజమాని వాస్తు దేవతల్ని ప్రార్థించాలి. ఆ దేవతల సంతోషం కోసం ఆచార్యుడ్ని - శిల్పినీ - బ్రాహ్మణుల్నీ - బంధుమిత్రుల్నీ సంతోషపెట్టాలని శాస్త్రాల్లో ఉంది.

---

## సందర్భ గ్రంథాలు

1. ఆగమ శిల్పశాస్త్ర పరిచయము : డా॥ పెదపాటి నాగేశ్వరరావు
2. కాశ్యపశిల్ప శాస్త్రము : డా॥ పెదపాటి నాగేశ్వరరావు
3. మన సంస్కారములు : గడియారంరామకృష్ణశర్మ
4. తెలుగు విజ్ఞాన సర్వస్వం : 14వ సంపుటం
5. వాస్తు సూత్రోపనిషత్తు : డా॥ పెదపాటి నాగేశ్వరరావు

# అధ్యాయం : 11

## ఒడలు : మానవ శరీర శిల్పం

11.01 ప్రపంచమంతా పరమేశ్వరుడుచేసిన శిల్పమే. అందులో మానవ రూపం గూడా పరమేశ్వరుడు చేసిన శిల్పమే. ఈ శిల్పం మీద ఆధారపడి మానవుడి ప్రాపంచిక కల్పనా శిల్పం పనిచేస్తుంది గదా! అందువల్ల తక్కిన శిల్పాలన్నిటినీ పరిశీలించేటప్పుడు మన శరీరం అనే దేవుడిచ్చిన శిల్పాన్ని ఊడా పరిశీలించడం అవసరం. ఈ పరిశీలనయే మన పూర్వ శిల్పాచార్యులు తమ గ్రంథాల్లో చేసిన అంగప్రత్యంగ నిర్ణయం. ఆయుర్వేదాది గ్రంథాల్లో ఆయా శరీర అవయవాల పరిశీలనుంటే వాటి మార్పుతో శిల్ప శాస్త్ర గ్రంథాల్లో ఆయా అవయవాల రూపాలు వాటి కొలతలూ ఉన్నాయి. ఈ కొలతలు సంపూర్ణసత్యాలా? కావు సంపూర్ణ మానవులు లేరుగాబట్టి - ఈ కొలతలు సంపూర్ణ పురుషులకుద్దేశింపబడినై గాబట్టి సామాన్య మానవుల విషయంలో భేదిస్తాయి. కాని రూపారూప రేఖాంశాలు తెలుసుకోడానికి పూర్తిగా సహకరిస్తాయి. నియతంగా గోచరించే రూపం నుండి యీ విషయాలు గ్రహించవచ్చు. తల అందులో ముందు వైపు ముఖం - రెండుకన్నులు - నోరు - ముక్కు - పెదవులు - గడ్డము - ఈ తల కాధారంగా కంఠమూ ఈ కంఠము క్రింద భుజపట్టిక దానినుండిరెండు చేతులు సమానమైన పొడవు లావులతో వ్రేలాడుట, వాటికి హస్తాలు - హస్తాల వేళ్ళువ్రేళ్ళకు గోళ్ళు సమాన స్థాయిలో ఉండడం చూస్తాము. అలాగే వక్షః స్థలమూ - హృదయమూ - ఉదరము - నాభి - కటి గుహ్యాస్థానము - తొడలు - మోకాళ్లు - మోచిప్పలు - కీళ్ళు చీలమండలు పాదాలు - పాదాల వ్రేళ్లు - అరికాళ్లు - అన్నీ నియతంగా లెక్క ప్రకారం భగవంతుడు అమర్చిపెట్టాడు వాటినిశాస్త్రకర్త చక్కగా ఆకలనం చేసి అందించాడు. దాన్ని శాస్త్ర పరిచయం లేని వాళ్ళు మామూలు లెక్కలుగా చూసినా దాని వై...ష్యం ప్రకృతిలోని జీవుల శరీర క్రమంతో సరితూచి నిశ్చయించుకొంటే గాని తెలియదు.

అరచేతికి సరిపోయే ముఖం - ముఖానికి సరిపోయే పాదం పాదానికి సరిపోయే హస్తం - లాంటి శైల్పిక రహస్యాలు శరీర కల్పనలో భగవంతుడమర్చడం యిక్కడ విశేషం. పువ్వుల్లాంటి రెండు కన్నులు,దొండపండులాంటి పెదవులు, శంఖంలాంటి కంఠం, రెండు తూడుల వంటి వేణువుల వంటిబాహువులు వాటిచివర మళ్లీ రెండు పద్మాల్లాంటి (అలాంటివే) రెండు పాదాలు కలిసి ఈ శరీరమంతా ఒక పంజరం అందులో అందంగా అమర్చబడే వివిధ అవయావాల వైశిష్ట్యం జగచ్ఛిల్పి చేసి అందించిన రూపపాలంకారం ఈ శరీరం. దీనిని బహుధా పరిశీలించి శాస్త్ర బద్ధం చేశారు పూర్వాచార్యులైన శిల్పులు. శాస్త్రీయమైన అంగ నిర్మాణం ఎలా ఉందో చూడండి.

11.02 "ఓ బ్రాహ్మణోత్తమా। ఉత్తమ దశతాళ విగ్రహము యొక్క లక్షణవ చెప్పుచున్నాను వినుము. విగ్రహము ఎత్తును 124 అంశములు చేయుము ఆ అంశములు లేక భాగములతో కూడిన దానినే తాళమాన మందురు. 124 అంశములు చేయుము. ఆ అంశములు లేక భాగములతో కూడిన దానినే తాళమాన మందురు. 124 భాగులు మొత్తము. ఉష్ణీషము నుండి పాదము వరకు గల శరీరము యొక్క కొలత అగును. ఉష్ణీషము యొక్క ఎత్తు ఒక అంగుళము మూడు యవల పొడవు అని చెప్పబడినది. కేశాంతము నుండి అక్షిసూత్రము వరకు నాలుగు అంగుళముల మూడుయవలు. నేత్రసూత్రము నుండి పుటాంతము వరకు, నాసాపుటము నుండి హస్వంతము వరకు ఒక్కొక్క భాగము 4 అంశముల యవల ఎత్తుండును. దౌడ కొలత నుండి గళము వరకు 4 యవల పొడవుండును. కంఠము యొక్క ఎత్తు 1యవ తక్కువ 4 అంగుళములు. కంఠమూలము నుండి హనువు వరకు కొలచుసూత్రమును హిక్కా సూత్రమందురు. హిక్కా సూత్రము నుండి హృదయము వరకు, నాభి నుండి మేఢ్రమూలము వరకు ప్రతిభాగము పదమూడు అంగుళముల నాలుగు యవల పొడవుండును.

11.03 ముఖము ముందు భాగము వెడల్పు పండ్రెండు అంగుళముల నాలుగు యవలుండును. ముఖము నుండి చెవుల చివర వరకు వున్న వెడల్పు

పదమూడు అంగుళముల నాలుగు యవలు గొంతు పొడవు 9 అంగుళముల 4 యవలు. గొంతు మొదటివెడల్పు 10 అంగుళములు. హృదయము నుండి రెండు బాహువుల మధ్య అడ్డుకొలత రెండు చంకల మధ్య దూరము 22 అంగుళముల 4 యవలు. బాహువులు మొదట వెడల్పు 9 అంగుళముల 4 యవలుండును. స్తనమూలము మీదుగా రెండు బాహువుల మధ్య దూరము 21 అం.లు. హృదయము దగ్గర శరీరము యొక్క వెడల్పు 19 అంగుళములు.

11.04 నడుము యొక్క అడ్డుకొలత 14 అం. 4 యవలు అని చెప్పబడింది. నడుము క్రింది భాగము అడ్డుకొలత అనగా శ్రోణితారము 19 అంగుళములు. కటి యొక్క ముందు భాగము వెడల్పు 18 అం.లు. కటిక్రిందిభాగము 20 అం. 4 యవలు. దౌడల మొదటి వైశాల్యము 13 అం. 6 యవలు. ఊరువులమధ్య వైశాల్యము 12 అం. 2 యవలుండును. జానువు యొక్క వెడల్పు 19 అం. 6 యవలు జంఘామూలము యొక్క వెడల్పు 8 అం.2 యవలు. జంఘనుండి నలక వరకు 4 అం. 6 యవలు. గుల్ఫము యొక్క చుట్టుకొలత 3యవలు. అక్షమునుండి పాదతలము ఎత్తువరకు దాని వెడల్పు చెప్పబడుచున్నది. పార్ష్ణితలము యొక్క మధ్యభాగము 6అం. 2 యవలు. పాదతలము యొక్క చివరి విస్తారము 7 అం. 2 యవలు. పాదము చూపుడు వ్రేలి పొడవు 4 అం. 3 యవలు. పాదము మధ్యవ్రేలు పొడవు 3 అం. 2 యవలు. పాదము చూపుడు వ్రేలి పొడవు 4 అం. 3 యవలు పాదము మధ్యవ్రేలు పొడవు 3 అం. 6 యవలు. పాదము యొక్క అనామిక వ్రేలి పొడవు 2 అంగుళముల 4 యవలు. ఆయా వ్రేళ్ళ యొక్క వెడల్పులు 4 అంగుళములు. వ్రేలి కణువు పొడవులో 3వ భాగము గోటి పొడవగును బాహువుల మధ్య వైశాల్యము 8 అంగుళముల 3 యవలు. కూర్పరము యొక్క వ్యాసము 7 అంగుళముల 2 యవలు.

11.04 ప్రకోష్ఠము యొక్క మధ్య విస్తారము 5 అంగుళముల 6 యవలు మణిబంధవు వైశాల్యము 3 అంగుళముల 6 యవలు (మణిబంధమును తెలుగులో మణికట్టు అంటారు). హస్తతలం యొక్క వెడల్పు 7 అంగుళములు.

మధ్యవ్రేలు 6 అంగుళముల 4 యవలు అనామిక పొడవు 4 అంగుళముల 2 యవలు తర్జన వ్రేలి కొలత 5 అంగుళము 2 యవలు. తర్జనీవ్రేలు 8 యవల పొడవుండును. మధ్యమవ్రేలు 9 అంగుళములు. అనామిక (ఉంగరపు వ్రేలు) 8 యవలు. చివరెవ్రేలు 7 యవలు. ఈ విధముగా అంగుష్ఠము మొదటి చివరి వ్రేలు వరకు కొలతలు చెప్పబడినవి. వ్రేలి చివరి వెడల్పు వ్రేలు మొదట కొలతలో16వ భాగము వ్రేలి చివరి భాగపు వెడల్పులో 6లో 5వ వంతు ఉబ్బిన మాంసముండును. దాని కొలత 6లో 5వ వంతు ఉండును. గోటి రూపము గుండ్రముగా నుండవలెను. గోటి పొడవు వెడల్పు కన్న 1 భాగము అధికము. వ్రేలు యొక్క భాగములను కణుపులందురు. కణుపు వెడల్పు గోటికి రెండింతలు మొదట - మధ్య - చివరల యందున్న కణుపులు ఉండును. బొటనవ్రేలి మొదటిదీ కనిష్ఠ యొక్క మొదటి కణువు 13 యవలు. మొదటి కణువు కన్న చివరి కణుపు కన్న మధ్య కణుపు పెద్దదిగానుండును. అరచేతి చివరివెడల్పు 51/2 అంగుళములు మధ్య వెడల్పు 6 అం.లు. హస్తతలమూల విశాలము 6 అంగుళములుండును. అంగుష్ఠమూలము నుండి తర్జనీమూలము వరకు 21/2 అంగుళములుండును. అంగుష్ఠమునకు క్రిందనున్న ఉబ్బెత్తు మాంసమును శుకోదర మందురు. అంగుష్ఠమూలము నుండి మణిబంధము చివరి వరకు పొడవు 4 అంగుళములని చెప్పబడెను. అంగుష్ఠమూలము యొక్క ఘనవ్యాసము 21/2 అంగుళములు. చేతి ప్రక్కలావు 3 అంగుళాలు అంగుష్ఠము యొక్క చివర తగ్గి యుండును. వ్రేళ్ళ యొక్క క్రింది భాగమున 2 1/2 అంగుళముల ఉబ్బెత్తు మాంసముండును. ప్రక్కనున్న శుకోదరము యొక్క లావు 2 అం.లు మిగిలిన చేతి మధ్య భాగము / అరచేయి / పల్లముగా నుండును. ఆ పల్లము 5 గాని 4 గాని 3 గాని యవలలో నుండును. అరచేతిలోని సన్నని గీతలను గీయవలెను. అవి శంఖాకారములో గాని చక్రాకారములో గాని శూలా కారములో గాని ఉండునట్లు గీయవలెను. హస్తతలములో రేఖలు పద్మముల రంగులో గాని దర్భలరంగులో గాని కల్పింపవలెను. ఆ రేఖల యొక్క పల్లము యవలోని ఎనిమిదవ భాగముండవలెను. వృత్తాకారములో నున్న

అవయములను మొదట ఐదు భాగములు చేసి అందు ఒక భాగమును స్వీ కరించి దానిని మూడింతలు చేసినచో అది అవయవము యొక్క చుట్టు కొలత యగును. దీనినే అడ్డుకొలతయనియు చెప్పుదురు. దానిననుసరించి వెడల్పును నిర్ణయింపవలయును. కర్ణముల మీదుగా శిరస్సు యొక్క చుట్టుకొలత 22 అంగుళములుండును. చెవుల కొలత 12 అంగుళములు తల మధ్య నుండి ముందుండే కేశాంతం వరకు 9 అంగుళాల పొడవుం టుంది. శిరసు మధ్య నుండి చెవుల మీదుగా నున్న వెంట్రుకల చివరలు 9 అంగుళముల పొడవుండును. శిరస్సు మధ్య నుండి పృష్ఠ కేశాంతము వరకు (ముచ్చిలిగుంటవరకు) 3 1/2 అంగుళములుండును. లలాటము యొక్క అడ్డుకొలత 9 అంగుళములు. కేశాంతమునకు అక్షసూత్రమునకు మధ్య కనుబొమ్మ ఉండును. కనుబొమ్మల యొక్క వెడల్పు 9 అంగుళములు. కనుబొమ్మను చాపాకారముగా చేయవలెను. కనుబొమ్మల యొక్క వెడల్పు 9 అంగుళములు. కనుబొమ్మల మధ్య నుండి చివర వరకు బాలచంద్రుని వలె చివరలు సన్నగా నుండునట్లు చేయవలెను. కనుపాప విస్తారము 1యవ. కంటిలోని నల్లపాప విస్తారము 6 యవలు. కంటిలోని నల్ల గ్రుడ్డుకు ప్రక్కల నున్న తెల్ల గ్రుడ్డు 12 యవలు. కన్ను చేప ఆకారములో గాని ధనుస్సు యొక్క ఆకారములో గాని ఉండవలెను. నేత్రమును అర్ధ చంద్రాకారములో గూడ చేయవచ్చును. ఆ ఆకారముననుసరించి రెండు తెల్లని మండలముల యందు అర్ధయవ ప్రమాణముగల రక్తమండలమును కల్పించవలెను.

11.05 కృష్ణమండలము మధ్యలో 1యవ ప్రమాణముగల జ్యోతిర్మండలముండును. జ్యోతిర్మండల మధ్య భాగమున 8వ భాగము దృష్టి మండలముండవలయు ను. కంటిపై రెప్పకొలత 1 1/2 యవ ఉండును. క్రింది రెప్ప కూడ పై రెప్పంతయే యుండును. కంటి పొడవు 18 యవలుండును. కంటిపై రెప్పకు రెప్పకు మధ్య దూరము 6 1/2 యవలుండును. నేత్ర సూత్రమును క్రింది రెప్ప ఉండుచోట విధింపవలయును. విగ్రహదృష్టి క్రింది రెప్ప ఉండు చోట విధింపవలయును. విగ్రహదృష్టి క్రిందికి పెట్టిన కర్తృనాశము కలుగును. ఊర్ధ్వ దృష్టి పెట్టిన ఆపదలు కలుగును. పార్శ్వ

దృష్టియైన గ్రామ ప్రజలకు నష్టములు వాటిల్లును. అందువలన జాగ్రత్త వహించి సమదృష్టి యుండునట్లు చేయవలయును. కంటిని గురించి యింత వరకు చెప్పబడినది ఇకముందు నాసికా లక్షణము చెప్పబడును. ముక్కు పుటల బయట కొలత 18 యవలు మధ్య దూరము 9 యవలు నాసాపుటమూలము 4 యవలు. ముక్కులోని రంధ్రము యొక్క వ్యాసము 7.1/2 యవలు పుటతారము (ముక్కుపుటల గోడ) 5 యవలు. ముక్కు పుట ఆకారము పొట్టు తీసిన గింజవలెనుండవలెను. ముక్కు ఆకారము నువ్వు పువ్వువలె ఉండవలెను. ముక్కు కొస ఎత్తు 1 అంగుళము, దాని మందము కూడా 1యవ. పై పెదవికి పైన ఉన్న పల్లమును 'గోజీ' అందురు. గోజీ దీర్ఘము 4.1/2 యవలు. దాని విస్తృతము 2.1/4 యవలు. గోజీలోతు 1యవ. ప్రమాణము. దానిపైన ముక్కుండును. పెదవి పొడవు 41/2 అంగుళములు. అడ్డముగా నుండునట్టు చెప్పబడినది. పై పెదవి పొడవు కూడా దీనికి సమానము. పెదవుల మధ్య వెడల్పు 3 1/2 యవలు. పై పెదవి పోను పోను తగ్గుచుండును. పై పెదవి అంచును పాళి అందురు. అది 1యవ ప్రమాణములో ఉండును. పాళి మూడు వంకరలు కలిగి యుండును. పై పెదవి యొక్క పొడవు 18 యవలు. అధరోష్ఠము యొక్క విస్తారము 1 అంగుళము 1యవ. క్రింది పెదవి. యొక్క పాళి 1.1/2 యవలా వుండును. గడ్డము నుండి అధరము చివరి వరకు ఎత్తు 6 1/2 అంగుళములు క్రింది పెదవినుండి గడ్డము వరకు ఎత్తు 8.1/2 యవలుం డును. వర్తులముగా నున్న గడ్డము యొక్క అడ్డుకొలత 2 అంగుళములు. హనువుల పరిధి నుండి కర్ణమూలము వరకు 12 అంగుళములుండును. హనువుల యొక్క బయటనుండి2.3/4 యవలుండును. కర్ణము యొక్క వైశాల్యము 18 యవలని చెప్పబడెను. కర్ణము యొక్క విశాలము అక్షిసూత్రముపై నుండి 18 యవలు. కర్ణము యొక్క చివర వృత్తమువలె గుండ్రముగా నుండును. కర్ణశ్రోతములనగాకర్ణములలోపలనుండి పల్లపు ప్రదేశము. నేత్ర సూత్రమునుండి క్రింద కర్ణబంధము 17 యవల దూరములో నుండును. అక్కడ నుండి 4.1/2 అంగుళము పొడవు ఉండవలెను. నాళము యొక్క మధ్య భాగము 3.1/4 విస్తారము 4 అంశములు. చెవియొక్క మొత్తము

ఎత్తు 8 అంగుళముల 7 యవలుండును. పిప్పలి (పిప్పలి యనగాచెవిలోని రంధ్రము నానుకొనియున్న చిన్నగోడ) లావు అంగుళము పిప్పలి వెడల్పు అంగుళము ఎత్తు 1.1/2 యవ. పొడవు 4 యవలు. చెవి వెనుక బాగము కర్ణపాలి యొక్క ఘనము 1.1/2 యవ. పొడవు 4 యవలు. చెవి వెనుక భాగము కర్ణపాలి యొక్క ఘనము 1.1/2 యవ. పొడవు 4 యవలు. చెవి వెనుక భాగము యొక్క వెడల్పు అంగుళము. కేశాంతము నుండి చెవి వెనుక వరకు 11/2 అంగుళములుండును. శాంతము వెనుక నుండి నాడి 1 1/2 అంగుళములుండును. దానికి క్రిందుగా మెడ ఎత్తు అంగుళములు 3 యవలు. కృకటిక అనగా ముచ్చిలిగుంట, కృకటిక యొక్క వెనుక భాగంగామెడ చివరి వరకు 9 అంగుళములు వ్యాసము ఉండును. మెడకు వెనుక 10.1/2 అంగుళములుండును. వృత్తాకారముగ నుండెడు మెడ కొలత మొదటి నుండి చివరి వరకు క్రమముగా లావు తగ్గి ఉండును. హిక్కా సూత్రము నుండి మెడ వరకు ఎత్తు 4 అం. లు. భుజములు కలియు చోటునకు క్రింద భుజము 6.1/2 అంగుళములుండును. హిక్కావరకు దాని లావు అంగుళములు. మెడ వెనుక నుండి క్రింది వైపునకు మూపురపుకొలత 10 అంగుళములు. అట నుండి నడుము వరకు వెన్ను పొడవు 27 అంగుళములు. ఆ వెన్నెముక వంపు 16.1/2 యవలు. వెన్ను పూస మూల భాగమున వెడల్పు 3 యవలు. ప్రక్కల యొక్క ఎత్తు కూడా యిట్లే ఉండును. ఇక చుట్టుకొలతను చెప్పుచున్నాను వినుము. ప్రక్కల అంతరము కొలత 81/2 అంగుళాలు. ప్రక్క చంకల ఎత్తు 7 అంగుళాలు, ప్రక్క చంకలపైన బాహువుల వరకు 7 అంగుళములని చెప్పబడెను. మధ్యవ్యాసము 16 1/2 అంగుళాలు. ప్రక్కలు యొక్క చివరి వెడల్పు 7 అంగుళములు. నాభి సూత్రము దగ్గర విస్తారము 9 3/4 అంగుళములు. ఆ రెంటిని గుండ్రముగా నుండునట్లు చేయవలెను. వాని రెంటి మధ్య దూరము 4 యవలుండును. వాని ప్రక్కల వ్యాసము చెప్పబడును. పిరుదుల యొక్క మీది వెడల్పు ప్రక్క విస్తారము మీదుగా 7 అంగుళములు. స్తనసూత్రము మీదుగా వైశాల్యము 16 అంగుళముల 2 యవలు. మధ్య పార్శ్వ ఘనము 12 అంగుళముల 2 యవలు. శ్రోణి మధ్య ఘనము 17

అంగుళములు. శ్రోణి ఎత్తు 7 అంగుళములు. నాభి సూత్రము నుండి క్రిందుగా 24 అంగుళముల వ్యాసము దూరములో శ్రోణి ముందుగా వచ్చిన భాగము 41/2 అంగుళములు. కంటియొక్క ఘనము 12 1/2 అంగుళములు. మధ్య సూత్రము నుండి పిరుదల ఘనము 1/2 అంగుళము దూరములో మొదలగును. చంక ఎదుటి కొలత 2 అంగుళములు కంఠమూలములో పల్లపు వెడల్పు ఎత్తు కూడా 4 యవలు. హిక్కా సూత్రమునకు జత్రు సూత్రమని పేరు. హిక్కా మధ్యలో నుండి రెండు కక్షల మధ్య 2 అంగుళముల 6 యవలు. రెండుస్తనముల మధ్య హృదయము యొక్క పల్లము 11/2 అంగుళములు కంఠమూలములో పల్లము 3 యవలని చెప్పబడెను. కంఠమునందు త్రిపుండ్రములవలె1.1/2 యవల వెడల్పుతో మూడు గీతలు కల్పించవలెను. కంఠమూలమున నున్న యీ పల్లపు ప్రదేశము హిక్కా సూత్రమునకు క్రిందగా కల్పింపవలెను. మెడను నల్లని వర్ణముతో నున్నట్లు నిర్మించవలెను. హృదయము నుండి స్తనపీఠము యొక్క ఎత్తు 2 అంగుళములు. స్తన విస్తారము 17 యవలు. స్తన మధ్యమున నున్న చూచుకము (బుడిపె) ఎత్తు 2 యవలు. నాభియొక్క ఆవర్తన మూలము వెడల్పు 2 యవలు. అనాభి వృత్తము మధ్య నుండి నాభిసూత్రము పోవును.

11.07 నాభి క్రిందుగా శ్రోణి 4 3/4 అంగుళములుండును. దానికి క్రిందుగా నడుము 2 1/2 అంగుళముల దూరములో నుండును. అక్కడ నుండి మేఢ్రమూలము వరకు మేఢ్ర పీఠము 4 అం. లు. లింగము యొక్క పొడవు 5.1/2 అంగుళములుండును. లింగమూల వైశాల్యము 17 యవలు. లింగమూల వైశాల్యములో మూడింట ఒక భాగముచివర గ్రంధి మూలముండును. దాని చివరి గ్రంథి మూలము 1యవ. లింగాగ్రము ఎర్ర కలువ పూవు యొక్క మొగ్గ వలెనుండును. బీజము యొక్క పొడవు వెడల్పుల వైశాల్యము 4.1/2 అంగుళములుండును. ఘనము 3.1/2 అంగుళములుండును. మూలమునుండి లావు పెరుగును. మేఢ్ర పీఠముండును. మేఢ్రపీఠము వ్యాసము 7.1/2 అంగుళములు. మేఢ్ర మూలము ఊరుమూలము వలె లావుగా నుండును. జానువు యొక్క

విస్తారము 4.1/2 అంగుళములుండును. జానువు ముందుకు వచ్చిన భాగము 2.1/2 అంగుళముల రెండు పార్శ్వముల మధ్యలో మిగిలిన దానిని సౌందర్యానుసారము చేయవలెను.

11.08 కాశ్యపశిల్ప శాస్త్రములో ఉత్తమ దశతాళ పురుషమానము గల 55 వ అధ్యాయము. శిల్ప శాస్త్ర పరిభాషతో కూడిన ఉత్తమ దశ తాళ పురుష విగ్రహము యొక్క అంగప్రత్యంగ వర్ణన. కొలతల వివరములు. ఈ కొలతలు శాస్త్రానుష్ఠానము గలవారికి మాత్రమే పరిమితాలు. ఇతరులకు అవినామమాత్రాలు. కొన్ని కొలతలు కొందరు కొద్ది మార్పులతో కొన్ని విగ్రహములకు అనగా చెప్పబడిన దానికి గాక యితరములకు ఉపయోగించుట చూడవచ్చును. ఇది సాంప్రదాయిక శిల్పకళారహస్యము. దీనిని రూపవంతముగా జూచి ఆచరించుట శిల్పాచార్య ధర్మము. ఈ శరీర కల్పనలో అతిమానుష శిల్ప సౌందర్యమిమిడి యున్నది. ఈ కొలతలు యీ నాటి మానవులకు అంగసౌష్ఠవమునకు సంబంధించినవి గావు. ఒకానొక ప్రమాణము ననుసరించి అంగప్రత్యంగముల విలువలు రూపములు వర్ణించబడినవి. దీనిలో వివిధ అవయవములు, వాని అంతరములు చక్కగా చెప్పబడినవి. ఈ రకముగా విగ్రహముల శరీరము చేయుటతో బాటు మానవుని శిల్ప విధానము యిక్కడ అనుసంబంధింప దగిన విషయం. ఈ శిల్పాలన్నిటికి ఆ జగదీశ్వరుని శిల్పమే గదా మూలం! దాన్ని విశ్లేషించి మానవుడు దేవుడ్ని అతని రహస్యాన్ని కనుక్కోగలిగాడు.

---

## సందర్భ గ్రంథాలు


1. కాశ్యపశిల్పశాస్త్రము : జి. జ్ఞానానంద (కన్నడ)
2. కాశ్యప శిల్ప శాస్త్రము : పెదపాటినాగేశ్వరరావు
3. సకలాధి కారము : పెదపాటి నాగేశ్వరరావు
4. శిల్ప చ్చెన్నూల్ : డా॥ వై. గణపతిస్థపతి

# అధ్యాయం : 12

## వస్త్రము

12.1 మానవుడికి శీతావాతాతపముల నుండి రక్షణకు- సిగ్గును చూపడానికీ వస్త్రం ప్రధాన పాత్ర వహిస్తుంది. అలంకారంగా మరో పాత్ర వహిస్తుంది. పుట్టినప్పుడందరూ వస్త్ర రహితులే! అలాగే చనిపోయిన తర్వాత గూడా వస్త్ర రహితులే! ఎటొచ్చీ మధ్యలోనే గా వస్త్ర ధారణ అంటాడు మన వేమన! ఎవరేమన్నా వస్త్రం లేనివాడు లేడు. అది అతని స్థితికీ - అభిరుచికి - అలంకారానికీ దర్పణం పడుతుంది. ప్రజలు ఆదిమ సమాజంలో ఆకులు ధరించారనీ తాపసులు నారలు ధరించారనీ మనం ప్రాచీన గ్రంథాల్లో చదువుతాం! అరణ్య వాసం చేసే కోయలు గోండులు మొదలైన వాళ్లు కూడా యిప్పుడు వస్త్ర ధారణకు అలవాటు పడిపోయి ఆధునిక జీవన మార్గంలోకి వచ్చేశారు. ముందు కాశీఖండములో చెప్పినట్లు వస్త్ర నిర్మాణ విద్యను భగవంతుడు విశ్వకర్మ కులస్థుల కిచ్చి ఆవిద్యనులోకములో ప్రచారము చేసినట్లు ఇతిహాసములును నుడువుచున్నవి. దానిని తరువాతి కాలములో భృగువు - మార్కండేయుడు మొదలగు ఋషులు ప్రచారము చేసినట్లు యితిహాసములన్నవి. కాని కాలాంతరమున కువింద - శాలీయ కులస్థులు తమ కులవృత్తిగా నేతను గ్రహించినట్లు తెలియుచున్నది. ఏమైనను వస్త్ర నిర్మాణము శిల్పము యొక్క అవాంతర నిర్మాణముగా మొదటి నుండియు మనకు తెలియుచున్నది. కార్పిసము నుండి తంతువు లను లాగి వాని ఆధారముగవస్త్రమును నిర్మించుటయను కర్మ భారతదేశములో చాలా ప్రాచీన కాలము నుండీ వస్తున్నట్లు చరిత్ర వల్ల తెలుస్తుంది. వేదకాలానికి ముందే ఉన్న హరప్పా మొహెంజొదారో సంస్కృతిలో కూడా వస్త్రాలున్నట్లు తెలుస్తుంది. ఢక్కామజ్లీస్ అను నేత వారు చేసిన వస్త్రాల్ని అగ్గిపెట్టెలో మడిచి పెట్టేవారనితెలుస్తుంది. అయితేయిది ఇంగ్లీషు

వారు మన దేశంలో అడుగు పెట్టిననాటి స్థితి. అంతకు ముందు దీనికతిశయించిన వస్త్ర సౌందర్యం మన దేశంలో ఉన్నట్లు తెలుస్తుంది. పాలకురికి సోమనాథుడు తన గ్రంథంలో ఎన్నో రకాల వస్త్రాల్ని పేర్కొన్నాడు.

12.2 వెంజాళియు, జయరంజియు, మంచు

పుంజంబు, మణిపట్టు, భూతిలకంబు,

శ్రీవన్నియము, మహాచీని, చీనియును,

భావజ తిలకంబు, పచ్చని పట్టు

రాయశేఖరమును, రాయవల్లభము

వాయు మేఘము, గజవాళంబు, గండ

వడము, గావులు, సరిపట్టును, హంస

పడియు, వీణావళి, పల్లడదట్టి

వారణాసియు, జీకువాయి, కెందొగరు,

గౌరినయమును, క్షీరోదకంబు

పట్టును, రత్నంబు పట్టును, సంకు

పట్టును, మరకతపట్టు, పొంబట్టు

నెరపట్టు, వెలికిపట్టు, నేత్రంబుపట్టు

మరి తవరాజంబు మాందోళరవియు

12.03 పురుషుల వేషధారణ సామాన్యముగనేఉన్నట్లు తోస్తుంది. వేడి దేశం గనక మగవారు ఎక్కువ వస్త్రధారణకు ప్రాముఖ్యం యివ్వలేదని తోస్తుంది. అలాగే జన సామాన్యంలో ఎక్కువ మంది పురుషులు పనిపాటలతో గడపవలసినవారు గనుక సామాన్యంగా ఒక ధోవతి - ఒక అంగవస్త్రంతో సరిపోయేది. రాజపురుషులు - ఉద్యోగస్థులకు దప్ప వస్త్రసౌందర్య పోషణ

సామాన్యులకు అవసరమనిపించదు. ఆనాటి వ్యవహారాన్ని బట్టి పచ్చడం అనే విలువైన పై వస్త్రాన్ని పై జాతుల వారు ధరిస్తూ ఉన్నట్లు తెలుస్తుంది.

**"పచ్చడం బమ్మకున్నాడు పణములకును" క్రీడాభిరామం**

12.04 ఇక స్త్రీలకు మాత్రం చీరేరవికలు సొమ్ములు తప్పనిసరి. ఉన్నవారు బంగారు సొమ్ములు మామూలు వారు కనీస వెండిసొమ్ముల నైన ధరిస్తూ ఉండిరని తెలుస్తుంది. ఒక స్త్రీని వర్ణిస్తూ

మట్టి యలుజ్జ్యల మణినూపురంబుల

మొలనూలు వస్త్రముల్ ముత్తియములు

కన్న వడంబులు గట్టినూళ్లను సుద్ద

సరితీగె మినుకులు దండ

అంగుళీయములు హారకంకణములు

చేకట్టు పాలెలు చెన్ను మెఱగు

టాకులు సరిపెణ లాలక్తకము పూత

కాటుల తిలకంబుకమ్మపువ్వు

లాదిగా గల మేలిద్రవ్యముల నొప్పు

పసదనము చేసి యుచిత రూపంబు దాల్చి

బాలచంద్రిక బోటైనపజ్జ కరిగి

దారు వర్మని లోగిలి దరియజొచ్చి (అం. సా. చ. పు. 96)

అలాగే శ్రీనాథుని పద్యంలో

కుల్లాయుంచితి కోక సుట్టితి మహా

కూర్పాసముందొడ్గితిన్ - అన్నప్పుడు కుళ్లాయి తలపాగాకోక సుట్టుట - ఇప్పటి లుంగీపంచె. మహాకూర్పాసము ఇప్పటి పొడవు కోటువంటివి

ఆకాలపు వస్త్రవిశేషములుగా చెప్పుకోవచ్చును.

12.05 వస్త్రములు నేయుటకుసాలీలు అనుతెగ ఉండగా వస్త్రములు కుట్టుటకు దర్జీలు అను మరియొక బయలు దేరినట్లు తరువాతి కాలములో గాని తెలియదు. కొంతకాలము జంగాలు యీ కుట్టు పనిచేస్తున్నట్లు తెలుస్తుంది. వస్త్రధారణలో వివిధ కులముల వారు రకరకములుగా నిర్వహించిన విధానములు శ్రీనాథుడుమొదలైన పూర్వ కవుల పద్యములలో కనిపించుచున్నవి. బొందిలీలనే ఉత్తర దేశపు వారు తెలుగు దేశములోనిలిచి పోయిన వారు. స్త్రీలు బంగారు నేత చీరెలు. కుసుమంబద్దిన కొంగుల చందురు కావి రవికెలు - యమునార్వైకలు - గాగరాలు ధరించిరట. శిల్ప శాస్త్రంలో వస్త్ర విన్యాసంగూర్చి వివరించునప్పుడుపంచె, పట్టుపంచె, చర్మమున్న పంచె - చిత్రవర్ణపు పంచె అనే రకాలు చెప్పారు. పంచెను పురుష విగ్రహాల కన్నిటికీ నియంతగాచూపించేదే! పట్టుపంచెను మంచి కుచ్చీళ్లతో చీలమండల దాకా చూపించవచ్చు. చర్మముతోగూడిన పంచె కట్టు శంకరునికి చూపించాలి. వ్యాఘ్రచర్మం - గజ చర్మం ఇత్యాదులు అలాగేమహార్షులకు కృష్ణాజినాన్నిఉత్తరీయంగానో పంచెమీద కట్టుకొన్నట్లుగానో చూపించాలి. ఇక చిత్రవర్ణ వస్త్రం విశేష సమయాల్లో అలంకారానికి దేవీదేవతలకు చూపించమన్నారు. అలాగేవిగ్రహాలకు చూపించేటప్పుడు పంచెను మామూలుగా చూపించినా ప్రక్కలో - శరీరానికి రెండువైపులా వ్రేలాడేలా చూపించమన్నారు.

12.06 చర్మోత్తరీయం లేక చర్మ పరిధానం మాత్రం చాలాపరిమితంగా ఉంటుంది. అది మొలపై నుండి తొడల వరకే ఉంటుంది. ఇది గాక కౌపీన మాత్రంగాకూడా వస్త్రాన్ని ధరింప జేయడం ఉంది. అప్పుడు గూడా శరీరం పై వస్త్రం చాలా పరిమితంగానే ఉంటుంది. స్త్రీ విగ్రహాలకు స్తనాల మీదుగా ఒక వస్త్రం పేలిక కట్టినట్లుఅలంకరించడమనేది ఉంటుంది. కంచుకం అనేది ప్రాచీన శిల్పాల్లో లేదు. పురుషులకు ఉత్తరీయం - పల్లెవాటు - అంగవస్త్రం - ఇత్యాదులున్నాయి. రాజపురుషులకు మాత్రమే

కంచుకం చూపించడం ఉండేది. తలపై కిరీటాలు లేని రాజ పురుషులకు తలపాగాలు నియతంగా చెప్పారు. ప్రాచీన కాలంనుండీ పురుషులకందరికీ తలపాగాలున్నట్లు ఆయా ప్రాచీన గ్రంథాల్లోని వ్రాతలనుబట్టిత్రవ్వకాల్లో లభించిన శిల్పశకలా బట్టి నిర్ణయించవచ్చు. మానసారం అనే శిల్ప శాస్త్రంలో ఉష్ణీషధారణ విశేషాలు వివరింపబడి ఉన్నాయి. అందులో రాజ పురుషులకు కిరీటాలు,తక్కినవారికీ తలపాగా లుండేవని చెప్పింది. తలపాగాలు కూడా వింతలు విశేషాలతో ఉండేవి. కొన్ని కొరసుగాగాకొన్ని నిడివిగాను కొన్ని గుండ్రంగాను కొన్నివంపుగానూ ఉండేవి. వాటిపై రంగురంగుల వర్ణాలతో అలంకారాలుండేవి. తురాయిలు ఉండేవి. అలాగేయీ తలపాగాలపై బంగారు గొలుసులుముత్యాల సరాలూ వ్రేలాడ దీసేవారు. అవి గూడా వంకర వంకరగానూ పట్టీలుగాను మరికొన్ని అలంకార విశేషా లతోనూ ఉండినట్లుమనకుప్రాచీనగ్రంథాలు ఆధారంగా తెలుస్తుంది. మహారాష్ట్రులు పంజాబు దేశీయులు రాజస్థానీయులు నేటికీ రంగురంగులతలపాగాలుధరించడంచూస్తున్నాం.

12.07 వస్త్రానికున్న మరో ఆకర్షణ దానిఅంచు. ఈ అంచుల విశేషాల్ని గురించి శిల్ప శాస్త్రాలలో చాలా వర్ణనలున్నాయి. అందులోంచి కొన్నిటినియిక్కడ చూద్దాం.

1. మంటల్లాగా ఎగురుతుండే అంచులు
2. గుర్రపుతోక లాంటి (డిజైనులు గల) అంచులు
3. హంస తోక లాంటివి
4. కోడి పుంజు తోకలాంటివి
5. మధ్యలో బొమ్మతో ఉండేవి
6. లతల రూపం (డిజైనులు)గల అంచులు
7. సాదా గీతలు
8. గుండ్రని డిజైనులు
9. పూవుల డిజైనులు

12.08 ఈ రూపాల్ని కేవలం అద్దకం ద్వారాగాని లేక జరీలోగా తీసుకొనివచ్చే విధాలున్నాయి. ఎక్కువ ఖరీదైన వస్త్రాలకుబంగారుజరీతో / వెండిజరీతో నేసేవి అంచులున్నాయి. అవన్నీ శిల్పవిశేషాలే. ఈ యుగంలో కూడా యీ జరీ విశేషాలు స్త్రీల వస్త్రాలకు విశేష కర్షణతో ఉంటూ వేలాది రూపాయలు విలువ చేస్తున్నాయి.

12.09 ఆంధ్రప్రదేశంలో లేపాక్షి, హంసల, డిజైనులతో తయారయ్యే విలువైన చీరెలు చాలా ప్రసిద్ధి పొందాయి. పోచంపల్లి, గద్వాల, ధర్మవరం, పొందూరు, గుంటూరు మొదలైన ఊరిపేర్లతో ఈ చీరెలువిలువైన జరీ అంచులతో తయారై జగత్ప్రసిద్ధి పొందాయి. ఇవి గాక కాంచీపురం - మధురై - బనారస్ పట్టుచీరెలు - సరేసరి జగ్రత్ప్రసిద్ధాలే ! ఇలా వస్త్ర శిల్పం ప్రాచీనకాలం నుండీ నేటి దాకా భారతీయులకు ఆప్యాయకరమైంది.

---

## సందర్భ గ్రంథాలు

1. బసవ పురాణం - పాలకురికి సోమనాథుడు
2. పండితారాధ్య చరిత్రము - పాలకురికి సోమనాథుడు
3. క్రీడాభిరామము - శ్రీనాథుడు
4. చాటు పద్యములు - శ్రీనాథుడు
5. శిల్పచ్చెన్నూలు (తమిళం) డా॥ వై గణపతిస్థపతి

# అధ్యాయం 13

## గుడి

13.1 గుడి ఒక సామాజిక శిల్పం. ఇందులో అందరికీ పనికి వచ్చే దేవుడుంటాడు. కానిదేవుని స్థానం మానివుని హృదయంలో ఉంటుందని శాస్త్రం చెబుతుంది.

ఈశ్వర : సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి (గీత)

భ్రామయన్సర్వ భూతాని యంత్రారూఢాని మాయయా!!!

13.2 దేవుడే మనుష్యుని హృదయంలో ఉండి అతడ్ని అన్నివైపులకు తిప్పుతాడు. అలా తిరిగి తిరిగి వెతికి వెతికి చివరికి తనలోనే దైవాన్ని చూడగలుగుతాడు. ఈలోగా అతనకి ప్రపంచంలో భగవంతుడ్ని చూపించడానికి ఉపయోగపడేది దేవాలయం. మనం అక్షరాలునేర్చుకోడానికి పాఠశాల ఎలాగో దేవుడ్ని గూర్చి తెలుసుకోవడానికి గుడి అలాగా!

13.03 అన్ని దేశాల్లో అన్ని కాలాల్లో మానవుడు దేవుడ్ని చూడాలనీ అతని నుండి తన కోర్కెలు తీర్చుకోవాలని ఎన్నో రకాల పూజలు పురస్కారాలు, భజనలు, కీర్తనలు, యజ్ఞాలు, యాగాలు, దానాలు సంతర్పణలు జరుపుతూనే ఉన్నాడు. జరుపుతాడు గూడా! ఈ విషయం అనంతకాలానికి - అనంత సత్యానికి మానవుడికీ ఉన్న సంబంధానికి చెందింది. అందువల్ల ఇదే చివరి విషయం అని ఎవరూ నిర్ధారించడానికి వీలులేని విషయగాంభీర్యం గల వ్యవహారమని వేరే చెప్పనవసరం లేదు.

13.04 అందువల్ల దానిలోతులు అనబడే ఆధ్యాత్మికపు ప్రపంచంలోకి గాక భౌతిక ప్రపంచం దృష్టి కోణంతో ఈ గుడి అనే విషయాన్ని చర్చించడానికి పూనుకొందాం!

మానవ నివాసం యిల్లైతే దేవుని నివాసం గుడి

మానవ నివాసం యిల్లు చదరంగా ఉంటేదేవుని నివాసం గుండ్రం

గుండు - గుండ్రాయి - గుడి - ఇవన్నీ గుండ్రంగా ఉండేవి! ఇలా బయలు దేరిందే గుడీ - గుడిలోని లింగమూ - ఇత్యాదులూ అని కొందరి భావన

13.05 పూర్ణమద: పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణ మిద ముచ్యతే

పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే

అంతా పూర్ణమే పూజ్యమే అని తెలిపేది గుండ్రినిసున్నా. ఈ సున్నారూపమే ప్రపంచమూ భూమి ఆకాశము దేవుడూ దేవుడి నివాసమునుఅని కొందరి వివరణ

13.06 ఆదిమానవుడు అశనవసనాల వేటనుండి బైటపడి కొంతసేపుతనచుట్టూ ఉన్న వేడి, చలి, గాలి, నీరు, మంట మొదలైన వాటిలోఅతీతమైన శక్తిని చూసి విస్మితుడై దేవుడే తనకీ సహాయం చేస్తున్నాడని భావించాడు. అలా తాను చూస్తున్న ప్రకృతిశక్తులే భగవంతుడని నమ్మి వాటినే కొలవడం ప్రారంభించాడు. అలా ప్రారంభమైన ఆరాధన క్రమంగా ఒక చోట కేంద్రీకరింపజూపిన ప్రయత్నంఈ దేవళం ఒకటి.

13.07 మానవుడుతన నివాసం లాగానేదేవుడి నివాసాన్ని గూడా కేవలం కొన్నిరాళ్లు పేర్చి ఏర్పరిచాడు. క్రమక్రమంగా దేవతారాధన.

చెట్టుక్రింద

చెట్టు తొఱ్ఱలో

చెట్టు మొదటి దిమ్మ మీద సాగిస్తూవచ్చారు.

1. ఆరుబైట అరుగుమీాద
2. పందిరి క్రింద
3. నాలుగు గోడల మధ్య
4. నాలుగుస్తంభాల మధ్య

5. పందిరి క్రింద

6. గుడారంలో - ఆరాధించడం మొదలెట్టాడు

అలాగాకపోతే

1. కొండచరియల్లో

2. కొండకొమ్మున

3. కొండ గుహలో

4. కొండల మధ్య గూడా

13.08 ఆరాధనా స్థానాలు నెలకొల్పి కొలవడంమొదలెట్టారు. జనసమ్మర్థం పెరిగి జనస్థానాల్లో కూడా దేవాలయాల అవసరం వచ్చింది. దానికి కూడా సన్నద్ధమయ్యాడు. వీలైనన్ని ఎక్కువ చోట్ల దేవుడ్ని పెట్టి పూజింపజొచ్చాడు. దీన్ని శాస్త్రం. ఎలా వివరించిందో చూడండి!

13.09 తీర్థాంతే తటినీతటే జలనిధేస్తీరేసరిత్సంగమే

శైలాగ్రేద్రి తటే వనోపవన యోరుద్యానదేశే తథా

సిద్ధాద్యాయత నేషువా గురువరోర్గ్రామే పురేపత్తనే

వాన్యత్రాపి మనోరమే సురసమిజ్యాయైక్షితింకల్పయేత్ - శిల్పరత్నం(9-1)

తీర్థాంతే= తీర్థముల దగ్గర - పుణ్యతీర్థములనదగిన 'పుష్కరాది' హ్రదముల ప్రక్కన వెలసినదేవాలయములు

తటినీతటే - చిన్న నదుల ప్రక్కన

కావేరి మొదలైన నదుల ప్రక్కన గల కుంభకోణాది క్షేత్రములు వెలిసినట్లు,

జలనిధేస్తీరే - సముద్ర తీరమున పళని రామేశ్వరము - కన్యాకుమారి మొదలైన క్షేత్రములవలె

సరిత్సంగమే - నదీసంగమస్థానములందు. ప్రయాగ రాజమున వారణాసిలో

శైలాగ్రే - పర్వముల చివరలందు తిరుపతి శ్రీశైలము వేదాద్రి విజయవాడ

ఇత్యాదులందు

అద్రితటే - పర్వత సానువులయందు, సింహాచలంయాదగిరి గుట్ట ఇత్యాదిస్థలములందువలె

వన - వనములందు, నైమిశారణ్యము ఇత్యాదులయందు,

ఉపవనయో : చిన్నవనములందు

ఉద్యానదేశే - మహానంది త్రిపురాంత కాదులందువలె

తథా - మరియు

సిద్ధ + ఆది + ఆయతనేషువా : సిద్ధుల ఆశ్రమములందు

సాందీపని ఆశ్రమమున్న ఉజ్జయినీ మొదలైన క్షేత్రములందువలె.

గురువరోర్గ్రామే - గురుపీఠములు గల కాంచీ మొదలైన నగరములు / గ్రామములందు.

పురే - పురములందు.

కాంచీపురము - మధురాపురము - ఇత్యాదులందు

పత్తనే - పట్టణములందును.

మనోరమే - అందమైన చోట్ల.

సురసమిజ్యాయై = దేవపూజ యను యజ్ఞము, దేవాలయ నిర్మాణము కొఱకు

క్షితిం కల్పయేత్ = స్థలమును నిర్ణయింపవలెను.

ఇలా అన్ని రకాలైన ప్రదేశాల్లో దేవుడ్ని నిలిపి పూజింపవచ్చునని శాస్త్రకర్తలు నిర్ధేశించారు. కనుక ప్రజలు ప్రతి వీధినా పూజించే స్థితికి గూడా వచ్చారు. ప్రజలూ పాలకులూ ఆదరించడంతో దేవాలయ నిర్మాణం చాలా విపరీతంగా పెరిగింది దక్షిణదేశంలో

13.10 యావత్ భారత దేశంలోనూ దేవాలయార్చన తక్కిన అర్చనలకన్నా సులభమూ సుందరమూ సామూహికమూ వైయక్తికమూ ఫలదమూ అని సామాన్యులు నమ్మి

ఆదరించారు. అందువల్ల యావద్ భారత దేశంలోనూ దేవాలయాల నిర్మాణం అపరిమితంగా పెరిగింది. ఉత్తర దేశం మధ్య దేశం తూర్పు ప్రాంతం దక్షిణప్రాంతాల్లో యీ నిర్మాణాలు అనంతంగా పెరిగాయి.

13.11 ఉత్తర దేశపు దేవాలయాలకునాలుగు పలకల నాగర శిఖరాలు

13.12 మధ్య దేశపుదేవాలయాలకు వేసర శిఖరాలూ

13.13 దక్షిణదేశపు దేవాలయాలకు ద్రావిడశిఖరాలూ

13.14 అందంగా అమర్చబడి మనోహర శిల్పాలతో కనుల పండువు చేస్తుంటాయి.

తక్కిన ప్రాంతాల కన్న దక్షిణ ప్రాంత దేవాలయాలకు ప్రాకారం - దానికి నాలుగువైపులా అంబరచుంబిత శిఖరాలు - వాని నానుకొని పుష్కరిణులు - ఆ ప్రక్కన పెద్ద పెద్ద రథాలు ఎంతో సౌందర్య శోభలు వెదజల్లు దివ్య దృశ్యాలు గలవిగా యాత్రికులకు హృదయాహ్లాదం కలిగిస్తున్నాయి.

1. ఉపపీఠం, 2. అధిష్ఠానం, 3. స్తంభం, 4. ప్రస్తరం, 5. వేదిక, 6. శిఖరం, 7. స్తూపి, అనే అంగాలతో తలదృశ్యం

1. ద్వారం, 2. గోపురం, 3. ప్రాకారం, 4. బలిపీఠం, 5. ధ్వజస్తంభం, 6. నందిమండపం / గరుడమండపం, 8. ముఖమండపం, 9. అంతరాళం, 10. గర్భాలయం, అనే విభాగాలు ముఖ్యం.

13.15 గర్భాలయంలో బ్రహ్మస్థానంలో శివలింగం ఉంటుంది.

అదే విష్ణ్వాలయం అయితే గర్భాలయం వెనుక గోడనానుకొని విష్ణువు ఉంటాడు. అటూ యిటూ శ్రీదేవి విగ్రహాలూ ఉంటాయి.

నంది మండపంలో నందీ గరుడమండపంలో గరుత్మంతుని ఉంచుతారు.

శ్రీశైలం శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతేఅనీ

గోపుర శిఖరాలూ విమాన శిఖరాలూ దర్శించినా చాలుముక్తి నిస్తాయి. అని లోకోక్తులున్నాయి. దీనికి ఆధారంశిల్ప శాస్త్రాల్లో "ప్రాసాదం పురుషం మత్వా అర్చయేత్"

ప్రాసాదం యచ్ఛివశక్త్యాత్మకం

తచ్ఛక్త్యంతై : స్యాద్వసుధాద్యైస్తు తత్త్వై:

శైవీ ముక్తి ః ఖలు దేవాలయాజ్యే త్మ స్మాద్

ధ్యేయా ప్రథమం చాభి పూజ్యా। ఈశానశివగురుదేవ పద్ధతి - 3 భాగ.

మానం ధామ్నస్తు సంపూర్ణం జగత్సం పూర్ణతాభవేత్ / మయమతం

ఇలా గొప్పగా చెప్పబడి నిర్మింపబడిన దేవాలయాన్ని సర్వ దేవతాస్వరూపంగాభావించి పూజించమన్నారు. శిల్ప శాస్త్ర ఆగమశాస్త్ర విద్వాంసులు.

మయ మత శిల్ప శాస్త్రంలో

దేవాలయ పర్యాయపదాలుగాయీ పేర్ల నివ్వడం జరిగింది.

13.16 1. విమానం, 2. భవనం, 3. హర్మ్యం, 4. సౌధం, 5. ధామం, 6. నికేతనం, 7. ప్రాసాదం, 8. సదనం, 9. సద్మం, 10. గేహం, 11. ఆవాసకం, 12. గృహం, 13. ఆలయం, 14. నిలయం, 15. వాసం, 16. ఆస్పదం, 17. వాస్తు, 18. వాస్తుక, 19. క్షేత్ర,20. ఆయతనం, 21. వేశ్మ, 23. మందిరం, 24. ధిష్ణ్యం, 25. లయం, 26. క్షయం, 27. ఆగారం, 28. ఉద్వసీతం, 29. స్థానం, ఇవిగాక సమరాంగణ సూత్ర ధారంలో మరొకొన్ని ఇవ్వబడ్డాయి. 30. సమాశ్రయం, 31. విధానం, 32. నీడం, 33. శరణం, 34. ఓకః 35. ప్రతిశ్రయం

13.17 ఇవి గాక వివిధ మండపాలు

గోపురాలు, తటాకాలు, ఉద్యానవనాలు, ఆరామాలు, విద్యాస్థానాలు, వేదపాఠశాలలు, గ్రంథాలయాలు సరస్వతీ స్థానాలు, వంటశాలలు, రంగమంటపాలు, నాట్య మండపాదులు.

13.18 దేవాలయానికి అంగరంగభోగాలు కల్పిస్తూ ఒక పెద్ద నాయకులుతలవంచి యీ నిర్మాణాలు కల్పించి కీర్తివంతులైనారు. ఈ నిర్మాణాలు బహిరంగ దృశ్యాలు రమ్యంగా ఉండడానికి అలంకరించారు. అనేక చిత్రాలతో

భూషింపజేశారు. ఈ చిత్రాలు కేవలంరేఖామాత్రాలు గాక వివిధ వర్ణాలతో అలంకరించారు. ఆ చిత్ర విచిత్ర కల్పనలకు తోడు అద్దాల మండపాలు, అందులో అద్దాలపై వివిధ దేవతా చిత్రాలుక్రొత్తశైలీ ప్రతిపాదకాలైనాయి. ఇంతవరకు దేవాలయాల్లో మనం ఇటుకలు, సున్నం - సిమెంటు రాయి అనే పదార్థాలతో చేసిన విగ్రహాది నిర్మాణాలను చూడగలిగాయి. ఇవిగాక గర్భాలయంలో ఉండే ఉత్సవ విగ్రహాలు అలంకార విగ్రహాలు - పంచలోహ విగ్రహాలు వివిధ భంగిమల్లో ఆహ్లాదం కలిగిస్తాయి. బంగారు వెండి రాగి ఇత్తడి పంచలోహాల్లో చేసిన వివిధ ఆభరణాలూ అలంకారాలూ పూజా సామానులూ మనకు నేత్రోత్సవం కలిగిస్తుంటాయి. నవరత్నాలు స్ఫటికాలు రుద్రాక్షలూ తామర పూసలు తులసి పూసలు సాలగ్రామ శిలలు అనే వాటికి తోడు పరిమళాలు వెదజల్లె మొల్లలు పొన్నలు తుళసి అగరు చందన కర్పూర - ఉశీరాలు దివ్యపరిమళం ఈను తుంటాయి. గర్భాలయంలో నేతి దీపాలు మోస్తూ ఉండే దీపకన్యలు వ్రేలాడేదీపహంసలు, నేత్రానంద కరాలు. వింజామరలు విసరుతూ చామర సేవలో ఉన్న పూజారుల విగ్రహాలూ దర్శనీయాలే శరీరం నిండా ద్వాదశోర్ధ్వ పుండ్రాలు / తిర్య క్పుండ్రాలు ధరించిశిఖాయజ్ఞోపవీత ధారులై కుంచెకోల/అధికారదండం/ వేత్రతోత్ర పాత్రములతో దర్శనమిచ్చె అయ్యలు జియ్యలు ఈ దేవాలయ విగ్రహాలకు వాహనాలకూ, సైదోడులు.

---

## సందర్భ గ్రంథాలు

1. ఆగమశిల్ప శాస్త్ర పరిచయము - డా॥ పెదపాటినాగేశ్వరరావు
2. కాశ్యప శిల్ప శాస్త్రము - డా॥ పెదపాటి నాగేశ్వరరావు
3. తెలుగు విజ్ఞాన సర్వస్వము - 14వ సంపుటము
4. హిందూటెంపుల్ - స్టెల్లా క్రంరిష్
5. ఇండియన్ టెంపుల్ ఆర్క్ టెక్చర్ - మధుసూదన్ ఢాకి

# అధ్యాయం 14

## వాహనం

14.01 వాహనాలు దేవాలయాల్లో ఉండేఒక ముఖ్య శిల్ప సంపద. నిజానికి ఇవి నిలువెత్తు విగ్రహాలు. వీటిని భుజాలపై మోయాల్సి ఉందిగాబట్టి వీలైనంత బరువుతక్కువ పదార్థాలతో తయారు చేయడం కద్దు. జీనిగబెండు, కొద్ది కట్టె పేడ - మొదలైన పదార్థాలతో మాత్రమే వాహన విగ్రహం యొక్క శరీరాన్ని తయారు చేసి దానిపై తెల్లని వస్త్రాన్ని అతికించిఎండినతర్వాత దానిమీద తెల్ల మట్టిపూసి ఆపై వార్నీషు రంగులు పూసేవారు. ఈ శిల్పాన్ని 'జీనిగ'తెగ వారు చేస్తుండేవారు. ఐతే ఇది ఆంధ్రప్రదేశంలో మాత్రమే! దక్షిణ దేశంలో మాత్రం దేవాలయ శిల్పులేచేసేవారు. క్రమంగా యీ జీనిగ శాఖ ఇప్పుడు క్షీణించి నామమాత్రంగానేఉంది. అలాగే ఎక్కువ దేవాలయాల్లో ఇత్తడి-రాగి-రేకుతో తయారు చేసిన వాహనాల్నే వాడుతున్నారు. అవి శాశ్వతంగా ఉంటాయి. గాబట్టి అలాగేమోయడానికీ, కట్టుకట్టడానికీ అనువుగా ఉంటాయి గాబట్టి. పెద్దపెద్ద దేవాలయాల్లో వెండితోనూ ఆమీద బంగారు మలాము వేసిన వాహనాలు కూడా ఉన్నాయి. అవన్నీ విత్తం కొద్దీ పెరిగేసేవలు. అసలు శిల్పం, ప్రాథమికమూ ప్రాధాన్యమూ ఐనది ఒకటే ఆయా దేవతల ఊరేగింపుకు తగిన వాహనాల్నిసమకూర్చడం, ఊరేగింపులో వాహనసేవఅత్యంత ప్రధానమైనది.

14.02 వైష్ణవాలయాలలో

1. గరుడవాహనం, 2. హనుమంత వాహనం, 3. శేషవాహనం, 4. గజవాహనం, 5. హంసవాహనం, 6. సూర్యప్రభ, 7. చంద్రప్రభ, 8. పొన్నవాహనం, 9. సర్వభూపాల వాహనం, 10. సింహవాహనం, 11. అశ్వవాహనం, 12. మకర వాహనం / కల్పవృక్షవాహనం,13. చలువచప్పరం /తిరిచి,14. పల్లకీ, 15. అడ్డపల్లకీ, 16. రథం అనేవాహనాలుంటాయి.

14.03 శివాలయాలలో

1. నంది వాహనం, 2. నరనంది వాహనం, 3. అధికారనంది వాహనం, 4. కైలాసవాహనం, రావణవాహనం, 6. గజవాహనం, 7. శేషవాహనం, 8. హంసవాహనం, 9. సింహవాహనం, 10. అశ్వవాహనం, 11. మయూరవాహనం / మూషిక వాహనం, 12. కల్పవృక్ష వాహనం, 13. సూర్యప్రభ, 14. చంద్రప్రభ, అడ్డపల్లకీ, 16. రథం, అనే వాహనాలుంటాయి. ఇవిగాక కొన్నిచోట్లవిశేషమైనవీ ఉంటవి.

14.04 వీనన్నిటిలో రథం ప్రత్యేకమైన వాహనం, ఇది దేవాలయానికి ప్రతిరూపమే. దేవాలయం కదలకుండా ఉంటేఇది నాలుగు చక్రాలపై కదులుతూ సేవలుగొంటుంది. రథాల్ని గురించి మన ఇతి హాసాల్లో చాలా ఐతిహ్యాలున్నాయి. కాని ఇప్పుడుదేవాలయాల్లో తప్ప వేరే రథాలంటూ ఎక్కడా ఉంపయోగించడం లేదు. దానికి కారణం ఇది చాలా పెద్దకట్టడంగా కదిలించడానికి ఎంతోమంది బలగం కావల్సి ఉండడం. దీన్ని కేవలం చెక్కతోనే చేస్తారు. అవసరమైతేపైనవెండీబంగారు తొడుగులువేయడంకద్దు.

రథ నిర్మాణంలో ముఖ్యమైనది దారువు. దానికి నాలుగు చక్రాలు - నియతంగా మధ్యలో ఐదో చక్రమూ బిగించి ఉంచుతారు. అవసరమైతే ఈ నాలుగులో ఏచక్రమైనా సరిగా పనిచేయకపోతే యీ ఐదో చక్రాన్ని ఉపయోగించేవారు. వేదిక చుట్టూ అనేక శిల్పాలు, శృంగార శిల్పాలు చెక్కేవారు.

దీని శరీరమంతా చెక్కతోనే తయారయ్యేది. వేదిక మీద64స్తంభాలు దాని మీద అంతస్తు లంతస్తులుగా శిఖరము చివరకు కలశమూ ఉంటుంది. స్తంభాల నానుకొని సింహాలూ అరటి బోదెలు / కొబ్బరి మట్టలు అలంకరిస్తారు. ముందు అశ్వాలు గజాలు ఉంటాయి. కాని అవి నామ మాత్రమే. జనులే రథాన్ని లాగుతారు.

14.05 రథం పూర్తిగా చెక్కతోనే తయారౌతుంది. దీన్నిబట్టే తరువాతికాలంలో రథకారులంటేవడ్రంగులని రూఢి ఏర్పడ్డది. కాని అశబ్దం గ్రంధాల్లో తప్ప

లోకంలో ఎక్కడా లేదు. వేదకాలంలో రథాల తయారీ చాలా భారీ ఎత్తున జరుగుతుండేదట. అందువల్ల ఆ కాలంలో రథకారులనే సమూహం ఉండడాన ఆశబ్దం వచ్చింది. తర్వాత మూలనపడ్డది. సిటీల్లో కరెంటు తీగెలు - టెలిఫోన్ తీగెల కారణంగా రథోత్సవాలు మానుకోవడంకూడా జరుగుతుంది. ఈ మధ్య హరేకృష్ణ శాఖ వాళ్లు రథోత్సవాల్ని నియంతగా న్యూయార్క్ - లండన్ మొదలైన నగరాల్లో చేస్తున్నందున దీనికి కొంత పునఃప్రచారం కలిగింది. రథ నిర్మాణాన్ని గూర్చి శిల్పశాస్త్రాల్లో ప్రత్యేక నియమనిబంధనలతో అధ్యాయాలున్నాయి. మానసారం శిల్ప రత్నం మొదలైన గ్రంథాల్లో వీటి వివరణ లున్నాయి. కాని కాల క్రమాన యిప్పుడుఏర్పడ్డ పరిస్థితులదృష్ట్యా వీటి రూపురేఖలుమారుతున్నాయి. సులభంగా లాగడానికి సేవలు నిర్వహించడానికి దీని శరీరం తగ్గించి కేవలం చలువ చప్పరంపద్ధతిలో బండిపై బిగించి రథ సేవలుజరుపుతున్నారు. తిరుమల లాంటిజనసమ్మర్ధం కలిగినదేవస్థానాల్లో తప్ప యితర దేవస్థానాల్లో లాగడానికిజనం కూడా తక్కువేఅవుతూన్నరు. అందువలన రథోత్సవం రానురాను లాంఛన ప్రాయమై పోతుంది.

---

## సందర్భ గ్రంథాలు

1. కాశ్యప శిల్ప శాస్త్రము : డా॥ పెదపాటి నాగేశ్వరరావు

2. శిల్పచ్చెన్నూలు : అనువాదండా॥ పెదపాటినాగేశ్వరరావు (శిల్పదర్శనం:టిటి.డి. ప్రచురణ

3. అగమ శిల్ప శాస్త్రపరిచయం : దో. భాస్కర మూర్తి మరియు నాగేశ్వరరావు

4 రథకారాధికరణమ్ - దంతనాల నాగేశ్వరశాస్త్రి

# అధ్యాయం 15

## ఆభరణం

16.01 శరీరానికి అందానిచ్చేవివస్త్రాలు ఆభరణాలూను. సువర్ణాభరణాలు ధరించడం వల్ల శరీరానికి కాంతీ సౌష్ఠవమూ కలుగుతాయని శాస్త్రాలు చెప్పాయి. అలాగేబంగారం శరీరానికి అంటి ఉన్నందున శరీరంలో రోగ నిరోధక శక్తి పెరుగుతుందనికూడా మన పెద్దలు చెప్పారు. ఇత్యాది కారణాలుగా మన సమాజంలో స్త్రీ పురుషులిద్దరూ ఆభరణాలపై మక్కువ పెంచుకోవడంజరిగింది. ఎక్కువ మంది ఆభరణాలనుబంగారంతో చేయించి ధరించే వారు.

16.02 కాలక్రమేన శిలలకు గిరాకీలేకపోయినందున అన్ని శాఖల శిల్పులూ బంగారంపనిలో దిగి తక్కిన వాటిని మరిచిపోయారు కూడా! దానికి దేశకాల పరిస్థితులే కారణం, అలాగే మన సమాజం సామాన్యుడు రోజుకు రెండు పూటలా తిండిదొరికితే చాలు తక్కినవేవి గమనించదగినపరిస్థితి యిప్పుడు లేదు. అనే స్థాయికి వచ్చాడు. దేశంలో ఉన్న సంప్రదాయ వ్యతిరేక దృష్టి గూడా తోడై సామాన్యుడు మన ప్రాచీనమైన కళల్నీ శిల్పాల్ని దూరంగానే ఉంచడం మొదలెట్టాడు. ఐతే అటువంటి వ్యతిరేక వాతావరణంలో కూడా బంగారంపని బ్రతుకగలిగింది. కారణందీనికి యింకా పార్శ్వ భూమికలుండబట్టి

16.03

1. ధనికులు తమ డబ్బును బంగారం రూపంలోనే దాచుకోవడం క్షేమమని తలస్తుండబట్టి
2. పరపతి సౌకర్యాలకు బంగారమే తక్షణ ఫలప్రదంగాబట్టి
3. నల్లధనం త్వరగా తెల్లధనంగా మారడానికియిది చాలా సులువైనమార్గంగా బట్టి

4. సామాన్యులకూ పరపతీ/బ్యాంకింగ్ సౌకర్యాలు బంగారం మీద జరిగినంత సులువుగా ఇతరాల మీద జరగవుగాబట్టి.

5. ఇతర ఆస్తుల కన్నా చేతులు మారడానికి ఇదిచాలా సులువైన మార్గంగాబట్టి

బంగారు పనివాని మీద. అతని శిల్పం మీద, ఏ మాత్రం గౌరవం లేక పోయినా, ఇతర పనుల కన్నా కూలినామమాత్రమే గనక యీ వృత్తి యింకా గ్రామసీమల్లో బ్రతికి వుంది. నగరాల్లో ఇది కేవలం పెద్ద పెద్ద షరాబులు. మార్వాడీలు, రాజకీయ ప్రాధాన్యం గల వర్గాలచేతుల్లో ఉంది. దీనిపై కేంద్ర ప్రభుత్వం ఎన్నో నిఘాలుచట్టాలు తెచ్చింది. కాని ప్రజల అవసరందృష్ట్యా అవన్నీనామమాత్రాలేఅయినాయి. వేలాది కిలోల బంగారంసేట్ మార్వాడీల చేతుల మీదుగారోజు దేశ విదేశాల్లో చెలామణి అవుతుంది.

16.05 అవన్నీ అలా ఉంచి ప్రతిహిందువూ సంస్కారాల్లో (హిరణ్యం) బంగారంవాడటానికి బాగాఅలవాటుపడ్డాడు. జన్మదిన సందర్భం, చౌలం, ఉపనయనం,వివాహం. ఇత్యాది సందర్భాలలో బంగారంవాడని కుటుంబమంటూ లేదు. ఎంత పేదవాడైనాఅప్పుజేసైనా ఈ మ్రొక్కుబడి చెల్లించుకోవాల్సే వస్తుంది. అది ఆపని మీద లేక బంగారం మీదమోజనికాదు. సామాజికమైన కట్టడీ అలా చేయిస్తుంది. ఒక స్త్రీ ముత్తైదువుగా జీవించాలం టే పుస్తెలు మెట్టెలు - గాజులు - పసుపు కుంకుమలు తప్పనిసరిగా వాడాలి. పురుషుడు చౌలం / ఉపనయనాలతో తప్పనిసరిగా స్వర్ణాభరణం వాడుతూనే ఉన్నాడు. చివరి ప్రయాణంలో కూడా నోట్లో పిసరంత బంగారం వాడటం కద్దు. అందువల్ల ఆభరణమన్నది మానవుడికీఒక తప్పనిసరి ధారణ.

16.06 పురుషులూ స్త్రీలు పూర్వం ఆభరణాలు సమానంగానే ధరించేవారు. కాకపోతే రానురాను ఆర్థికపరమైన వత్తిడులవల్ల పురుషుడుతన ఆభరణాలు తగ్గించుకొని వేషానికి ప్రాధాన్య మిచ్చి స్త్రీలకు మాత్రం ఆభరణం ప్రధానం చేశాడు. అందువల్ల యిప్పుడూభరణాలంటేస్త్రీలు ధరించే ఆభరణాలకే ప్రాధాన్యం కలిగింది. ఆభరణ నిర్మాణం లోకూడా స్త్రీలకు పనివచ్చే

డిజైనులే ఎక్కువ ప్రాచుర్యం సంపాదించుకున్నాయి.

16.07 పురుషులు ధరించు సొమ్ములు

తలపాగాపై తురాయి

కంఠములోకంఠమాల హృదయమాల, ఉదరమాల, బాహుమాల, పులిగోరు పతకము, హనుమంత పతకము, రుద్రాక్షమాల కాక పొగడమాల, దండ కడియములు, ముంజేతి మురుగులు, సింహతలాటములు, నాగ కంకణములు, వీర సంకిలి, నడుముకు బిళ్ళల మొలత్రాడు, వెండి మొలత్రాడు, చేతి వ్రేళ్ళకు ఉంగరాలు, చెవులకు కుండలాలు,సింహకుండ లాలు, నాగకుండలాలు, పోగులు, రత్నాల దుద్దులు, కాలికి కడియము, గండపెండేరము, వీరకడియము.

## స్త్రీలుధరించు సొమ్ములు

16.08 తలపై పాపట బొట్టు, సూర్యుడు, చంద్రుడు, రాగిడీ, నాగరం, జెడబిళ్ళ, మల్లెమొగ్గలు (వెండివి), (నాట్యకత్తెలకు) నక్షత్రమాల బిళ్ళలు, జెడగంటలు, ముక్కునబేసరి ముత్యపు నత్తు, చెవులకుపద్మరాగపు కమ్మలు, తాటంకాలు, కుండలాలు, చెంపసరాలు, గుబాళీలు, చెవిపూలు, గంటీలు, లోలకులు, బుట్టలోలకులు, వైరతోడు /- వజ్రాలకమ్మలు, ముత్యాల కమ్మలు, నెమలికమ్మలు, హంస కమ్మలు, కంఠమున - మంగళ సూత్రము, ముత్యాల హారము, పగడాల హారము, శంఖుతావళము, కాసుల పేరు, కంటె,రవ్వల కంటె/రత్నాల కంటె, కాసుల కంటె, చంద్రహారం, నక్షత్రహారం, నల్లపూసల త్రాడు, కాసికాయ పూసల హారం, దాహువులకు దండకడియాలు, దండపట్టెలు, కేయూరాలు, కేయూరహారాలు, వంకీలు, రవ్వల వంకీలు, చేతులకు గాజులు, కంకణాలు, రత్నకంకణాలు, మురుగులు, పట్టెమురుగులు, రత్నాల మురుగులు, చేతి వ్రేళ్లకు రత్నాల ఉంగరాలు, రత్నాల ఉంగరాల్ని, కంకణాలకు కలిపే గొలుసులు, నడుమున ఒడ్డాణము, రత్నాల ఒడ్డాణము, హారాలు వ్రేలాడు ఒడ్డాణము.

కాలికి, కడియాలు, పట్టాలు, జల్తారు పట్టాలు, కాలివ్రేళ్లకు మట్టెలు, చుట్టులు, పిల్లేళ్లు అనే ఆభరణాలుసామాన్యం. ఇవి గాక కొన్ని ప్రాంతాలలో కొన్ని రకాలైన ఆభరణాలు ప్రత్యేకంగా ఉంటాయి. ఇందులోకొన్ని వెండితోను, కొన్ని రాగితోను చేయించుకోవడం కద్దు, నవరత్నాల హారాలుడంగరాలుధరించడం ప్రాచీన కాలంనుండీ వస్తూన్న ఆచారమే ఇలా వాటిని ధరించడం వల్ల కొన్ని అరిష్టాలుఅనా రోగ్యాలు, తొలుగుతాయని విశ్వాసం అందువల్ల జ్యోతిష్యాన్ను నుసరించి మరీ వీటినివాడడంకద్దు.

---

## సందర్భ గ్రంథాలు


1. ఆంధ్రులసాంఘిక చరిత్ర : సురవరం ప్రతాప రెడ్డి
2. తెలుగువిజ్ఞాన సర్వస్వము 14వ సంపుటము
3. స్వర్ణశిల్పము : కపిల వాయి లింగమూర్తి
4. విశ్వజ్యోతి : విశ్వకర్మ ఉద్యోగుల సంఘం రజతోత్సవ సంచిక -డా॥ పెదపాటినాగేశ్వరరావు
5. విశ్వశిల్పి : చిర్రావూరి నాగభూషణా చార్యులు
6. అరుణోదయ : జిల్లెళ్ల వీర బ్రహ్మాచార్యులు
7. పంచానన : సింహాద్రి నరసింహామూర్తి

# అధ్యాయం 16

## అలంకారం

17.01 అలంకారం అనేదిగృహాలంకారం వ్యక్తిగత అలంకారం దేవాలయం అలంకారంనివాస గ్రామ అలంకారం మొదలైన కోణాల నుండిచూచి వివరించవలసి ఉంది.

17.02 గృహాలంకార శిల్పం పాశ్చాత్య దేశాలలో పెరిగినంత భారత దేశంలో పెరగలేదు. ప్రాచీన సంప్రదాయాల్ని ప్రాతవిగాఇప్పటివారు దూరం చేసుకున్నారు. కాని ఆర్థిక కారణాల వల్ల అధునిక సజాయింపుకు ఆర్థిక కారణాల వల్ల సిద్ధం కాలేక పోతునా్రఉ.

17.03 వ్యక్తిగత అలంకారం విషయంలో స్త్రీలు పురుషులు వివిధ మార్గాలు అనుసరిస్తున్నారు. స్త్రీలు పసుపు కుంకుమలు ప్రధానంగా వాడుతున్నారు. స్నానపు సబ్బు, పౌడర్ మొదలైన ఆధునిక సౌకర్యాలు పెరిగాయి.

17.04 దేవాలయ అలంకారంలో పుష్పాలంకరణ ముఖ్యమైంది. పుత్ర పుష్పాలతో చేసే యీ కార్యక్రమం పెద్ద పెద్ద దేవాలయాల్లో జరుగుతుంది.

17.05 గ్రామంఅలంకారం ఏదో ప్రత్యేక సమయాలలో తప్ప నిత్య విధిగా భావింపబడడం లేదు. దీనికి కారణం జనంలోఉన్న ఆర్థిక వెనుకబడిన తనమే కారణం. పూర్వ కాలంలో పూర్ణ కుంభమెత్తుట చలువ పందిళ్లు వేయుట ముత్యాల ముగ్గులుచిత్రించుట మొదలగు కార్యక్రమములుండెడివి. ఇప్పుడవి లేవు గదా!

# అధ్యాయం 17

## శిల్పం వృత్తిగా : కమ్మరము

18.01 శిల్పంమానవుడికి అన్నం పెట్టింది. మెదడుకు పదును పెట్టింది. నీడ నిచ్చింది. శీతవాతావరణ రక్షణనిచ్చింది. దీని నీడన, మానవుడు పెరిగాడు. పెరిగిన కొద్దీ ఈ శిల్పం యొక్క ఉపయోగం కూడా పెరుగుతోంది. దీన్ని ఎలా తన నిత్యవ్యవహారానికి ఉపయోగించుకోవడం? అని యోచన చేశాడు. దాని ఫలితమే వృత్తి. వృత్తిగా ఆయా పరికరాల్నితయారు చేస్తూ ఉండడమే పని. కత్తులు కొడవళ్లు కర్రులు చేస్తూ ఉండడమే మంచి పని. దీంతోనే సమయంసరిపోతుంది. మరివేరే విషయమ్మై ఆలోచన చేయడమెందుకు? కావల్సిన తిండిబట్టా దానికి తోడునీడా దొరుకుతూండగా అనుకొన్నాడు. అలాకొంతమందిని ఆ పనిలో కుదిర్చాడు. ఇది వ్యవసాయానికి చాలా అదనైన పదనైనపనిగదా? కత్తి కొడవలి కర్రు ముల్లు సుత్తిశాణం అన్నీదీంతో తయారౌతాయి. కనక యీ వృత్తి ద్వారా ఎన్నో పరికరాల్ని గూడ తయారు చేసుకోవచ్చు గదా?

18.02 ఇనుము ఆవిష్కృతమైంది. గట్టిది పదనైనది అయిన లోహం (ఇనుము) ద్వారా పరికరాల్ని చేసే వివిధ వృత్తులకు సహాయకారిఅయ్యాడు. తక్కిన శిల్పాలుచేయడానికి సుత్తి, నాగలి, శాణం - కత్తెర మొదలైనవన్నీతయారు చేశాడు. దాంతో తాను చేసే పరికరాలు ఇల్లు వ్యవసాయం శిల్పం నేతపని కుమ్మరి పని, బేల్దారీ పని, మేదరి పని,మంగలి పని, చాకలిపని, తేలికల పని, మాల, మాదిగ ఇత్యాదులువృత్తులు సాగడానికి అవసరమైన పరికరాల తయారీ కారఖానా తనయింట నెలకొనడం తనకెంతో ఆనందమైనది. కేవలం భుజబలంపైనే ఆధారపడిరాతితోనే కొట్టి చీల్చి చెండాడుకొనే పరిస్థితి నుండి ఎంతో సులువైన పరిస్థితి ఏర్పడింది. ఇది ఎంతో నేర్పూఓర్పూ అని సమాజం ఆదరించింది కాని యీ కార్యక్రమం తయారయే సరికి సమాజం

ఎంతో ముందుకు వెళ్లింది. ఎటొచ్చి వెనకబడింది తానేనని తెలుసుకోలేకపోయాడీ శిల్పి.

18.03 శిల్పాలు తయారై సమాజానికి వివిధ పరికరాలకూ వృత్తులకూ, పనులకూ సరిపోయే రీతిలో సరఫరా అయ్యేసరికి తక్కిన వర్గాలు ఈ పనివారిని తమ చేతిలో కీలు బొమ్మలుగాచేసుకోవడం ఎలా అని ఆలోచనచేసి మార్గాలు మూయడం ప్రారంభించారు. దాని కథే సామాజికపు కట్టుబాట్ల వరుస. గ్రామ సేవకుడుగా శిల్పి సేవలు సాగాయి. సమాజంలో మాత్రం అతడ్ని వెనక్కు నెట్టి వేయడం జరిగింది. అష్టాదశవర్ణాలో ఇతడి స్థానం ఎక్కడో? "ఆయూరి పదునెన్మిది సమయాల సమస్త ప్రజానురంగభోగానికై" దానము చేసిన వారున్నట్లు నాగుల పాటి శాసనము చెప్పుచున్నది.

18.04 కుమ్మరి వడ్రంగి. కంచరి, శిల్పి (కాసె)అగసాలె, వృత్తులవారు సామాన్యముగ విశ్వకర్మ సంజాతులుగా అన్నదమ్ములుగా చెప్పుకొనెడివారు. ఈ ఐదుగుర్ని పాంచాణులనేవారు. వీరే శిల్ప సంప్రదాయాన్ని దేశంలో నిల్పినవారు. తక్కిన ఎన్నో కులాలవారు శిల్ప వృత్తిలో పెరిగి తరిగి చేతులుమార్చినా యీకులస్థులు మాత్రం శిల్పం తమ వృత్తిగా నిల్పుకొని యీ ఆధునిక యుగంలో కూడా ఈ వృత్తులతోనే జీవనం సాగిస్తున్నారు. పాంచాణం వారు పాంచాలిలు అనే శబ్దాలు తెలుగులో వ్యవహారానికివచ్చాయి. అసలు సంస్కృతంలో 'పాంచాల' శబ్దం పంచ+అక పంచభి, స్వర్ణాదిశిల్పైః అలతి విశ్వం సపంచాలో నామ విశ్వకర్మా దేవ శిల్పిఅల్ భూషణాదౌ అనే వ్యుత్పత్తిచేత స్వర్ణాది పంచశిల్పముల చేలోకమునలంకరించువాడు పాంచాలుడనబడును. ఆ విశ్వకర్మయే దేవశిల్పి యనబడుననే అర్థం ప్రతిపాదించబడుతుంది. నడాదిభ్యఃఫక్ (4-1-99) అనే పాణిని సూత్రాన్ని వివరిస్తూ బ్రహ్మర్షి గోత్ర బోధకమైన నడాది గణంలో ఈ శబ్దం చెప్పబడ్డది.* ఉదాహరణలిస్తూ నడచర-శలంక-మిత్ర-ద్విప-కాశ్యప-కృష్ణ-రణౌ-శకట జలంధర-అధ్వర-పంచాల-చమసిన్-బ్రాహ్మణ-బదర-అశ్వల-బ్రహ్మదత్త-ఉదుంబర ఇత్యాదులు నడాదులు అని వివరించారు. అప్పై శబ్దాల ఉదాహరణలిస్తూ.

10.05 నారాయణ-చారాయణ-మైత్రాయణ-ద్వైవాయన కార్షాయణ-శాకటాయన-జాలంధరాయణ-పాంచాలాయన-చామసిచామన-బ్రాహ్మణాయణ-బాదరాయణ-అశ్వలాయన లాంటి శబ్దాలు అక్షయగోత్రవాచకాలై బ్రాహ్మణ జాతీయతను తెలుపుతాయి, అని వ్యాకరణ పండితులు నిష్కర్షించారు. పాంచాలాః అని ఉన్న పదం తెలుగు వ్యవహారంలో పాంచాలురు, పంచాణం వారు అని వచ్చింది.

18.06 ఇలా వీరు అయిదు వృత్తులతో తెలుగుదేశం అంతటా వ్యాపించి ఉన్నారు. ఒక తెలుగుదేశం మాత్రమే కాదు యీ కులం వారు యావద్ భారతంలోనూ ఉన్నారు. తెలుగు దేశపు ప్రాచీన చరిత్ర చూస్తే గ్రామ శిల్పులుగా వీరు తమ సేవలందించారు.

కరణం ముచ్చి కంసాలి కుమ్మర కమ్మర
గణ శ్శిల్పక స్వర్ణ మృదయ స్కార
తక్షకా: కసారకశ్చ భకారశ్చండాల
వ్వితలం। తథా నికృష్టకార్తి
కాంచిష్ఠోన రజకశ్చ యథాక్రమం।
ఏతే ద్వాదశజాతీనాం
గ్రామభారస్య వాహకాః॥

18.07 "రాయల కాలమునుండి నేటివరకు పన్నిద్దరాయగాండ్లు స్థిరపడినారు. క్రీ.శ. నుండి ఈ క్రింది వారు పన్నిద్దరాయగాండ్లుగా లెక్కింపబడిరి.

1. కరణము, 2. రెడ్డి, 3. తలారి, 4. చాకలి, 5. మాదిగ, 6. మంగలి, 7. వడ్ల, 8. కమసలి, 9. పురోహితుడు, 10. నేరడి, 11. కమ్మరి, 12. కమ్మరి ఈ లెక్కలో తర్వాత మరికొంత మార్పు కలిగెను. కమసలి, పురోహితుడు ఆయగాండ్లలో చేరారు. రెడ్డి కరణాలకు తలార్లకు జీతాలు స్కేళ్లు ఏర్పడినవి కాన వారిని యీ పట్టిక నుండి తొలగినారు. ఇప్పుడునిరకముగా మిగిలినవారు చాకలి, మంగలి, వడ్ల, కమ్మరి, చెరువులుండుచోట నేరడి, మాదిగ కొన్నితావుల్లో కుమ్మరి (ఆంధ్రుల సాంఘిక చరిత్ర) 354.

ఇలా గ్రామ భారవాహకులుగా గ్రామంలోని పనుల్ని చేస్తూ గ్రామస్థులిచ్చే ప్రతిఫలంతో కాలం గడిపారు.

18.08 బారాబలవంతులనిపించుకొనన వారే తరువాతి కాలంలో వారు బలహీను లనీ పిలుపించుకొన్నారు. గ్రామ సేవకుతమకిస్తున్న ఫలితాన్ని కొన్ని తావుల్లో 'బిచ్చం' అన్నారు. మరికొన్ని చోట్ల మిరాసీ అన్నారు. మొత్తానికి యీ వ్యవస్థ యినాంభూముల రద్దుతో రూపం మారిపోయింది. ఆ భూములన్నీ భూస్వాములు చేతుల్లోకి పోయాయి. వృత్తి దారులంతా గ్రామాలు వదిలి రకరకాల వృత్తులు స్వీకరించి పట్టణాలలో స్థిరపడడం మొదలు పెట్టారు. కాగాయిప్పుడు గ్రామీణ వృత్తుల్ని చేసేవారే కరువైనారు. రైతులు ట్రాక్టర్ మోటార్‌ల కోసం పరుగెత్తుతుంటే కార్మికులు నగరాలలో ఉండే కార్ఖానాలలో కూలీలుగా జీవించడంమొదలు పెట్టారు. దీంతో శిల్పిజీవనంలో ఎంతో మార్పు వచ్చేసింది.

---

## సందర్భ గ్రంథాలు

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర : సురవరం ప్రతాపరెడ్డి
2. సంక్షిప్త ఆంధ్ర దేశ చరిత్ర : ఏటుకూరి బలరామమూర్తి
3. తెలుగువిజ్ఞాన సర్వస్వము : 14వ సంపుటం
4. విశ్వబ్రహ్మకులోత్సాహము : గ్రామణ్య ప్రకరణం - పండిత నారాయణ శాస్త్రి క్షీరసాగర్
5. శిల్పులుదేశాభ్యుదయ కరులు : స్వామి తత్వానంద

# అధ్యాయం 18

## వడ్రంగం

20.1 కొయ్యతో చేసే పనిని వడ్రంగం అన్నారు. వ్యవసాయానికి ముఖ్యమైన నాగలి - కాడి-మేడి మొదలైన పరికరాలుతయారుచేసి యిచ్చి వ్యవసాయాధార గ్రామాల్లో ముఖ్య కార్మికుడుగా బ్రతుకుతున్నాడు. కొందరు యిండ్లు కట్టడం - ఇండ్లకు పనికి వచ్చే దరవాజాలు - తలుపులు - దూలాలు - కిటికీలు మొదలైన వాటిని తయారు చేసి బ్రతుకుతున్నారు. మరి కొందరు నగరాలకు వచ్చేసి కుర్చీలుబల్లలుమంచాలు మొదలైన గృహోపయోగి సామానులు తయారు చేస్తూ కాలక్షేపం చేస్తున్నారు. ఇక్కడ వృత్తి ధర్మం కన్నా కేవలం జీవన భృతికి మాత్రమేవృత్తిని ఆశ్రయించిన పరిస్థితి యిది. శిల్పిగా మంచి నగిషీ పనిచేసేవారున్నా వారికి శిల్పిగా రావలసిన కీర్తి రావడం లేదు. ఆ అవకాశం ఏ కొద్దీ మందికోగానిలభించడం లేదు.

20.2 ఈ వడ్రంగం వృత్తి వేదకాలం నుండీ మన దేశంలో అభివృద్ధి పొందిందే. యజ్ఞంలో పనికి వచ్చే చమస మొదలైనపాత్రల్నీ స్రుక్ స్రువాల్నీచెక్కల్తోనే చేస్తారు. అలాగే ఎన్నో యజ్ఞోపకరణాల్ని గూడా చెక్కలతో చేస్తారు. అందు వల్లనే నేమో దైవ కార్యాలకూసాంప్రదాయిక కార్యాలకూ కొయ్యతో చేసిన పరికరాల్ని మాత్రమేవాడాలనేనియమం ఏర్పడ్డది.

20.03 వేదాఙ్మయంలో ఋభువులు అనే మొదటి మానవులువడ్రంగులే. అలాగే వీరు వేదవాఙ్మయంలో మేధావులు అనిపిలువపడ్డారు. ఈ వృత్తిదారుల్ని యజ్ఞయాగాది క్రతువులకు అర్హులుగా మీమాంసా శాస్త్రచర్చ చెబుతోంది. వేదకాలంలో రథాల పందేలు మొదలైన వర్ణనలు చూస్తుంటే ఆనాడు యీ వృత్తి చాలా గొప్పగాఆదరింపబడిగౌరవింపబడి చాలా మందియీ పని చేసే వారని తెలుస్తుంది. కానికాలాంతరంలో యీ రథ శిల్పం మాయమై

పోయినట్లు తెలుస్తుంది. దాంతో యీ వృత్తి దారుని కార్యక్రమం అంతా వ్యవసాయదారుని పనిముట్ల తయారీతోనే సరిపోతుంది. ప్రాచీన కాలమునుండి వచ్చుచున్న వడ్రంగము వృత్తిలో తగినంత మార్పేదీ లేదనియే జెప్పవలెను. మయ సభవంటి నిర్మాణము ఇతిహాస ప్రసిద్ధమే గాని లోకము జూడనిది. ఎడ్ల బండి గత ఎన్నోశతాబ్దాల నుండివస్తున్నదే!



## సందర్భ గ్రంథాలు

1. వేదిక్ వెర్బ్ - డా॥ పెదపాటి నాగేశ్వరరావు
2. జియస్ ఆఫ్ ఋగ్వేద - డా॥ పెదపాటి నాగేశ్వరరావు
3. రథకారాధికరణం - దంతనాల నాగేశ్వర శాస్త్రి
4. తెలుగు విజ్ఞాన సర్వస్వం - 14వ సంపుటం

# అధ్యాయం 19

## కంచరము

21.01 కంచు+అరి=కంచరి, కంచు అను ఒక మిశ్రమలోహము తయారుచేయబడి దానితో పాత్రాదికము తయారై వాడుకలోనికి వచ్చిన పిదప యీ కంచరి పనికి ప్రాముఖ్యత గలిగినట్లు చెప్పవచ్చును. రాగి - ఇత్తడి-తగరము మొదలగులోహముల మిశ్రమము వలనయీ లోహమునుతయారు చేసి దీనితో అనేక పాత్రాదులనుచేసి గృహోపకరణములుగా వాడుటతో దీనికి ప్రాముఖ్యత పెరిగినది. అట్లే ప్రాచీన కాలమునుండియు యీ మిశ్రధాతువులతో అనేక దేవతా విగ్రహములను నిర్మించి మన దేవాలయముల నలంకరించిన విషయము వేరే చెప్పనవసరము లేదు. సుందరమైన ఆ విగ్రహములను జూచి మన ప్రాచీనుల మిశ్రధాతు నిర్మాణ శక్తికి అచ్చెరువు పడి పాశ్చాత్య వైజ్ఞానికులు మెచ్చుకోలు చెల్లించారు. అలాగే ప్రాచీన కాలంలో ఈ మిశ్రలోహ పారిశ్రామికులు అద్దాలనుపోత పోస్తున్నట్లుగా కూడా తెలుస్తుంది. ఇప్పటికీ కేరళలో కొన్ని కుటుంబాల వారీ అద్దాల పోత పోసే వృత్తిలోనేఉన్నారని తెలుస్తుంది. ఏతావతా తెలియవచ్చేదేమంటేమన రాగి-ఇత్తడి వృత్తిదారులు కేవలం శిల్పం మీదనే ఆధారపడక జనోపయోగి శిల్పాలైన బిందెలు, చెంబులు, తపాళలు, పళ్లేలు, కంచాలు, గంటెలు మొదలైన వాటిని తయారు చేసి జీవిస్తున్నారు. కంచి కుంభకోణాలు తిరుపతి పళని మొదలైన చోట్ల యీ వృత్తిదారులపెద్ద పెద్ద కార్ఖానాలుండే వట. నేడుతక్కిన చేతి పనుల్లాగానే యిదీ మూలబడింది.

# అధ్యాయం 20

## శిలాశిల్పం.

22.01 శిల్పం వృత్తిగా మొదట శిలతోనే మొదలైంది. అయితేయీనాడు ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద యీవృత్తిలో ఉన్నకుటుంబాల్నిప్రవేళ్లపై లెక్క పెట్టవచ్చు. కర్నూలు జిల్లాలో ఆళ్లగడ్డ గ్రామంలో కొందరు గుంటూరుజిల్లాలో దుర్గి గ్రామంలో కొందరుకరీంనగరుజిల్లా రామడుగు గ్రామంలోకొందరు శిల్పులు మాత్రంఈ వృత్తిని నమ్ముకొని జీవిస్తున్నారు. ఈ మధ్య కొన్ని కుటుంబాలు తమిళదేశం నుండి తరలి వచ్చి యిక్కడజీవిస్తున్నా వాటిని ప్రత్యేకంగా పేర్కొన నవసరంలేదు! నిజానికి యీ వృత్తి చాలా పరిమితమైన పనులకు పనికి వచ్చేదిగా చాలా వెనక్కు నెట్టబడ్డది. సామాన్యులకీ వృత్తిదారుడు చేసే సేవలేమిటి? అని ఆలోచిస్తే దీని పరిధి తెలుస్తుంది. రుబ్బురోళ్లు తిరగళ్లు వాడే యుగం పోయిందిగా. ఇక ఆధునిక నాగరిక సమాజంలో యీ శిలా శిల్పి చేసే పనులేవీ సామాన్యుడికందుబాటులో ఉండవు అందువల్ల యీ వృత్తి కుంచించుకుపోతుందనిచెప్పవచ్చు.

20.02 1. రాతి కట్టడాలు ఆగిపోయాయి.

2. దేవాలయాలెప్పుడోకాని కట్టరు.

3. దేవాలయాల్లో కూడా ఇప్పుడు సిమెంటు పనికే ఎక్కువ ప్రాధాన్యం వచ్చేసింది.

4. రాయిచాలా కఠినమైంది గనక దాన్ని మలచే పనికి కూలీ గిట్టడం లేదు.

5. రోడ్లు భవనాల శాఖ వారి పనులకు మిషిన్లతోనే సరిపోతుంది. గనుక వృత్తిదారుడు చేసే పని వెనకబడిపోయింది.

ఇత్యాదులు కారణంగా యీ వృత్తి మినుకుమినుకుమంటూ ఆంధ్రదేశంలో నిలిచి ఉంది.

# అధ్యాయం 21

## బంగారు పని

23.01 దీన్ని బంగారు పని, అవుసలపని అగసాలిపని - కంసాలిపని- అనివ్యవహరించడం కద్దు. బంగారం చాలావిలువైనలోహం. ప్రపంచం అంతటాదాని విలువచలనం లేని మారనినాణెం గాబట్టి యీ బంగారానికి అంతర్జాతీయ విలువ కలిగింది. ఈ లోహం వాడుక మనదేశంలో వేదకాలం నుండీ ఉన్నట్లుతెలుస్తుంది. అందువల్లవేదంలో ప్రతీదానికీ బంగారంతో ముడిపెట్టిచెప్పిన వ్యవహారాలున్నాయి.

23.02 సువర్ణదానం - సువర్ణశృంగగోదానం - సువర్ణ ప్రతిమాదానం - సువర్ణాంబర దానం -సువర్ణ సహిత రత్నదానం - సువర్ణరజతదానం ఇత్యాదిగా సువర్ణాన్నిపొందడానికి ఎన్ని ఉపాయాలున్నాయో అన్ని ముడిపెట్టి మన స్మృతి పురాణ ఆచార విచారాల్లో దీనికి చాలా పెద్ద పీట వేశారు.

ఆ ఆచారాల మీద నమ్మిక ఉన్నా లేకపోయినా అతివిలువైనలోహంగా అది చెలామణి అవుతున్నంత కాలమూమానవుడు దాన్ని పొందాలని ఆశచెందుతాడు. ఎందుకో తెలుసా?

23.03 1. దాచుకోవడం తేలిక, 2. దోచుకోవడం తేలిక, 3. మార్పిడి తేలిక, 4. లాభం తేలిక, 5. మాయ తేలిక, 6. మనుగడ మంచిది. 7. ఆరోగ్యకారి - ఔషధగుణము కలది, 8. తేజస్సు కలది, 9. త్వరగా కరుగుతుంది. 10. త్వరగాగట్టిపడుతుంది. 11. ఆభరణానికి ఉపయోగపడుతుంది. 12. పరపతిగలిగిస్తుంది, 13. విపణివీధిలో విలువ గలది / ఇస్తుంది. 14. అంతర్జాతీయ మార్పిడికి పనికొస్తుంది. 15. వివిధ రూపాల్లో దాచుకోవచ్చును.

ఇన్నిసుగుణాలున్నలోహం గనక ఆస్తికి మారురూపంగా ప్రతిమానవుడూ కొంత బంగారాన్ని సంపాదిస్తున్నాడు.

మన ఆచార వ్యవహారాల్లో కొన్ని సంస్కారాలతోబాటు బంగారం వాడకం విధిగా మన పెద్దలు విధించి సాంఘిక కట్టుబాట్లలో ఇమిడ్చారు. గనుక బంగారం వాడని కుటుంబము ఈ భారతదేశంలో లేదని చెప్పవచ్చు.

23.04 ఇలాఆబాలగోపాలానికి తెలిసిన యీ బంగారం శిల్పోపయోగిగా మన దేశంలో వేద కాలం నుంచే ఉన్నదని తెలుస్తుంది. రుక్మ వేదికలు, రుక్మ దక్షిణలు లేని యజ్ఞం లేదు. అందువల్ల యజ్ఞభోక్త అయిన అగ్నిని జాత వేదుడనీ - జాతరూపుడని - స్వర్ణవీర్యుడనీ ప్రశంసించారు ఋషులు. ఋషులు మునులుగూడా ఈ కాంచన స్తోత్రం చేస్తూవచ్చారంటేదీని ప్రభావమెంతటిదో వివరించాల్సిన పనిలేదు. అలాగేఆనాడేదానికంతప్రభావ ముంటే ఈనాడు దానికలాంటి ఆకర్షణుండడంలో వింతలేదు. సమాజానికి యీ బంగారం వల్ల లాభం లేదని - బంగారాన్నంతాప్రభుత్వమే పొందాలనీ ఉద్ధేశ్యంతో యీ మధ్య మన ప్రభుత్వంవారుగోల్డ్ కంట్రోల్ ఆర్డర్ వచ్చింది కాని దానివల్ల వారాశించిన ఫలితాలేవి కలగలేదు! దాంతో దాన్ని సడలించుకొన్నారు

23.05 తక్కిన శిల్పాలేవీ సామాన్యుడ్ని చేరలేకపోయినా ఈ బంగారు శిల్పం ఏదో నగరూపంలో ప్రతివారినీ చేరింది. ప్రతి పురుషుడూ చేతి వ్రేలికి ఒక ఉంగ రాన్నైనా ధరించడం ప్రతిస్త్రీ మంగళ సూత్రాన్ని ధరించడం వల్ల భారత దేశంలో ప్రతిపౌరుడుబంగారు శిల్పాన్ని ఆదరించినవాడేనని చెప్పవచ్చు.

23.06 అందువల్ల ప్రతి పల్లెలోనూ పట్టణంలోనూ బంగారు పనివారునియతంగా ఉండడం చూస్తాం! అలాగే యీ వృత్తిని అన్ని కులాల వారూ చేయడానికి ప్రయత్నిస్తున్నట్లు యీ మధ్య లెక్కల ప్రకారం తేలింది.

23.07 బంగారు శిల్పంతో తయారయ్యే వస్తువులు దేశ విదేశాల్లో గిరాకీ సంపాదించుకొని పెద్ద విపణి వీధిలోకి ప్రవేశించినందువల్ల వీటిపై పెద్దపెద్ద ధనవంతుల చేయి పడ్డది. బంగారు రత్నాల వ్యాపారాలన్నీమార్వాడీలు. వ్యాపారులుకోమట్లు సాగిస్తున్నారు. పనివాళ్లు వాళ్ల దగ్గర కూలీలుగా

మాత్రమేజీవిస్తున్నారు. ఇది యీ యుగంలో కలిగిన మార్పు. అందువల్ల యీ పనిరూపు రేఖలుమారినై ఇప్పుడు అంతారెడీమేడ్ యుగంగా తయారై చేతిపని అవసరం చాలా కొంచెమై పోయినందున పనివారి అవసరంకూడా తగ్గిపోయింది.

1. బంగారం వెల పెరగడం
2. దొంగ బంగారం రాకడెక్కువగావడం
3. ధనవంతులు బంగారాన్ని దాచేయడం
4. సామాన్యుల కొనుగోలు శక్తి తగ్గడం

లాంటికారణాల వల్ల బంగారం చాలా తగ్గింది. అదివరకు ఎన్నోసొమ్ములు ధరించే స్త్రీలు ఇప్పుడు చాలాకొద్ది సొమ్ములతోనే జరుపుకొంటున్నారు - ధరలుపెట్టలేక

23.08 కనక యీ వృత్తికి కూడా నూకలుచెల్లినట్లేనా? అని తద్‌జ్ఞులు విచారిస్తున్నారు. దీనికి కారణాలు.

1. బంగారం అంత తేలికగా బజారులో లేకపోవడం, 2. ప్రభుత్వం ఒకటిచెబితేపోలిసులింకోకరంగా వృత్తి దారుల్ని వేధించడ, 3. నల్లధనంగా బంగారం రూపొందడం, 4. విదేశాలనుండి రాకడ, 5. దొంగతనాలెక్కువ కావడం

లాంటి విషయాలుఅందరినీ ఆలోచింపజేస్తున్నాయి.

# అధ్యాయం 22

## కుమ్మరము

24.01 చాలా ప్రాచీన కాలం నుంచీ అన్ని దేశాలలోనూవ్యాప్తి చెందిన పనికుమ్మరి పని అంటేమట్టితో పాత్రలువస్తువులు బొమ్మలు చేయడం. లోహాలు రాకపూర్వం మానవుడు యీ మట్టి పాత్రల్నే వాడాడు. అలాగే ఇప్పటి దేశంలో ఎక్కువ మంది ముఖ్యంగా పేదవారు వాడుతున్నది మట్టిపాత్రలే. ఆరోగ్య దృష్ట్యా కూడాయివిచాలా మంచివి. వేసవిలో చాలా చల్లగా ఉండిమనకెంతో ఆహ్లాదం కలిగిస్తాయి. ఈ వృత్తి చేసేవారిని కుమ్మరి వారంటారు. వీరినిసంస్కృతంలో కులాలురన్నారు. వీరి వృత్తి పేదవారికెంతో సమాయకారి గనకనే యిన్ని శతాబ్ధాలైనాయీ వృత్తి కేమీ ఢోకా లేకుండా ఉంది. ఈ వృత్తికేవిధమైన ప్రతి బంధాలు లేనందువల్లగ్రామీణవృత్తిగా అన్ని పల్లెల్లోనూ అభివృద్ధి పొందుతూంది. ఇటుకలు కుండలు, పెద్ద పరిశ్రమగావీరికిజీవనోపాది కల్పిస్తున్నాయి.

నగరాల్లో ప్రజలుఎక్కువగాపింగాణీ స్టెయిన్ లెస్ - ఇత్తడి పాత్రలుపయోగించడం వల్ల యీ వృత్తి కేవలం పేదవారికిమాత్రమే పరిమితమైపోయింది.

నగరాల్లో కంటేగ్రామాల్లోనేయీ వృత్తి దారులకు ఎక్కువ పరపతి సౌకర్యాలున్నాయి. వాటి సహాయంతో యీ వృత్తిదారులు ముందడుగువేస్తున్నారు.

# అధ్యాయం 23

## నిర్మాణము

25.01 ఇది శిల్ప వృత్తిలో నుండి విడి వడ్డశాఖ. ఎవరూ విడదీసింది గాదు. శిల్పం నుండి భవనాదుల నిర్మాణము వడ్రంగం నుండి తలుపులుదరవాజాల నిర్మాణము వచ్చి అంగాలుగా యీ వృత్తిలో చేరాయి.

25.02 ఇల్లుకట్టుకోవడమనేదియీ శతాబ్దంలోబాగా పెరిగిన పరిశ్రమ. అది వరకటికంటేఇప్పడీ పరిశ్రమ రూపురేఖలుమారిపోయాయి. ఇంజనీరింగ్ ఆర్కిటెక్చరల్ - వింతలన్నీఇందులో మాటుగొన్నాయి.

25.03 ఆధునిక పదార్థాలైన సిమెంటుఇనుము - తగరము మొదలైన వానితో భవన నిర్మాణంలో ఎన్నోరకాలైన మార్పులు వచ్చాయి. ఆకాశాన్నంటే హర్మ్యాలు పెద్ద పెద్ద నగరాల్లో నిర్మాణంఅవుతుండగా ప్రతివారూ తమ ప్రాత యిండ్లు క్రొత్త మూసలో పోసి ఆధునిక గృహాలునిర్మిస్తున్నారు. ప్రభుత్వంవారే స్వయంగాకాలనీలు నిర్మించి యిస్తున్నారు.ఆ దృష్ట్యా యీ వృత్తికి ఎంతో ప్రాముఖ్యత కలిగింది. అటు శిల్పవృత్తిలోంచి వాస్తు విధానము వడ్రంగంలోంచి తలుపులు దరవాజాలూ ఆధునిక యింజనీరింగ్ నుండి రూపమూ వసతులు సంతరించుకొనియీ వృత్తి దినదినాభివృద్ధి నందుతూ ఎందరెందరికో పని కల్పిస్తూ అభివృద్ధి చెందుతుంది. ఆధునికమపడం వల్ల కులం ప్రాతిపదిక అంటూలేకుండా కేవలం కాంట్రాక్టర్ల పోషణలో యిది క్రొత్త పుంతలు త్రొక్కుతుంది. క్రొత్త నగరాలు కాలనీలుపెద్ద పెద్ద డాములు రోడ్లు తయారీలో యీ పనివారు ముందడుగు వేస్తున్నారు.

# అధ్యాయం 26

## శిల్పి: పర్యాయపదములు

26.01 1. విశ్వకర్మ, 2. విశ్వకృత్తు, 3. శిల్పి, 4. రథకారుడు, 5. స్థపతి,6. మనువు, 7. మయుడు, 8. త్వష్ట, 9. విశ్వజ్ఞుడు, 10. వర్ధకీ / వర్ధకుడు, 11. తక్షకుడు, 12. సూత్రధారి, 13. సాధకుడు, 14. గౌంజికుడు, 15. శౌల్బికుడు, 16. ఋభువు, 17. నాడింధముడు, 18. కలాదుడు, 19. పశ్యతోహరుడు, 20. సుహస్తుడు, 21. కర్మంది, 22. భాస్కరుడు, 23. వాస్తువిత్, 24. పారాసి/ పారసి, 25. సంకృతి, 26. పాంచాలుడు, 27. పాంచాణుడు, 28. అయస్కారుడు, 29. దారుకారుడు, 30. తామ్రకారుడు, 31. కాంస్యకారుడు, 32. తామ్రకట్టకుడు, 33. తామ్రోపజీవి, 34. స్వర్ణకారుడు, 35. రుక్మకారుడు, 36. హేమకారుడు, 37. చిత్రకారుడు, 38. చిత్రకరుడు, 39. కార్మికుడు, 40. కర్మారుడు. 41. కారువు, 42. కృత్తు, 43. ఆచారి/ఆచార్యుడు, 44. లోహకారుడు, 45. మాలాకారుడు, 46. దర్పణకారుడు, 47. మణికారుడు, 48. ఆచారి/అచార్యుడు, 49. జగద్గురుకులజుడు, 50. మేఘవాహన కులజుడు, 51. మేరువాస కులజుడు, 52. (రుంజలు), 53. (పనసలు), 54. రుద్రపాదులు, 55. సప్తమకులజులు, 56. స్వర్ణహంతకులు, 57. స్వర్ణస్తేయి, 58. కుంభసంభవశాపభంజనులు, 59. రత్న పారఖి, 60. వాస్తోష్పతి, 61. కలజులు, 62. కంసాలి, 63. కమసలి, 64. కమ్మసాలి, 65. కమసలిబత్తుడు, 66. సొన్నారి, 67. సోనార్, 68. అగసాలి, 69. అక్కసాలి, 70. అవుసలి, 71. కంచరి, 72. కమ్మరి, 73. వడ్రంగి, 74. వడ్ల, 75. వడ్లాబత్తుడు, 76. కాసె, 77.కాసీ, 78. జీనిగె, 79. సుతారి, 80. ధీమాన్, 81. జాంగిడ్, 82. షేషిణీ హనుమంత బిరుదాంకితులు.

26.02 విశ్వకర్మకులజులకు బిరుదవాచకము

ఈ శబ్దములు కొన్ని వైదికములు, కొన్ని పౌరాణికములు, కొన్ని లౌకికములు,

కొన్ని దేశభాషాపరములు మరికొన్ని వృత్తి వాచకములుకొన్ని బిరుదవాచకములు. వీటిని విచరక్షణతో వాడినవారున్నారు. మొత్తమున కివన్నియుతెలుగుసాహిత్యమున ప్రతిఫలించినవని చూపుట జరుగుచున్నది.

26.03 మన భారతీయ సంస్కృతికి వేదాలుమొదటి గ్రంథాలు. అందులో ఋగ్వేదం మొదటిది. దానిలో దశమ మండలంలోవిశ్వకర్మసూక్తం, పురుష సూక్తం అనేమంత్ర భాగాలున్నాయి. అలాగే తర్వాతి వేద భాగాల్లోను 'విరాట్ పురుషుడే విశ్వకర్మ దేవతల్లో మొదటివాడు - సృష్టికర్త-సర్వోచ్ఛదేవదేవుడుగా స్తుతింపబడ్డాడు. అతడే గాయత్రీ - అనీ చెప్పబడింది. త్వష్ట, విశ్వరూపుడు, ఋభువులు - మొదలైన వారి కథలన్నీ విశ్వకర్మకూ శిల్పవిద్యకూ సంబంధించిన ఉదాంతాలే! వేద సంహితల నిండా రథకారుల రథ ఘోష ఉన్న సంగతి ఆర్య ఋషి వాక్యములు విన్నవారికి వేద గ్రంథములలో కన్నవారికి విదితమే!

26.04 వేదములు వెనుకబడి పురాణములు పెరిగినప్పుడు బ్రహ్మ-విష్ణు-రుద్ర దైవతములకు ప్రాధాన్యము కలిగి వైదిక దైవతముల దశ తగ్గినది.

ఈ వాఙ్మయములోవిశ్వకర్మను దైవశిల్పిగామాత్రమే స్మరించుట జరిగినది.

26.05 తదుపరి కాలమున వెలువడ్డ స్మృతుల్లో గందరగోళం ప్రారంభమైంది. చాతుర్వర్ణ్యం అష్టాదశవర్ణమైపోయింది. ఈ అష్టాదశ వర్ణములలో కొందరు శిల్పులున్నారనిరి - కొందరు లేరనిరి. - మరికొందరు వీరస్పృశ్యులనిరి.

26.06 ఇక తరువాతి వాఙ్మయం శృతి స్మృతి పురాణాల్ని యథేచ్ఛగా వాడుకొంటూ అవసరమైనప్పుడు శిల్పినిగొప్పవాడని కీర్తించుట, అవసరం తీరగానే నీచకులుజుడని నిందించుట, ఇంకా కసి తీరకపోతే అస్పృశ్యుడని వ్రాయడం పరిపాటై పోయింది.

26.07 అందువల్ల గత శతాబ్దంలో అభిమాన ధనులైన శిల్పాచార్యులు కొందరు కోర్టులకెక్కి తమ హక్కుల కోసం పోరాటం సాగించివిజయులయ్యారు. కాని ఆర్థిక వనరులు లేనందున తగినంత అభివృద్ధి పొందలేకపోయారు. ఈ విషయాలన్నీ తెలుగులో ప్రతిఫలించాయి.

1. విశ్వకర్మ = పరమాత్ముడు - విరాట్టు - సృష్టికర్త-ఋషి-సూర్యుడు-గాయత్రి అనుఅర్థములలోవైదిక వాఙ్మయము నుందు ప్రసిద్ధము. లౌకిక వాఙ్మయమునందు దేవ శిల్పి - శిల్పి - అని ప్రచారము నందినది.

ఆవిశ్వకర్మ నిర్మిత

దేవ విమానుండు సకిల విద్యాభరణ

శ్రీ విరచనపరితోషిత దేవుడు శిల్పప్రజా పతియునైనెగడెన్ నన్నయభారతం, ఆదిపర్వం, అ. 3. ప. 68.

2. విశ్వకృత్తు : విశ్వకర్మ : సూర్యరాయాంధ్ర నిఘంటువు

3. శిల్పి : సౌవర్ణం రాజతంచైవతామ్రం పాషాణదారవం

శిల్పం త్వత్సంతతౌ స్థాతా యావత్కలియుగంధృథం

గృహంయంత్రంరథోభూషా ప్రతిమావసనాదికం

యత్కించిద్ దృశ్యతే శిల్పం తత్సర్వం విశ్వకర్మజం (పద్మపురాణ భూఖండం) శిల్పములను చేయువాడు

4. రథకారుడు : రథములను చేయువాడు - వఁడ్రంగియని సామాన్యార్థము.

5. స్థపతి : సగీష్పతీష్ట్యాస్థపతి : అని కోశవచనము శిల్పాచార్యుడని సంప్రదాయార్థము. అనుపమసర్వసాధనసమగ్రతతో శుభవేళ వాస్తు పూజన బలిహోమతంత్రములు సద్విధిజేయగ సూత్రహస్తులై, మునుకొని కోవిదస్థపతి ముఖ్యులు శిల్పములు ద్యమించిరి..... ఎఱ్ఱాప్రెగడ హరివంశము : ఉ.భా.అ. 2.154.

6. మనువు, 7. మయుడు, 8. త్వష్ట, 9. విశ్వజ్ఞుడు, ఇవివిశ్వకర్మ సంప్రదాయము నకు సంబంధించిన శబ్దములు.

త్వష్టుప్రజాపతితరణి మహేంద్రుండు వెలయ దివస్పతి విశ్వకర్మ

భూరితరమయుండు పుండరీకాక్షుండు

మనువు శాస్త్రములై మహిని వెలయు

మన్వీశుడు శివుండు మార్గమూర్తి మయుండు
మురిపెమ్ముగా హరిమూర్తి త్వష్ట
కర్మ శిల్పియు పంచకర్మమై పంచసా
దాఖ్యత విశ్వజ్ఞుడలరెనతడె
తెలియనామత్రయముల నాదిత్యుడగుచు
పంచవింశతితత్త్వైక పరుడు పంచరూపి
తత్వంచ భూతస్వరూపుడరయ
నీశరవివహ్నిమూర్తుల నెసగె మనువు (తుర్కారాజకవి, అయ్యంకి బాల సరస్వతి కృత ఆంధ్రనాగరఖండం)

10. వర్ధకి : వడ్రంగి

అని మతింపగా హరి సుధాశనవర్ధకి జూచి
పాండ్యుడిచ్చిన ధనమిమ్మునీశ్వరుడశేషము
భాగవతాస్మదీయ గేహనివహ సాత్కరించి
యకటా! కడురిక్తత వొందు నేతదీయ
నిలయమప్పురిన్ మణిమయంబును
సార్ధకము జేయునావుడున్ = ఆముక్తమాల్యద అ.4.ప.32.

11. తక్షకుడు : వడ్రంగి

శిల్పి, కర్మార, తక్షక, క్షౌరక, స్వర్ణకో, రజకాదులమ్మహీపతి బలిసిచనిరి. తిక్కన భారతం స్త్రీ పర్వం ఆ. 1.వ.101

12. సూత్రధారి : శిల్పి సూత్రము పట్టి నిర్మాణములు చేయువాడు, పై 5.వ. పదమునసూచింపబడిన ఎఱ్ఱాప్రెగడ పద్యములో సూత్రహస్తులై అను వివరణము చూడదగినది.

13. సౌధకుడు : సుధ : సున్నముతో పనిచేయు శిల్పి

14. గౌంజికుడు : గుంజా : గురివింద గింజలతో తూయువాడు : స్వర్ణశిల్పి

15. శౌల్బికుడు : రాగి పనిచేయు శిల్పి

మన్నగరి నున్న శౌల్బికులెన్నడు నీరీతి బలుకనెరిగిరె మనతో
బన్నుగ గట్టుడు కొట్టుడు
తన్నుడు తలదీయుడితని దర్పమడంగన్
(ధర్మపాల విజయము ఆ. 1. 199)

16. ఋభువు : వైదిక పరిభాషా పాఠము : వడ్రంగి

17. నాడింధముడు : కొలిమి నూదుచు పనిచేయువాడు కమ్మరి

18. కలాదుడు : కళాస్రష్ట : శిల్పి : కళాపూర్ణోదయం 8×9)

19. పశ్యతోహరుడు : చేతి పనులను నేర్పుగా జేయువాడు.

21. కర్మంది : కర్మకారుడు

22. భాస్కరుడు : మెరుగులీను పనులుచేయువాడు : శిల్పి

23. వాస్తువిత్ : వాస్తువేత్త : వాస్తు కర్మకుడు

వాస్తు కర్మకుల చే వాసుదేవమహర్షి వినతత్రి గవ్యూతి విస్తృతంబు
గనక సోపాన శృంగాట కోజ్వలముగా
బర్జన్యమణి మంటపము ఘటింప
(జైమినీభారతము ఆ.6.ప.16)

24. పారాసి : స్వర్ణకారుడు

పారసి

25. సంకృతి : సృష్టికర్త : విశ్వకర్మ అను అర్థంలో వైదిక పరిభాషలో వాడిన శబ్దము

26. పాంచాలుడు : శిల్పి బ్రాహ్మణ నామాన, పాంచాలా : పరికీర్తితా : శైవాగమము

27. పాంచాలుడు : శిల్పులకు పర్యాయ వాచకము : ఆంధ్రుల సాంఘిక చరిత్ర సారెకున్న ఒకటి పంచాణంబులు వారిజేరి+పరమ యోగి విలాసంపు53

28. అయస్కారుడు : కుమ్మరి

29. దారుణకారుడు - వడ్రంగి

30. తామ్రకారుడు : రాగిపని చేయువాడు

31. కాంస్య కారుడు : కంచరి, 32. తామ్రకుట్టకుడు : రాగి పని చేయువాడు

33. తామ్రోప జీవి : రాగి పనిచేయువాడు, 34. స్వర్ణకారుడు, 35. రుక్మకారుడు, 36. హేమకారుడు : కంసాలి - (రాజశేఖర విలాసము)

36. హేమకారుడు, 37. చిత్రకారుడు, 38. చిత్రకారుడు : బొమ్మలు వేయువాడు.

39. కార్మికుడు : పారిశ్రామికుడు, 40. కర్మారుడు : కమ్మరి, 41. కారువు : వడ్రంగి, 42. కృత్తు : పనిచేయువాడు, 43. కాంస్యకారుడు : కంచరి, 44. లోహకారుడు : కమ్మరి, 45. మాలాకారుడు : పూలమాల రచన చేయువాడు, 46. దర్పణకారుడు : అద్దములు చేయువాడు, 47. మణికారుడు : రత్నములను సానబెట్టెడు వాడు, 48. ఆచార్యుడు : శిల్పి శాస్త్రమునందాచార్యుడు.

49. జగద్గురు కులజుడు : జగద్గురువైన విశ్వకర్మకులమున జనించినవాడు=శిల్పి

జగముల లీలమైరచన సల్పగజాలు

జగద్గురూత్తముండగు భువనైక శిల్పి

(ధర్మపాల విజయం 3-119)

50. మేఘ వాహన = కులజుడు : మేఘవాహనుడైన విశ్వకర్మయొక్క కులమున బుట్టినవాడు

ఈ మేఘవాహకులజుల

ధీమహిమలు కార్యములు

ప్రదీప్త కళావి

ద్యామహిత మంత్ర శక్తులు

భూమికి సద్భుతములు

(ధర్మపాల విజయం. 3-17)

51. మేరువాస కులజులు : మేరు పర్వతము పై నివసించు దేవుడైన విశ్వకర్మ

యొక్క కులమున జన్మించిన వారు = శిల్పులు

52. రుంజలు : శిల్పులను యాచించి బ్రతికెడు జాతులు

53. పనసలు : శిల్పులను యాచించి బ్రదికెడి వారు

54. రుద్రపాదులు : శిల్పులను యాచించి బ్రతికెడివారు

55. సప్తమ కులజులు : విశ్వకర్మ వంశ్యులను చాతుర్వర్ణము వారి కన్న తక్కువ వారని చూపుమాటల

56. రత్నపారఖీ : నవరత్న పరీక్షకులైన శిల్పులు

57. వాస్తోష్పతి : వాస్తు పురుషుని పేరిట పూజింపబడు శిల్పాచార్యులు

58. కలుజులు : తెలుగు దేశమున శిల్పుల పరముగా వాడబడు ప్రాంతీయ శబ్దము

59. కంసాలి.
60. కమసలి
61. కమ్మసాలి
62. కంసలి బత్తుడు

(59–62) బంగారు పనిచేయువాడు

63. సొన్నారి - అచ్చతెలుగు మాట ; స్వర్ణకారుడు

64. సోనార్ - హిందీ ప్రాంతములలోవాడు మాట స్వర్ణకార శబ్దము నుండి వచ్చినది.

65. ఆగసాలి
66. అక్కసాలి
67. అవుసలి

(65–67) స్వర్ణకారుడు

నమ్మకు సుంకరజూదరి నమ్మకు మగసాలివానినటు వెలయాలిన్
నమ్మకుమంగడి వానిని నమ్మకు మీ వామ హస్తు నయమున సుమతీ॥
సుమతీశతకము

వెలయాలు చేయు బాసలు, వెలయగ నగసాలె పొందు వెలముల చెలిమిన్
కలలోగన్న కలిమియు, విలసితముగా నమ్మరాదు వినరాసుమతీ!
మేలెంచని మాలిన్యుని మాలను నగసాలెవాని మంగలి హితుగా
నేలిన నరపతి రాజ్యము నేలగలసిపోవుగాని నెగడదు సుమతీ! సుమతీ శతకము

68. కంచరి : ఇత్తడి పనిచేయువాడు

69. కమ్మరి : ఇనుపపని చేయువాడు

సరగమిన్నను కమ్మరి సంజకొలిమి
బెట్టుగాల్చి బంగారు చుట్టు వాలు పదను పెట్టంగ గొనిపోయి పట్టక
విడిచెనన బ్రొద్దుపడమటి కడలిమునిగె(యయాతిచరిత్ర)

70. వడ్రంగి
71. వడ్ల
72. వడ్లాబత్తుడు

(70–72) కర్రపనిచేయువాడు

73. కాసె : రాతి పనిచేయువాడు

74. కాసీ : కలయనాచార్యుల కాసీలనపుడు
పిలిపింపవారలు పెనుజన్నిదముల
చంకల శిల్పశాస్త్ర పుస్తకమ్ములు,
వంకవోజుట్టిన వలదు పాగలును
కొలది రేగలు వడికోసిన యెట్టి
యెలమించి నలకేలియినుపకమ్ములును

- తాళ్ళ పాక తిరువెంగళనాథ కవి  పరమయోగి విలాసం

75. జీనిగె : జీనిగె బెండు తోవాహనాదులు చేయు శిల్పి జాత్యంతరులు

76. సుతారి : తాపీ పనివారు, సూత్ర ధారి శబ్ద భవమీపదం

77. భీమాన్ : ఉత్తర దేశమున శిల్పులకు వాడు శబ్దము

78. జాంగిడ్ : జాంగల దేశోద్భవులైన శిల్పులను సూచించు శబ్దము, ఇదియు హిందీ ప్రాంతమునకే పరిమితం.

79. పేషీణీ హనుమంత బిరుదాంకితులు : విశ్వకర్మ కులజుల బిరుద వాచకము

## సందర్భ గ్రంథాలు

1. కాశ్యప శిల్పశాస్త్రమ్ -వినాయకవఝె : పూనా

2. కాశ్యపశిల్ప శాస్త్రమ్ - టి. ఎస్. ఎస్. ఎమ్. లైబ్రరీ, తంజావూరు

3. కాశ్యప శిల్ప శాస్త్రము - జ్ఞానానంద : బెంగుళూరు

4. మానసారశిల్ప శాస్త్రమ్ - టి.ఎస్.ఎస్.ఎమ్. లైబ్రరీ, తంజావూరు

5. మానసార సీరిస్ - డా॥ ప్ర.కు. ఆచార్య : అలహాబాద్

6. మయమతం - టి.ఎస్.ఎస్.ఎమ్. లైబ్రరీ, తంజావూరు

7. మయవాస్తువు - వావిళ్ల రామ స్వామి శాస్త్రి, మద్రాసు

8. సకలాధికారం - టి.ఎస్.ఎస్.ఎమ్. లైబ్రరీ, తంజావూరు

9. విశ్వకర్మీయం -గణపతి స్థపతి : మద్రాసు

10. సమరాంగణ సూత్రధార - తాళపత్ర గ్రంథాలయం : బరోడా

11. సమరాంగణ సూత్ర ధార - ద్వి.నా.శుక్ల : లక్నో

12. తంత్ర సముచ్ఛయం -కేరళ విశ్వవిద్యాలయం, తిరువనంతపురం

3. వాస్తువిద్యా : కేరళ విశ్వవిద్యాలయం, తిరువనంతపురం

14. అపరాజ పృచ్ఛా ప్రాచ్య విద్యాలయం, బరోడా

15. యంత్ర సర్వస్వం - జి.ఆర్. జోస్యర్, మైసూర్

16. విశ్వకర్మ ప్రకాశ - జి.ఆర్. జోస్యర్, మైసూర్

17. శిల్ప రత్నం -కేరళ యూనివర్సిటీ, తిరువనంతపురం

18. ప్రాసాద మండనం - చౌఖంబా - బనారస్

19. రూపమండనం - చౌఖంబా, బనారస్

20. ఈశాన శివగురుదేవపద్ధతి - కేరళ విశ్వవిద్యాలయం, తిరువనంతపురం

21. మానసోల్లాస - చౌఖంబా, బనారస్

22. అభిలషితార్థ చింతామణి - చౌఖంబా, బనారస్

23. నారతీయ శిల్పం - కలకత్తా యూనివర్సిటీ, కలకత్తా

24. పరశివ విశ్వకర్మాగమం - మద్రాస్

25. గార్గేయాగమం - తాళపత్ర గ్రంథాలయం, మద్రాస్

26. విశ్వబ్రహ్మ కులోత్సాహ (మరాఠి) - నారాయణ శాస్త్రి క్షీరసాగర్ : పూనా

27. కామికాగమం - ప్రాచ్య పరిశోధనాలయం, పాండిచ్చేరి

29. అజితాగమము - ప్రాచ్య పరిశోధనాలయం, పాండిచ్చేరి

30. సుప్రభేదాగమం - ప్రాచ్య పరిశోధనాలయం, పాండిచ్చేరి

31. విష్ణుధర్మోత్తర పురాణం - క్రమీష్, బరోడా

32. వాయుపురాణం-చౌఖంబా, బనారస్

33. కాశ్యప జ్ఞానకాండ - పార్థసారథి భట్టాచార్య, తిరుపతి

34. మరీచివిమానార్చనాకల్ప - పార్థసారథి భట్టాచార్య, తిరుపతి

35. భృగుసంహితా - పార్థసారథి భట్టాచార్య, తిరుపతి

36. సమూర్తార్చనాదికారః - పార్థసారథి భట్టాచార్య, తిరుపతి

37. అత్రేయతిలకం - పార్థసారథి భట్టాచార్య, తిరుపతి

38. మాత్స్య పురాణం - చౌఖంబా, బనారస్

39. శ్రీమద్భాగవతం - గీతాప్రెస్

40. హయశీర్షపాంచరాత్రం - ఢక్కా

41. విష్వక్సేన సంహితా -ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి

42. శ్రీప్రశ్న సంహిత - కుంభ కోణం - 1904

43. ఈశ్వర సంహిత - కాంచీపురం - 1923

44. కాపింజలసంహితా - కడప 1896

45. మార్కండేయ సంహిత - తిరుపతి

46. నారదీయ సంహితా - అడయార్, మద్రాస్

47. పరమ పురుష సంహిత - భద్రాచలం 1798

48. పారమేశ్వర సంహిత - శ్రీరంగం - 1953

49. పౌష్కర సంహిత - బెంగుళూర్ 1984

50. పురుషోత్తమ సంహితా - భద్రాచలం 1932

51. సాత్వత సంహితా - కాంచీపురం 1902

52. విష్ణు సంహితా - తిరువనంతపురం 1902

53. విష్ణుతంత్ర - తిరువనంతపురం 1925

54. విష్ణు తిలకం - బెంగుళూర్ 1986

55. పద్మసంహితా - జీయర్ భద్రాచలం

56. అహిర్బుధ్న్యసంహితా అడయార్ 1916

57. వైనతేయసంహిత - పత్రాత్మకం

58. శ్రీమన్నారాయణ సంఇహిత - తిరుపతి 1965

59 [illegible]యూఖ్య సంహిత - బరోడ

60. బృహద్బ్రహ్మ సంహిత - ఆనందాశ్రమ్, పూనా

61. చతుర్వర్గ చింతామణి - చౌఖంబా - బనారస్

62. బృహత్సంహిత - చౌఖంబా, బనారస్

63. మనుష్యాలయ చంద్రికా - తిరువనంతపురం

64. వాస్తు శాస్త్రం - చౌఖంబా, బనారస్

65. విశ్వవిద్యాభరణం - బసవాచార్యస్వామి

66. రథకారాధికరణం - బసవాచార్యస్వామి

67. విశ్వకర్మాన్వయ ప్రదీపికా - గొన్నాభత్తుల వరాహ నరసింహాచార్య

68. బ్రహ్మాండ దీపికా - తాళపత్ర గ్రంథాలయం, మైసూర్

69. రథ లక్షణం - తాళపత్ర గ్రంథాలయం, మైసూర్

70. అర్థ శాస్త్రమ్ - శ్యామశాస్త్రి, మైసూర్

71. చాణక్య నీతి సూత్రాణి - చౌఖంబా, బనారస్

72. శతపథ బ్రాహ్మణం - చౌఖంబా, బనారస్

73. గోపథ బ్రాహ్మణం - ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి

74. ఆర్షేయ బ్రాహ్మణం - ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి

75. సిద్ధాంతకౌముది - చౌఖంబ, బనారస్

76. బాలమనోరమా - చౌఖంబా, బనారస్

77. ప్రౌఢ మనోరమా - చౌఖంబా,బనారస్

78. వ్యాకరణ మహాభాష్యమ్ - చౌఖంబా, బనారస్

79. ఈశోపనిషద్ భాష్యమ్ - వెంకటరామాచార్య సౌపర్ణ, నూజివీడు

80. శిల్పోపనిషద్ -జి. జ్ఞానానంద,బెంగుళూర్

81. వాస్తు సూత్రోపనిషద్ - అలిస్ బోనర్, బనారస్

82. వాస్తు సూత్రోపనిషద్ భాష్య - డా. పె. నాగేశ్వరరావు, హైదరాబాదు.

83. వాస్తు సూత్రోపనిషద్ భాష్య - సోమపీఠ్, పూరీ, ఒరిస్సా

84. శిల్ప ప్రకాశికా - డా. ఆలీస్ బోనర్, బనారస్

85. వాత్స్యాయనకామ సూత్రం - జయమంగళ వ్యాఖ్యా, బనారస్

86. కామకలావిలాసం - తాంత్రిక గ్రంథాలయం, కలకత్తా

87. రుద్రయామళవాస్తు తంత్రం - తాంత్రిక గ్రంథాలయం, కలకత్తా

88. గోత్రసూత్ర కదంబం - చౌఖంబా, బనారస్

89. విశ్వజ్ఞ స్మృతి - యు. ఆంజనేయ శాస్త్రీ - తెనాలి

90. గోత్రాది సంధ్యానందనర్పణం - చ వీరబ్రహ్మాచార్య తెనాలి

91. ప్రతిష్ఠా సర్వస్వం - చౌఖంబా, బనారస్

92. ప్రతిష్టా మందారం - చౌఖంబా, బనారస్

93. కుండమండపవిధి - చౌఖంబా, బనారస్

94. స్కాంద నాగరఖండం - చౌఖంబా, బనారస్

95. ప్రతిష్ఠామయూఖం - చౌఖంబా, బనారస్

96. అమరకోశ :- చౌఖంబా, బనారస్

97. వాచస్పత్యమ్ - చౌఖంబా, బనారస్

98. శబ్దకల్పద్రుమమ్ - చౌఖంబా, బనారస్

# అధ్యాయం 25

## శిల్పము : కొన్ని పదబంధములు

అంగదట్టము
అంగన్యాసం
అంగప్రదక్ష
అంగబళ్ల
అంగరంగ భోగములు
అంగరంగ వైభవము
అంగరక్ష
అంగవస్త్రం
అంగుష్ఠ మాత్ర్యుడు
అంచనా వేయు
అంచ పదము
అంచించు
అంచు ముట్టడి
అంచుల వాడు
అంచులు తీరిన వయసు
అంచెలంచెలుగా
అంజనమున మాటలో నేల
అంజలి చేయు
అంటకత్తెర వేయు

అచ్చునిలుపు
అచ్చుపడు
అచ్చుపడినట్లే
అచ్చుపాడిచిన
అచ్చుపోసిన యాంబోతు
అచ్చుపోసి వదలు
అచ్చుమచ్చు
అచ్చుముచ్చు ఎఱుగ
అచ్చులు పెట్టించు
అచ్చులొత్తు
అచ్చులో లేదు
అచ్చుపడు
అచ్చువేయు
అటకలు నాకు
అడ్డ
అద్దపునీడ
అద్దకుంబోచు
అద్దములాగ
అద్దములోనీడకానపడు

| | |
|---|---|
| అంటుజాయి | అనంతశయనం |
| అందలంబులు | అఱచేతి మాణిక్యము |
| అంపకాల | అఱచేకింది |
| అక్కుగొర్జు | అఱచేతిభోగ్యంలో |
| అక్షమాల | అఱచేతి ఉసిరికాయ |
| అఖండదీపారాధన | అలివేణి కుంజలు |
| అగసాలెనిజము | ఆకారపుష్టి - నైవేద్యనష్టి |
| అగ్రతాంబులం | ఆకాశచిత్రం |
| అగ్రాసనం | ఆసుబోసేడు దానిహస్తంబు రీతి |
| అబ్బుకట్టు | ఇంటికంటె గుడి భద్రం |
| అచ్చుగుద్దినట్లు | ఇంటికాపు |
| అచ్చుబెద్దు | ఇంటికొస్తుండం వాటికికొస్తుందా |
| ఇనుపతెర | కంచి గరుడసేవ |
| ఇనుమడికూడికి తగరమాడిచుటెంత | కంచియే దూరమా |
| ఇనుము గూడియున్న అగ్నికినిప్పుపెట్టివచ్చు | కంచుకంఠం |
| ఇనుమోజాయో | కంచుకొమ్ము |
| ఇనుపరాయిగాలికిపోయినట్లు | కంచుగీసినట్లుండు |
| ఉంకుటుంగరము | కంచు పదును |
| ఉక్కీడు | కంచు రాయి |
| ఉక్కుతునక | కంచుక్డో |
| ఉక్కు రుడుగు | కందెన వేయి |

| | |
|---|---|
| కుంచె కోల | చిత్తరించు |
| కుమ్మరావము నరాగి | చిత్తరు వోమ్తయు |
| మురకలేరు | చిత్తరిపని |
| గండపెండేరము | చిత్తుళిపని |
| గండరించిన బొమ్మ | చిన్నమెత్తుపని లేదు |
| గడప త్రొక్కుట | చెకుముకిరాయి |
| గడపలో కాలు పెట్టుట | చెక్కతాపీ |
| గాజుపాటు | చెక్కు చెదరక |
| గాజుపూసకు బంగారు పొదుగు | చెక్కిలినొక్కు |
| గాజుకిన్నరులు | చెల్లని కాసు |
| గాజులు తొడుగు | చెడుతిరిగిన వాడు |
| గాజులు పెద్ద రోకలి దాచినట్లు | తగరము వాడిసేయు |
| గాజులవెరికదున్న | తగుకత్తి |
| గాజులవాని మర్యాద | తలకట్టు |
| గుడిముద్ర వేసుకొను | తళుకెక్కు |
| గుడిమేళము కాదునగరి మేళము | తళుకొత్తు |
| గుడి మ్రింగేవానికితలుపు లప్పడాలు | తళుకు బెళుకులు |
| గుడివడు | తిరుమణి |
| గుడిసేటు | తిరుచురము |
| ఘంటాపథము | తిరువడికోల |
| ఘట్టకుట్టి ప్రభాతం | తునికోల |

చంద్రగోళి

చంద్రవంక

చక్కీ మంచం

చచ్చదరము

చచ్చైకము

చట్టితోచట్టి పగుల గొట్టు

చట్రాతిపై గ్రుంక నేర్పు

దీపంపెట్టు

దీపకం బములు

దీపాలార్చేవాడు

దీపారాధన సేయు

నాగవాసము అంతఃపురజనం

నాగ బెత్తం

నాగపడగలు

నాగపసాని : నాగపల్లె ముతెంచిన

నిరాళి పళ్లెము

నిజానీదారు

నీ యిల్లు బంగారం

నీరు కారు

నీరుకావి

నీరు కాసులు

తులాదానం

తూగుటుయ్యాల

తూగుదివియ

తూగు వలక

తూగు మంచము

దళకొను

బంగారుచేయి

బంగారం లాంటి

బంగారువాన

బొమ్మించు

బొమ్మగట్టగజాలు

బొమ్మ మెట్టు

మరగాలు

మరగొమ్మ

మరచుట్టు

మరమేకు

ముంజేతి కంకణం

ముంజేతి కంకణాని కద్దమెందుకు

ముంజేతి దర్పణం

ముక్కలి

పసుపు కాళ్ళ

పంచతిన్నె

మేలపూస

మేటు కట్టు

మొగవాడ

పుస్తె గట్టు

మొలనూలు

యాత్రసంచి

పూజెకుండలు

పరాజీ పేట

బంగారం వంటి మనసు

బంగారంగా

బంగారంవంటి వాడు

బంగారపుబొమ్మ

బంగారానికివన్నెపెట్టినట్లు

బంగారం వంటి ప్రాయం

బంగారము

బంగారు కాళ్లు

బంగారుకుండ

ముద్దకవ్వము

పందిరిమందిరమగునా

పందిమెట్టు

పదియార్వన్నె పసిడి

పురము వేయు

మొగసాల

పుస్తె మడపు

యోగ పట్టె

రచ్చబండ

రత్న కంబళము

రత్నమువంటివాడు

రోకటిపోటు

స్వర్ణకవచం

విగ్రహపుష్టి

విశ్వామిత్రసృష్టి

శిలాశాసనము

సజ్జపట్టు

సముకట్టు

# అధ్యాయం 26

## శిల్పము : సామెతలు

1. అందానికి గోవింద గంతలు
2. అందానికిపెట్టిన సొమ్ము ఆపదకు వస్తుంది.
3. అందానికి రెండు సంబంధాలూటకు రెండు తప్పెట్లు
4. అందానికి రెండు బొందులూటకురెండు తాళాలు
5. అందాల పురుషుడికి రాగి మీసాలు
6. అరవ చెవుల కేది అరిది వజ్రపు కమ్మలు
7. ఆడచెత్త మగ బంగారం
8. ఇత్తడిపుత్తడి కాదుతొత్తు దొర సానికాదు
9. ఇనుప గుగ్గిళ్ళు కాని మినప గుగ్గిళ్లు కావు
10. ఇరుసునకందెన బెట్టక పరమేశ్వరు బండియైన పారదు
11. ఇల్లు కట్టిచూడుపెళ్లి చేసి చూడు
12. ఊరికళ గోడలేచెబుతాయి.
13. ఎదురుగుండా అద్దముంటే ఎక్కిరించుకోబుద్దవుతుంది.
14. కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా
15. కంసాలిఇంటికెడితేబంగారమంటదుగాని కుమ్మరివాడి ఇంటికెడితే మాత్రం మట్టి అంటుకుంటుంది.
16. కంసాలి ఎల్లిచాకలి మల్లి

17. కంసాలి కూడు కాకులు కూడా ముట్టవు
18. కంసాలి గోటు కరణం తేటు
19. కంసాలి పెళ్లికి ఇల్లంతా పొయ్యిలే
20. కంసాలి బఱ్ఱెనమ్ముతున్నాడు లోపల లక్కలేకుండా చూడు అన్నాడట
21. కంసాలి మాయ కంసాలికిగాని తెలియదు
22. కంసాలివద్దనైనా ఉండవలె కుంపటిలోనైనా నుండవలె.
23. కంసాలిలేకుండా చూచి కథ చెప్పమన్నాడట
24. కంసాలి వారు కాలానికి పెళ్ళికొడుకులు కరువుకు కాచీ పీనుగులు
25. కమ్మరి వీధిలో సూదులమ్మినట్లు
26. కవికి కంసాలికి సీసం తేలిక
27. కాంచనం కర్మ విమోచనం
28. కాంతాకనకం,కశ్యపులే కయ్యాలకుమూలం
29. గుడి చిన్నదైనాగుళ్లో దేవుని మహిమ మిన్న
30. గుడిమింగేవానికి గుళ్లో లింగంఉత్రవడియం
31. గుడ్డివాడెరుగునా గురుతైనరత్నంబు
32. చింతాకంత బంగారం మెడ చుట్టూ తీగ కావాలన్నట్లు
33. తల్లిపుస్తె బంగారమైనా అగసాలి దొంగిలించకుండా ఉండలేడు
34. తెగితేలింగడు ఊయి
35. దేవళం మింగే వాడికి ధ్వజస్తంభం లొటా లొటా
36. బంగారం కొద్దీ సింగారం
37. బంగారం పోయిన తర్వాత బట్ట చుట్టమా?

38. బంగారం పట్టితేమన్నుమన్ను పట్టితే బంగారమైనట్లు
39. బంగారపు పళ్లానికైనా గోడ చేర్పుండవలె
40. బంగారముంటే సింగారానికేమి కొదవ
41. బంగారినికితావిఅబ్బినట్లు
42. బంగారం కరగను వెలిగారం తప్పనట్లు
43. బంగారుకే రంభ చిక్కుతుందా?
44. బంగారుగాలానికిబంగారు చేపలు పడవు
45. బంగారం చెప్పులైనాకాళ్లకేతొడగాలి
46. బంగారం పొల్లున్నది గాని మనిషికి పొల్లు లేదు
47. బంగారం బాగుగా పది వన్నె గాకుంటేఅంగలార్చుచు వాడుకోనేల
48. బంగారు మనిషి ఊరేగడానికివెడితే, ఇదే సందని, భజంత్రీలుపారిపోతుందరు
49. బంగారు వంటికోమటి సంగీతము చేత బేరసారములుడిగెన్
50. ముంజేతి కంకణానికద్దమెందుకు?



# అధ్యాయం 27

## శిల్పము నిత్యవ్యవహారములోని కొన్ని శబ్దములు

### ఇల్లు

ఇల్లు నొక ముఖ్యమైన శిల్పముగా సమాజం స్వీకరించింది. ఈ ఇల్లు అనే శబ్ధిన్ని కేంద్రబిందువుగా తీసుకొని అనేక పలుకుబడులు బయలుదేరాయి. అందులో కొన్ని చూడండి.

ఇది ఇల్లు, ఆమె ఇల్లాలు, వీడుఇంటివాడు, ఆయన ఇంటాయన, ఇది ఇల్లూరు, ఇది ఇల్వరుస, మీరు ఇంటిల్లిపాది పెండ్లికి రావలెను. ఆమె ఈ ఇంటావిడ, ఈ రోగం ఇంటావంటా లేదు, ఇతనికి ఇంటికంటే గుడి భద్రం, ఇతనికి ఇంటికన్న గుడి పదిలం, వీడు ఇంటకాడు, ఇది ఇంటికి కాకపోదు, ఇలా ఇంటికి ఇల్లుగట్టుకొని ఏగుతారా?, వీళ్లు ఇంటి కుక్కలు, ఈ పని ఇంటికొస్తుందా, వాకిటికొస్తుందా? ఇది ఇంటిచాయల్లో పెరిగిన మొక్క, వారి ఇంటితనం (కులీనత) గొప్పది. అతడు ఇంటితనస్తుడు, ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడు, వేసవిలో ఇంటిపట్టున ఉండుట మంచిది, అతడు ఇంటి పట్టు ఎరుగునా? ఇంటి పనులు చేయుటలో నేర్పరి, ఆమె ఇంటిపనులు చేయుటలో నేర్పరి.

ఆమె ఇంటి పాప, వీరి ఇంటి పేరు శ్రీరామవారు, ఇంటిపేరు కస్తూరి వారు ఇంట్లో గబ్బిలాల వాసన. జగడం ఇంటిపైకి తెచ్చుకొనుట తగునా?

ఇంటి బల్లియుచేతసేయు, ఇంటిబిడ్డ, ఇంటమగడు, ఇంటియాతడు, ఇంటియాలు, ఇంటి ఎనుబోతునకంటెమదంబు హెచ్చు, ఇంటివాడు వంశీకుడన్న అర్థమున, ఇంటివారిని లేపి యీవల దొంగబంటుకు చేయి ఇంటిలో దీపం పెట్టు, ఇంటిలోన గుండ్రించుచుండిన కడుపునిండునే ఇంటిలోనేదుముల్లగు ఇంటిలో పోరు, ఇంటిలో భద్రం, ఇంటి వేల్పు, ఇంటి ఇల్లాలు శుద్ధి, ఇంటిసాలు, ఇంటపడు

ఇండ్లనెత్తిన దీప శిఖలు, ఇల్లుడించి, ఇలుతీర్చు, ఇల్లుదొర, ఇలునెత్తిగట్టుకొని పోవగర్గుదురె, ఇలుపట్లు, ఇలుతేడు, ఇలువడి, ఇలువరుస, ఇలువాడు, ఇలుపుట్టుదాసి, ఇలుపుట్టుగొంతి × బానిస, నిలువుట్టు చిన్న = దాసి కొడుకు, ఇలువెడలు, ఇలు వెళ్లనీక, ఇలువేల్లుపు, ఇలుసూఱగా, ఇలుసూఱవిడుచు, ఇల్కఅచు ఇల్లంద్రకము, ఇల్లటము, ఇల్లటపట్టుడు, ఇల్లధనము, ఇల్లడపెట్టు, ఇల్లడమ్ పెట్టు, ఇల్లడమానిసి, ఇండ్ల సొమ్ము, ఇల్లోనారాయణమ్మ, ఇల్లతికము, ఇల్లాలికి ముగ్గుపెట్టు, ఇల్లాది : ఇంటిల్లిపాది

ఇల్లాదివోపు= అందరూ వెళ్లు, ఇల్లామె, ఇల్లామల్లి, ఇల్లాలితనము, ఇల్లాలు. ఇల్లావల్లి : చిల్లావల్లి అయిన ప్రయోగాంతరము, ఇల్లు కట్టుకొను = శాశ్వతంగా, ఇల్లు కశలం, ఇల్లుకాలా, ఇల్లుగడుచు, ఇల్లుగడచు, ఇల్లు గుల్ల సేయు, ఇల్లు చూడు, ఇల్లు చెఱచు, ఇల్లు చేరుకొను, ఇల్లుటాలు, ఇల్లుదోచిపెట్టు, ఇల్లు సడువు ఇల్లు నిలుపుకొను, ఇల్లునిల్పు, ఇల్లు బావురమను, ఇల్లును ముంగిలిజీతమ్మిగా, ఇల్లును వాకిలి చూచుకొనుచు, ఇల్లు నెత్తిగట్టుకొనిపోవు, ఇల్లు పట్టుకతిరుగు, ఇల్లు పట్టిన : (పుట్టింటికి తిరిగివచ్చిన వెధవరాలు విషయంలో ప్రయోగం.) ఇల్లు పట్టువిడుచు, ఇల్లు పెరికి పందిరివేయుకేకలు చేయు. ఇల్లు బంగారమగు ఇల్లు వాడు ఎఱుగని : అమాయకుడు, ఇల్లుఇల్లాలూ. ఇల్లూ పెళ్లాం ఇల్లూరు, ఇల్లూ లేదు వాకిలీ చూచుకో ఇల్వడీ : కులీనత, ఇల్వరుస, కులీనత, చెవిలో ఇల్లుకట్టుకొని చెప్పాను, ఇంటి గుట్టులంకకుచేటు, ఇంట్లో ఈగల మోత బైటపల్లకీల మోత, ఇల్లు ఇరకటం ఆలి మరకటం, ఇల్లలకగానే పండగైపోతుందా ఇల్లుకట్టిచూడు పెళ్లిచేసి చూడు, ఇల్లు చూసి ఇల్లాల్ని చూడు, తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టడం,అయ్యగారికి పెద్దిల్లూ చిన్నిల్లూ ఉన్నాయిట, ఇంట్లో దీపం ఉండగానే సర్దుకోవాలి. ఇలువరుసా పలువరుసా, ఇంటికి దయ్యమై పట్టాడు. ఇల్లు నిలిపాడు. ఇంటి వాకిలికి బొట్టుపెట్టు, ఇంటి పెద్ద, ఇల్లూ వాకిలీ, ఇంటి పెరడు, దొడ్డిదోవ.

## పునాది

ఇల్లు కట్టబోయే ముందు పునాది తీయడం మొదటికార్యక్రమం. దీన్ని ఆధారం చేసుకొని లోకవ్యవహారంలోకి వచ్చిన ప్రయోగాలు చూడండి. (శాస్త్రంలో

దీన్ని ప్రథమేష్టికా స్థాపనం శంకుస్థాపనం / శిలన్యాసం అనే పేర్లతో వ్యవహరిస్తారు. వివరాలకు కాశ్యప శిలా శాస్త్రం 4వ పటలం)

1. వీడి చదువుకు పునాది చాలదు
2. తిలక్‌గారు మన స్వాతంత్ర్యోద్యమానికి పునాది వేశారు
3. పునాది గట్టిలేకపోతే భవనం నిలవదు
4. ఆయింటికీర్తి సౌధానికి వీడి జీవితం పునాది రాయి అయ్యింది
5. ప్రపంచ యుద్ధం కారణంగా మన ఆర్థిక పునాది సడలింది
6. మంత్రిగారు పునాదిరాళ్లు వేసిపోతారు. కాని నిర్మాణం ఎదగలేదు.

## స్తంభం

1. గాంధీగారు స్వాతంత్ర్యోద్యమానికి మూలస్తంభమైనారు
2. వాడు ధ్వజస్తంభంలా నిలబడ్డాడు.
3. వాడు స్తంభంలా నిలబడ్డాడేం?
4. వీడు పందిరి గుంజలా ఉన్నాడు
5. వీడా గుంజగాడు (నిందార్థం)

1. వాడు ఈ ఊళ్లో జెండా పాతాడు (స్థిరపడ్డాడు)
2. రామయ్య కృష్ణయ్యపై జెండా ఎత్తాడు (వైరం ప్రకటించండి)
3. వ్యాపారంలో సుబ్బయ్య జెండా ఎత్తేసాడు (నష్టపోయాడు
4. వాడు జెండాపై కపిరాజు లాంటి వాడు(చిలిపివాడు అనే అర్థంలో)

## గోడ

1. ఊరి కళ గోడలే చెబుతాయి
2. అబద్ధం అడితే గోడపెట్టినట్లుండాలి.

3. గోడకు వేసిన సున్నమూ వేశ్యకిచ్చిన విత్తమూ తిరిగిరాదు.
4. ఒక స్త్రీ అబద్ధం ఆడితే గోడపెట్టినట్లే ఉంటుంది.
5. అంతరాల గోడలు పడగొడితేనే ఐక్యత సంభవించేది
6. మంచి చిత్రం వేయాలంటే గోడ బాగోవాలిగా!

## తలుపులు

1. గుడిమ్రింగే వానికి తలుపులప్పడాలా
2. తలుపులు జాగ్రత్త
3. ఆయింటికి తలుపూ ద్వార బంధాలూ లేవు
4. ఆమె ఎప్పుడూ తలుపు కొస్తూనే ఉంటుంది.
5. తలుపుకిరుకనకుండా ఇంట్లోకి వెళ్లు

## ఇంటి ఇతర వస్తువులు

1. ఆ యింట్లో దివ్వెకంబం చూడు
2. దివ్వెకోల వెలుగుతూంది
3. దోరణపు కమ్మి
4. దోరణపు పట్టి
5. నాగదంష్ట్రం చూడు
6. నాగదంతం
7. నాగ బెత్తం - మాంత్రికునిచేతి బెత్తం
8. నాగరికం - నాజూకైనది
9. నాగవాసం - అంతఃపురజనం

# మంచం

1. మంచము గల్గిననాడే నీళ్లాడుట : అన్నీ ఉన్నపుడే కార్యము నెరవేర్చు
2. మంచపు దొడుగఅయగు : రోగగ్రస్తుడగు
3. మంచం క్రింద సూయి : కనబడని ప్రమాదం
4. మంచం పట్టాడు - జబ్బుపడ్డాడు
5. మంచమెక్కాడు - జబ్బు పడ్డాడు

# కడప

1. కడపదాటు
2. కడపత్రొక్కకుండా వచ్చు
3. కడప దాటుట

# ఉట్టి

1. ఉట్టి కట్టుకొని వ్రేలాడుట : ఉత్సుకుడగుట
2. ఉట్టికెక్కుట - మూలబడుట
3. ఉట్టిగట్టుకొని ఊగుట - అపహాస్యము చేయుట
4. ఉట్టిగట్టుకొని ఊగుట - అత్యాశతో ఉవ్విళ్లూరుట
5. ఉట్టిగట్టుకొని ఊరేగుట - ఉబలాటపడుట
6. ఉట్టిగట్టుకొని వ్రేలుట - ఉవ్విళ్లూరుట
7. ఉట్టిచ : రెండు వైపుల తల ఉన్నచీల
8. ఉట్టి చేర్లు తెగుట - అధఃపతనమగుట
9. ఉట్టిలో పెట్టిన గుమ్మడి కాయవలె : కదలక మెదలక
10. ఉట్టిపడు : అకస్మాత్తుగా వచ్చు
12. ఉట్టెక్కు - మూలపడు

## కొంప

ఇల్లు అనే మాటకు మరో రూపం కొంప. ఈ రెండూ దేశీయ పదాలే, సమానార్థకాలే అయినా ఈ శబ్దాన్ని మాత్రం కొంత నిరసనం సరసనే వాడటం కద్దు. యీ శబ్దాన్ని ఆధారం చేసుకొని వెలువడ్డ పదప్రయోగాలు చూడండి!

1. కొంపకు నిప్పు పెట్టు, 2. కొంప కూల్చు, 3. కొంప గుండమగు, 4. కొంప గుల్లచేయు, 5. కొంప చెఱచు, 6. కొంపతీయు, 7. కొంపదీసి (ఉపస్కారపదం), 8. కొంపనట్టేటిలో గట్టు : కూడని పనిచేయు, 9. కొంపమీద పడి తిను, 10. కొంపముంచు, 11. కొంపమునిగిపోవు, 12. కొంపమునుగు, 13. కొంపమ్ముకొను, 14. కొంపలంటుకొను, 15. కొంపలార్పు - కొంపలు తీయు, 16. కొంపలు కాల్చు, 17. కొంపలార్చు, 18. కొంపలు ముంచు - ఇతరులను నమ్మించి సర్వనాశనం చేయు, 19. కొంపలు ముట్టించే కొఱివి : తగాదాలు పెట్టేరకం, 20. కొంపా గోడూ లేదు : ఆస్తిలేదు.

## ఒళ్లు

భగవంతుడు సృష్టించిన శిల్పమీ శరీరం. దీన్ని గమనించిన మానవుడు శరీరమూ - శరీర భాగాల్ని ఆధారం చేసుకొని ఎన్నో పదబంధాలు వాడాడు. వాటిలో కొన్ని చూడండి.

## శరీరం

1. తనుయాత్ర : జీవయాత్ర, 2. తనుయాత్ర చాలించు : మరణించు, 3. తనువెల్లకన్నులై, 4. తనువెల్ల చేతులై, 5. తనువెల్ల మనసై, 6. తనువెల్ల వీనులై, 8. తనువెల్ల శరమై

## తల

తలంటు - అభ్యంగన స్నానం; తలంటుకొను, తలంటుపోసుకొను, తలంబ్రాలు, అక్షింతలు, తల అడుమానం పెట్టి అయినా, తల తనఖా పెట్టి

అయినా తల అమ్ముకొను, పరాధీనమగు, తల అర్చుకొను : వెంట్రుకలార్చుకొన
తల ఎగకట్టు : వయసువచ్చు, తలకంటుగాదు : ఇష్టము లేకపోవు, తలకట్టు
కేశబంధము, తలకట్టుగా : శిఖర ప్రాయముగా, తలకడచు : అతి శయించ
తలకడుగు - తలంటు స్నానము, తలకదల్చు : తల ఊచు : రక్షించు, తలకాం
: ఉదాసీనంగా వాడే మాట, తలకాయ నొప్పి : విసుగు, తల క్రిందుగ పడు
తలక్రిందులగు, తలక్రిందుగానడుచు, తలక్రింది బ్రతుకు అస్తవ్యస్త జీవిత
తలకీలు పుచ్చు : ప్రధానమైన కీలును తెఱచు, తలకుంటే ఏనుగున పొయ్యేవా
పొగరుబోతు, తలకు చెప్పులడుగు : క్రొవ్వెక్కి మాటలాడు, తలకుదవపెట్టియైన
ఎన్ని అవస్థలు పడి అయినా, తలకుపోసుకొను, అభ్యంగ స్నానము చేయు, తల
మించినపని : అసాధ్యమైనపని, తలకు మించిన బరువు : అతిభారము, తల
మిగులు : పెక్కగు, తలకుమీరు : తల మీరు, తలకు వేస్తే మొలకు/మొల
వేస్తే తలకు : ఏదోవిధంగా వాదన చేస్తూ ఉండేవారి విషయంలో వాడేది, తలకూ
కలుగు, తలకెక్కిన విషము : శరీరమంతా వ్యాపించిన విషం, తలకెక్కు
అధికమగు, తలకెడవగు తలక్రిందులగు, తలకెడవుడు : తలక్రిందగు, తలకెత్తుకొ
: నెత్తిన వేసికొను, తలకొకమాటగా : నోటి కొక మాటగా, తలకొట్టించుకొను
తలతిరుగుడు కలిగి ఉండు, తలకొట్టి మొలవేయునా, తలకొట్టి వేసినట్లు
అవమాన కరమగు, తలకొట్టుకున్నట్లు విసుగు కల్గించు, తలకొట్లమారి పెడసర
మనిషి, తలకొత్తూ అనుమానించు (మార్కం), శవానికి తలకొఱవిడు - అగ్గిపెట
గౌహరి, తలకొఱవి పెట్టే దిక్కు -ఆత్మీయుడు తలకొలుపు, లగ్నము చేయు
తలక్రొవ్వు : తల పొగరు, తల ఖాళీ అగు శూన్యమగు, తలగంప, తలపై గం
తలగుండుగండ - శత్రువు (తాళ్లపాక) తల గుడ్డ రుమాలు, తలగూడు, నెత్తిన పడ
(గౌహరి) తలగోను - ధరించు (సాంబో), తల గొరిగించి పంపు, అవమానించి పంప
తలగీకికొను : ఆలోచనలో పడు, తలగోయు, చంపు, తలచముదు : తల నూ
తలచాటు : రక్షణ, తల చావడి : ఇంటి ముందు చావడి తలచిన తలపులు త
కూడినట్లు - కోరికలన్నీ తీరినట్లు, తలచినపుడే తాత పెండ్లి : వెంటనే పనికావాల
సూచన, తలచీర : తలపాగా, తలచీర ఎరగనిదశ : మైమఱచిన స్థితి, తలచీరపాటించ
: శిరస్త్రాణము పెట్టుకొను, తల చీరపడినవాడు : శిరస్త్రాణము లేనివాడు, తలచీ

- ఏతపుచీల, తలచుట్టు, తలపాగా తలచుట్టు : తలపాగా, (భారతం)

తలచూపు : కలుగు, తలచెడు, భయపడు, తలడించు : జంకు, తలడిల్లు : భయపడు, తలతంత్రము : ముందుకు నడిచే సైన్యం, తలతగులు : అనుభవమునకు వచ్చు, తలబొప్పికట్టినది : తలతడిమి చూచుకొను : శాస్తి ఐన సూచన, తలతనఖా పెట్టి అయినా : ఎన్ని కష్టాలు పడి ఐనా, తల తల : ఒక్కొక్కరికి తలతల కొట్టుకొను, తలతల వెలుగు : మెరియు, తళతళ వెలుగు : తలతాకట్టు పెట్టి, తలత్రిప్పు : మైకంతో తల తిరుగు, తలతిరిగినా నోటికి కబళము వచ్చు : శ్రమపడినా ఫలితం పక్కు, తలతిరుగుడు : తలపొగరు, తలతీసి మొల వేస్తాడా : వాడేం చేస్తాడు అనే అర్థంలో, తలతీస్తాడా? తల తెగగొట్టు : తల ఖండించు, తల తొలగివేయు : దిగులు వేధజంచు, తల త్రాడు : పశువుల కొమ్ములకు కట్టే త్రాడు, తలత్రాణము . చేజోడు, తలదండ : సీమారక్షకము, తలదన్ను : అతిశయించు, తలదాకు : అనుభవమునకు వచ్చు, తలదాచికొను : రక్షణ కల్పించుకొను, తలదాచుకొనే చోటు : ఆశ్రయము, తలదాటు : మించు, తలదించుకొను : అవమానంతో తలదుడ్డు : చేతి కర్ర, తలగువారము : ముఖద్వారము, తలదూర్చుకొను : ేపతాసూచకం, తలదిగపడి అప్పుదీర్చు : ప్రాణమిచ్చైనా అప్పుదీర్చు, తల ద్రొక్కు : ఎక్కు, తల ధరించు : శిరసావహించు. తలనట్టు : వేరుపురుగుకొట్టి ఎండినమోసులు, తలనడ్చికొనుడు : మీ తల మీదేవేసుకోండి అనే విసుగు సూచకం, తలనిండగనర్థము పోసినను : నిలువెత్తు ధనం పోసినా, తలనిక్కు : గర్వము, తలనుగొట్టికొను : నెత్తిన వేసికొను, తలను నరములతో పెరుకు : దారుణంగా శిక్షించు, తలనొప్పి : సరిపడనిది, తలనోరు మొత్తుకొను : నెత్తినోరు కొట్టుకొను, తలపండు : తల, తలపండు పగలా : చావరా అనే అర్థంలో ఒక తిట్టు, తలవంపు లుడుపు : మెడవంపులు తోము, తలపట్టకపోరు : దిగులు పడక పోరాడు, తలపట్టి చూచికొను : దెబ్బతగిలినదేమోనని తడువుకొను, తలపట్టుకొను : సిగపట్టుకొను, తలపట్టు వేసుకొను, తలపట్లా సిగపట్లా అగు. తలపడు : ఢీకొను, తలపని : క్షవరం, తలపని చేయించుకొను : క్షౌరం చేయించుకొను, తలపని తలపుగా : అకస్మాత్తుగా, తలపరిగె : ఊటకాలువకు అరంభ స్థానం, తలపరువు : యోగ్యత, తలపాగా : పాగా, తలపోటు : ఆశ్రయము, తలపాలు : శిరోభూషణము, తలపుండ్లు కడుగు

: బాధనివర్తి చేయు, తలపు గీడు చేయు : తలపు చెఱచు, తలపుచ్చె : తలపుఱ్ఱె, తలపు నిలుపు : మనసు నిలుపు, తలపు బాడినడచు : ఇష్టప్రకారం, తలపువ్వువాడక : చెక్కుచెదరక, తలపు సేయు : కోరు, తలపెట్టు : మొదలు పెట్టు, తలపై తలవచ్చినను : ఎంతగొప్పవాడైనా, తలపై నాలుగక్షింతలు పడు : తిట్లు తగులు, తలపొగరు : మదము, తలపాడుగు ధనం పోయు : కనకాభిషేకము లాగా, తలపొల్లవ : పొలిమేర, తలపోత : ఆలోచన, తలపోయు : ఆలోచించు, తలపోసుకొను : చెప్పుకొను, తలప్రాణము తోకకు వచ్చు : చచ్చినచావగు, తలబాట్ల కట్టు : విసుగుపుట్టు, తలబిరుసుతనం : తలపొగరు, తలబిళ్ల : తలగడ, తలచీకనకాయలగు : బిన్నాభిన్నమగు, తలబొప్పికట్టు : విసుగెత్తు, తలభారము : పడిశమువలన, తలమాటు : చేటు, తలమానికము : శ్రేష్టుడు, తలమానిసి : ప్రధాన పురుగు, తలమాయు : దుమ్ము పట్టు, తలమావి నీడని : బొత్తిగా చిన్నవాడు, తలమాసినవాడు : (తిట్టు), తలమాసువోని, తలమాళిగ : ఏనుగు కుంభస్థలాలంకారము, తలమించు : తలమీరు, తలమిగిలి తోడి పొడవగు : తలమును కలగు, తలమిగులు : విజృంభించు, తలమీద తలపడినను : ఏమయినా, తలమీద తలమొలిచినా, తలమీద నుంచు : శిరసావహించు, తలమీద వచ్చు ప్రాణము మీదికి వచ్చు, తలమించినను : హద్దు మీరి ప్రవర్తించు, తలమీరు : మించు, తలముగాదు, సాధ్యము గాదు, తలముచ్చుట్టులు దిరిగిన, తలపోయగ నోరిలోని దయకడి యున్నట్లు, సూటిగా వెళ్లక, తలము తప్పిన : అలవి తప్పిన, తలము నిగిన : అధికమైన, తలమును కలగు : అధికమగు, తలముడులు దొంగల సాధనం, తలమూటలు మోయు : కూలిసేయు, తలమొత్తి బాస యిచ్చు : ప్రమాణము చేయు, తలమొత్తికొను : ఎంతగట్టిగానో, తలమొల ఎఱుగక : మొదలూకొనా తెలియక, తలమోచి : శిరసా వహించి, తలమోచు : ఒప్పుకొను, తలమోపులుగా : ఎక్కువగా, తలమోసల యుండు : ముందు నిలబడి బాధ్యత వహించు, తలయంటు : అభ్యంగస్నానము చేయించు, తలయంపి : తలవైప, తలసాల : తలవాకిలి, తలసూపు : గోచరమగు, తలా ఒకటి : తలకొకటి, తలాతోకాతెలీని : మంచిచెడ్డా తెలియని, తలాతోకాలేదు ముందు వెనుకలు లేవు, తలారి వాని ఎదురు దారు : శత్రువు చేజిక్కు, తలార్చుకొను : తలవెంట్రుకల నార్చుకొను.

# ముఖం

భగవంతుని శిల్పమైన ఈ శరీరంలో ముఖంముఖ్యభాగం

వాడుకలో మనవారు దీన్ని వాడుకలో ఎలా మలుచుకున్నారో చూడండి

ముఖం చూచి : దక్షిణ్యాన

ముఖం ఎట్లాచూస్తాను? - ధైర్యంతో

ముఖం చాటువేసుకొను - ధైన్యం వల్ల

ముఖం చెల్లు : సంకోచం లేకుండా

ముఖం మీద కొట్టు -ఛీకొట్టు

ముఖం ముడుచుకొని - అసంతృప్తిగా

ముఖం మొత్తు - విసుగెత్తు

ముఖం లేదు - సంకోచించు

ముఖం వాచేట్లు - బాగా

ముఖం వెలవెలపోవు - ముఖం తెల్లబడు

ముఖ కవళికలు - ముఖంలోని భావ రేఖలు

ముఖతః - స్వయంగా

ముఖ దాక్షిణ్యం - మొగమాటం

ముఖ ప్రక్షాళనం చేయు : మొగము కడిగికొను

ముఖప్రీతిగా : ఐచ్చకముగా

ముఖమంత చేసుకొని :సంతోషించు

ముఖమింత చేసుకొని : చిన్నబుచ్చికొని

ముఖముబ్బింది : వ్యాధి లక్షణం

ముఖవీణ : ఒక రకమైన వీణ

ముఖశుద్ధి : ముఖం కడుగుకొను

ముఖస్థము : కంఠపాఠము

ముఖాగ్ని : దావాగ్ని

ముఖాన ఉమ్మివేయు : అవమానించు

ముఖాముఖి : ప్రత్యక్షముగా

# కన్ను

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" అని సామెత

శిల్పం అంతా నయనైక వేద్యమే

ఈనయనం ఆధారంగా ఏర్పడ్డ వాక్యాలు చూడండి

కన్ను

కన్నారు : చూచి సంతోషించు

కంటతడిబెట్టు : దుఃఖించు

కంటి అద్దాలు : కళ్లజోడు

కంటనువత్తి పెట్టుకొని

కంటపడిన

కంటపిడుక బ్రాము : మోసగించు

కంటపడకులుగట్టు : నానా బాధలు పెట్టు

కంట వత్తిడుకొని : కంటసరి : మెడ ఆభరణము, కంటి కసవు : క్షణక్షణబాధాకరుడు

కంటి కాగు, కంటికాను. కంటి కింపగు, ప్రియమగు

కంటికంపితమైతే వంటి కింపితమౌతుంది.

కనిపట్టు, కనిపెట్టు, కనిపెట్టుకొని, కనికట్టు విద్య, కనుకలి, చూడగా గలిగిన ప్రేమ, కనుకట్టు, అసూయ

కనుకుట్టుదనము : అసూయ, కనుకూర్కు : నిద్రించు, కనుకూలి : గింజల కూలి, కనుకొసలు : కండ్ల లోతులు, కనుగంటు చూచు : కనులార చూచు, కనుగట్టు : కనులు కానకుండా చేయు, కనుగప్పియరయు జాగ్రత్తగా పరిశీలించు, కనుగలిగి మెలగు : కనుగలిగి యుండు : జాగ్రత్తతో నుండు, కనుగవకోరగించు : కనులెర్రనగు, కనుగవనెఅసంజవాడము, కనుగానమి : గర్వము, కనుగాపు : సేవకుడు, కమరిటు : కన్ను గీటు, కనుగొనల నిప్పులురలు : కోపించు, కనుగొను : చూచు, కనుగొలుపు : సైగచేయు, కనుచాటు : రహస్యము, కనుబాటు చేయు : అదృశ్యము చేయు, కనుబాటు తిండి : దొంగతిండి, కనుచాటు మెలుకువ :

రహస్య ప్రవర్తన, కనుచీకటి : ముని మాపు చీకటి, కనుచూపు : దృష్టి, కనుచూఱ యొనర్చు : విందొనర్చు, కనుచెదరు : అజాగ్రత్తగా నుండు, కనుదోయి నీరు చిలుకు : కన్నీరుబిందు, కనుదోయి పదివేలువలయు : రెండు కండ్లు చాలవు, కనుపట్టు : కనుపడు, కనుపోటు : దృష్టి దోషము, కనుపాపవలె : అత్యాదరంతో, కనుబడియగు : లాభం కనుపించు, కనుబాటగు : దృష్టి దోషం తగులు, కనుబేటము : ప్రేమ, కనుబొమ్మలు కనుసొగలు, కనుబ్రాము : మోసగించు, కనుమబ్బు : కనుచీకటి, కనుమఱిచెడు : బైటపడిపోవు, కనుమఱుపడు : దాగుకొను, కనుమాయ : ఇంద్రజాలము, కనుమారిపడు : ప్రాణము తీసికొను, కనుముక్కుతీరు : అంగసౌష్ఠవము, కనుమాయు : నిద్ర / మోసగించు, కనుమూసిగింత : దాగి మూతలాడు, కనుమోడ్చు : నిద్రించు కనుమోసము : ఎదుటనేమో మోసము చేయు, కనుఱెప్పవెట్టని : కన్ను మూయని, కనుఱెప్పలుతేలవైచు : తెలివి తప్పిపోవు, కనుఱెప్ప వేయక చూచు : తేఱి చూచు, కనులకు గంతలు కట్టు : మోసగించు, కనులార్చు : కనుసైగ చేయు, కనులుచింత నిప్పులగు : కోపము కలుగు, కనులు చెమర్చు : దుఃఖము కలుగు, కనులు వేసికొని చూచు : నిరీక్షించు, కనులెర్రచేయు : కోపించు, కనువిందగు : నేత్రపర్వమగు, కనువిచ్చిచూచు : కండ్లు తెఱచి చూచు, కనువిచ్చు : కన్నులు తెఱవు, కనువిప్పగు : తెలిపిన, కన్నులు గట్టు : మోసగించు, కన్నులు గప్పు : మోసగించు, కన్నులు నీరు బుగ్గలగు, కన్నులు నెత్తికి వచ్చు కన్నులునెత్తికెక్కు, కన్నులు పైకి వచ్చు, కన్నులు మూసి చరించు, కన్నులు వాచు బి ఆసక్తితో ఎదురుచూచు, కన్నులు విచ్చిచూచు, కన్నువఱపు : దృష్టి సారించు, కన్నువేయు : మోహించు, కన్నువొందకుండు : నిద్ర పట్టకపోవు, కన్నుపైచు, కనుసన్నమేలగు : అజ్ఞాన వర్తియగు, కనుసన్నద్రిమ్మరు, కన్నుసిమి : మోసగించి, కన్నుమిన్నుకానరాక పోవు, కన్నుమిన్ను కానరాకపోవు, కన్నెఱగు : మోసగించు, కన్నుమోడ్చు నిద్రపోవు, కన్నుల కచ్చి : బాలక్రీడ, కన్నుల కద్దుకొను : అత్యాదరం, కన్నుల కరువు తీరగా : తృప్తిగా, కన్నుల గట్టినట్లు : ప్రత్యక్షంగా, కన్నుల గప్పుకొను : కన్నులగెంపారవు : కోపము, కన్నులవద్దుకొను : ప్రేమ సూచకముగా, కన్నుల నవ్వు : ప్రసన్నముఖుడగు, కన్నుల నిప్పులుడుల్లు : కోపించు, కన్నుల నిప్పులు రాలు : ఆగ్రహోదగ్రత, కన్నుల నిప్పులొల్కు, కన్నుల నీలాలు గారు,

కన్నుల నీళ్లు కుత్తుకపట్టు, కన్నుల నుసిరిపెట్టుకొను, కనులనే ప్రాణం నిల్పు, కన్నుల నొత్తురి, కన్నుల పండువు, కన్నుల బాడు, కన్నుల ముంచికోలు, కన్నుల ముత్యాలుగారు ఏడ్చు, కన్నుముసుగిడు, కన్నుల మ్రామ : చెఱకు, కన్నులలో నిప్పులు పోసుకొను : ఓర్వలేకపోవు, కన్నుల సన్ననునుచు : అజ్ఞానవర్తులనుగా చేయు, కన్నుల వాకిలి తీర్చు :

కన్నులు కానని : చూపులేని, కన్నులు గలవే : చూడగా, కన్ను : రీతి : జాడ, కన్నుండ కను పాపతీయు : అతి నేర్పరితనము : కన్నుండ కనుపాప కొన్నట్లు : అతినేర్పుగా, కన్నుండకంటే పాపను గొను, కన్నుకట్టు : మోసగించు, కన్నుకన్ను కనుపించని చీకటి, కన్నుగానక : గర్వం, కన్నుగానకపోవు : గర్వంచే, కన్నుగానమి: గర్వం, కన్నుకుట్టు : అసూయ, కన్నుకొట్టు : సైగచేయు, కన్న కొదమలు : ఉత్తమ నేత్రములు, కన్నుగానక : పొగరెక్కి, కనుగిలుపు : కనుసైగ చేయు,కన్నుగీటినంతలో : అతి వీఘ్రముగా, కన్ను గూర్కు : నిద్రించు, కన్ను చెదరు : మిరుమిట్లు గొలుపు, కన్ను దనియ : కనుల విందుగా, కన్నుదనియు : కనులవిందుగా, కన్నుదెఱచు : అనుగ్రహించు, కన్నుపడు : ఆసక్తి కలుగు, కన్నుపెట్టు : కనిపెట్టు, కన్నుపొడుచు : అపకారము చేయు, కన్ను పొడుచుకొన్నా అగుపించని : ఏమాత్రం కనిపించని, కన్నుపొడుచునట్లు : ఎదుటి వారికి బుద్ధి వచ్చునట్లు, కన్నుమూతపడు : నిద్రవచ్చు, కన్నుమూయు: చనిపోవు, కన్నుమూసి తెరచేలోగా : ఒక్కతృటిలో కన్నుమూస్తే అవకాశం లేదు : ఏమాత్రం వ్యవధి లేదు, కన్నుమూసే తీరికలేదు, కన్నుమొగడు : నిద్రించు, కన్నుమొగము ఏర్పడు : రూపమునకు వచ్చు, కన్ను మొగుచు : నిద్రించు, కన్ను మొఱుగు : మోహించు, కనువైచు :కన్నువేయు, కనుసన్న : సైగ, కనుసన్నమెలగు, కనుసోగ : కనుబొమ్మ, కన్నకడుపు : తల్లి కంటికింపైన, కంటికి కంటకించు,కంటికికడివెడుగా ఏడ్చు, కంటికి కడివెడు నీళ్లుగా, కంటికి కమికెడుకావరముండు, కంటికి దిసింతురే, కంటికి నిదుర రాదు. కంటికి నిద్రవచ్చు : మనశ్శాంతించు, కంటికి పుట్టెడుగాఏడ్చు :ఎక్కువగా ఏడ్చు, కంటికి ప్రియమగు, కంటికి భారమగు, కంటికి ఱెప్పచందమున (భారత), కంటికి ఱెప్పవలె, కంటికి ముంటికి ఏకధారగా,కంటి తడియారలేదు, కంటినొప్పి : పీడ, కంటి ముంటి వడినా, కంటిలో కన్నుపెట్టుకొనిచూచు, కంటిలో కలికానికి లేదు,

కంటిలోకారం చల్లి, కంటిలో కొచ్చివెంట్రుక, కంటిలోదూరు, కంటిలోనలుసై పోవు. కంటిలోని నెరసు, కంటిలోని నెరసు వలె (బాధించు) కంటిలోపడు, కంటిలోమిరపపొడిచల్లు, కంటుగట్టు, కంటపడు, కంటెబొట్టు వేయు : తాళికట్టు, కంట్లో కారం చల్లు, కంఠంలో ప్రాణమున్నంతవరకు, కంఠగతీ ప్రాణం, కంఠపాఠం : అప్పజెప్పు, కంఠం తడుపుకొను : దప్పిదీర్చుకొను, కంఠశోష : వృథాబోధ, కంఠస్థం : అప్పజెప్పడం, కంఠస్నానం : మాయిూలు స్నానం

కండ్లు తెరచు : ప్రపంచ జ్ఞానం తెలుసుకొను, కండ్లు తేలవేయు . తెలివితప్పు, కండ్లతో చూడలేదు అసూయ వలన, కండ్లతో చూడ సాధ్యం కాదు : అతిమనోహరం గనక

కన్నవారు : ప్రతివారు, కన్నవిటి : గ్రుడ్డి, కన్నవిన్నయదికాదు : విత, కన్నళవిసేయు : గొడవపెట్టు,కన్నళవు సేయు : గొడవ పెట్టు, కన్నాకు : ప్రధానము, కన్నాగు : కన్నాడు : తండ్రి, కన్నారచూచు, కన్నాస, కన్నిగట్టు : త్రాడు కట్టు, కన్నిచ్చకు వచ్చు, కన్నిచ్చవచ్చు, కన్నడియుండు : గమనించి యుండు, కన్నిడు, కన్నియు మెఱుగు : తొలకరి మెఱుపు, కన్నీరు : అశ్రువులు, కన్నీరు కాలువలు గట్టు : కన్నీరు గ్రక్కుకొను, కన్నీరు గోటమించు, కన్నీరు మున్నీరుగా, కన్నీళ్లు తుడుచు : ఓదార్చు, కన్నీళ్లు తుడుచు మాటలు శుష్కప్రియులు, కన్నోట : సంకోచము, కన్పండువు, కన్నిలుపు : కన్నుగీట, కన్పెట్టు, కన్మొఱుగు : వంచించు, కన్వెలుగు : కంటి వెలుగు, కన్వేగిన వెనుక : చీకటి పోగానే, కన్వేరు : తెల్లవారుజాము అగు, కన్బోగ కనుబొమ్మ.

## ముక్కు

ముఖంలో మరో ముఖ్య భాగం ముక్కు దానిపై వెలువడిన పదబంధాలు

ముకుగంబము : ముక్కు దూలము, ముక్కు గొయ్యవు : శిక్షా సాధనము : శత్రువు, ముకుచాయ : ముక్కుకు తిన్నగా, ముకుదాటగా బగ్గుచ్చు : అదే పనిగా తగాదాకు పిలుచు,ముక్కుపుటాలదురు : కోపముతో, ముక్కద్దాలు : సులోచనాలు, ముక్కపోవు :కుంఠితమగు, ముక్కర మాను : వుల్లిరుసు తిరుగు చక్రము, ముక్కరయు కమ్మలునను ద్రాచు మరియు, వచ్చగా ఉండం.

ముక్కాకయగు : మిక్కిలి కష్టమగు, ముక్కాకలదేరు : అతి సమర్థుడగు, ముక్కడి : ముక్కులేనిది, ముక్కుకు ముందు మూరెడు కోపం : అతికోపిష్ఠి, ముక్కుకు సూటిగా పోవు : న్యాయంగానడుచు, ముక్కు గొట్టము : ముక్కుపుల్ల, ముక్కు గొయ్యి : నాశకుడు, ముక్కుగొలు : ముక్కుజెఱిమ, ముక్కు జెఱగు : సాసాపుటము, ముక్కుటమూవురు : సరిగా ముగ్గురు, ముక్కుడస్సినవసరము : ముకుదాడు వీడిన పశువు : పంచతం, ముక్కుతీరు, ముక్కుతూమూలుగుతూ : బాధతో, ముక్కుతెగబారెడు చేయు : కోపించు, ముక్కుతో నేడ్చు : నసుగు, ముక్కుదఱుగు : శిక్షించు, ముక్కుదాకా తిను : అతిగా తిను, ముక్కు దూలము : ముక్కెముక, ముక్కున కుంజక్కటి యీడ్చు : అవమానించి లాగుకొనివచ్చు, ముక్కున గోపముండు : అతి కోపిష్టియనుట, ముక్కున నీరెత్తు : ఒక రకమైన శిక్ష, ముక్కున నూర్చగల్లు : ముక్కున ఊపిరి ఉండగా, ముక్కున ప్రాణముండు : అవసాన దశలో నుండు, ముక్కున బంటి : మించినవాడు, ముక్కున ఒంటిగా : ముక్కుదాకా, ముక్కునవయ్యంగదిసు : బాగా దిసు, ముక్కుననోటా : ఎక్కువగా, ముక్కుపచ్చలారని : వయసు రాని, ముక్కు పచ్చలు మానకమునుపె : చిన్నతనము నందె, ముక్కుపట్టని ముత్యము : పెదవికి మించిన పల్లువలె, ముక్కుపట్టుకొని కూర్చుండు : ప్రాణాయామము, ముక్కు పట్టుకొను : జపము సేయు; ముక్కు పుడక : ముక్కు ఆభరణము, ముక్కుపుల్ల : ముక్కు పుడక, ముక్కు పైకత్తి : గుండె గాలము వలె, ముక్కుపై వ్రేలాడు : ఆశ్చర్యపడు, ముక్కుపొడి : నశ్యం, ముక్కుపోగు : నత్తు, ముక్కుబద్దలగు : దుర్వాసన వల్ల, ముక్కుచెదరు : దెబ్బవల్ల, ముక్కుమీద వేలు వేసుకొను : ఆశ్చర్యపడు, ముక్కుముల్ల : బాధకలిగించువాడు, ముక్కు మొగం చూడక : పరిచయంలేక, ముక్కు మొగమూ ఏడ : వాడికి మొగమెక్కడిది? ముక్కులు పగిలిపోతున్నవి : (దుర్వాసన వల్ల)ముక్కులోకి చాలదు - (అత్యల్పం), ముక్కులో నుండి పొగలు వచ్చు : నసాళానికంటూ, ముక్కులో వెంట్రుక పీకినట్లు : వనసు చివుక్కుమను, ముక్కు విరచు : ఈసడించు, ముక్కస : మూడు కుంచములు, ముక్కు చెవులూకోసి : అవమానించి, ముక్కూ మొగం ఎఱుగను : తెలియదు, ముక్కూరివగచు : ఏడ్చు, ముక్తాయింపు : ముగింపు.

# చేయి

శరీర శిల్పంలో అన్ని పనులకూ చేయి ఒక ముఖ్య పరికరం దీన్ని బట్టి వచ్చినవాడుక పదబంధాలు చూడండి.

అరచేతిది : శ్రీ వైకుంఠుని దాసులమట, అరచేతిదిమోక్షము మాకిదివో

అరచేతి మాణిక్యం : కరతలామలకము వంటిది, అరచేతిలో వైకుంఠం చూపు, అరచేతిలో స్వర్గం చూపడం, అరచేతి గనందగు : స్పష్టముగా, అరచేత నావహిల్లు : అరచేతినిమ్మ పండువలె, అరచేత బండ్లు వచ్చేనప్పుడు కఱచెదవు గాక, అరచేత బ్రాణము లిడుకొను : మిక్కిలి భయంతో, అరచేత వ్రాలు గమవేళ : తెల తెలవారునప్పుడు, అరచేతిమాణిక్యము, అరచేతిది, అరచేతిలో భోగ్యము, అరచేతిమానికము, అరచేతి ఉసిరికాయ, అరచేతిలోనిది, అరచేతులొగ్గు.

# కాలు

శరీర శిల్పంలో గమనకారి కాలు

దీనిపై కలిగిన పదబంధాలు

కాలాడేటప్పుడు : బలం ఉన్నప్పుడు, కాలాడ కఱచు : దౌడు తీయు, కాగూర్చు : కాలాడించు, కాలికి వందులు వేయు, కాలికి బలపం కట్టుకొని తిరుగు, కాలికి బుద్ధి సెప్పు, కాలికి ముల్లు గ్రుచ్చుకొనదు. ఏ అపాయము కలుగదు, కాలికి వేస్తే మెడకు వేస్తే కాలికి వేయు : వాదంలో తికమకపెట్టు, కాలికి వేస్తే మెడకువేయు : త్రిప్పికొట్టు, కాలికి వేస్తే వేలికి : వేలికి వేస్తే కాలికి, కాలి క్రింద కసువుగాచూచు కాలికొద్ది పరుగెత్తు : బాగా పరుగెత్తు : కాలికొలదీ : వేగంగా, కాలిగోటికి దీటురాదు : ఏమాత్రం సరిపోదు, కాలిగోరునపోలకుండు, కాలిజోడు : పాదరక్షలు, కాలిడనిచ్చు : ప్రవేశింపనిచ్చు, కాలిడు : ప్రవేశించు, కాలితెరువు : కాలిబాట, కాలి త్రోవ : చిన్నత్రోవ, కాలి దాటగు : కీడు తగులు, కాలినడక : కాళ్లతో నడుచు, కాలిన పుండ్లలో ఉప్పులుచల్లు : ఎక్కువ బాధ కలిగించు, కాలిన పుండ్లమీద కారం చల్లు, కాలి బాట దగ్గరి దారి, కాలి మట్టులు : కాలి త్రొక్కిళ్లు, కాలిమానిసి : పదాతి, కాలిమీద కాలు తీయకుండా : హాయిగాకాలుమీద కాలు వేలుమీద రాయి వేసుకొని : అట్టహాసంగా, కాలముల్లు : బాధపెట్టునది, కాలియారు : కాలిపోవు, కాలీచవడగా : కాళ్లు అరిగిపోవునట్లుగా, కాలుకంబము : ద్వారా బంధువు

[illegible]ం, [illegible]డ : కాళ్లవైపు, కాలు క్రింద పెట్టకుండా : ఏమాత్రం [illegible]చేయనియకుండా కాలుకొను : కాలునిల్పు, కాలుకడ: కాళ్లవైపు, కాలుక్రింద [illegible]ట్ట[illegible]డా : ఏమాత్రం పనిచేయనీయకుండా కాలుకొను : కాలునిల్పు, కాలుగాలిన పిల్లివలె, ఒక చోట నిలువక, కాలు గీరు : సైగచేయు, కాలుజారు : తప్పుదారి త్రొక్కు, కాలు త్రొక్కి కంకణం కట్టు : పెండ్లి యాడు, కాలు త్రొక్కికొనువచ్చు : వెన్నంటి వచ్చు, కాలు త్రొక్కికొను : తొందరపడుకాలుదన్ను : కాలూనినిలుచు, కాలు దివిటీ మర్యాద : రాజమర్యాద, కాలు దిలియ : రాజమర్యాద, కాలు దూయు : పారిపోవు, కాలుద్రవ్వు : తిరస్కరించు, కాలుద్రొక్కి : వివాహమాడు, కాలు నిలువదు : స్థిరత లేకపోవుట, కాలునేల గీరుతూ : (సిగ్గుతో), కాలునేలదింపకుండా : హాయిగా, కాలు పురుగుతొలుచు ప్రయాణేచ్ఛ, కాలుపెట్టిన వేళ : కాపురానికి వచ్చినవేళ, కాలుపెట్టే సందిస్తే : ఏ కొంచెం అవకాశమిచ్చినాకాలుపాడుచు : కాలూను, కాలు బట్టితీయు :క్రిందికి పడతోయు, కాలు బలము : పదాతి బలము, కాల్మడి : మూత్రము, కాలు మడచు, మూత్రవిసర్జన, కాలురావడ తిరుగు : కాళ్లు అరిగేట్లు తిరిగు,కాలూను : స్థిరముగా నిల్చు, కాలెత్తు : వ్యక్రియఅంచు, కాళ్లుగొను : పాదధూళి తీసికొను, కాల్దోమి కడుగు: పాదంబకడుగు, కాళల దోవతియగు : అడ్డగురు, కాళ్లకాడ బ్రతుకు : ఆశ్రయము; కాళ్ల కింద గోతులు తీయు : మంచిగానే ఉండి ద్రోహము చేయు, కాళ్లకు నీళ్లిచ్చు : అతిథి సత్కారము చేయు, కాళ్లకు పసుపురాయు : స్త్రీ సత్కారములలో నొకటి, కాళ్లకు బలపాలు కట్టుకొని తిరుగు : శ్రద్ధతో తిరుగు, కాళ్లపెనగు : కాళ్లపైబడు, కాళ్లబేరమునకు వచ్చు : బ్రతిమలాడు, కాళ్లమీదగంజిపారవేసుకొను : త్వరపడు, కాళ్ల మీద పడు : ప్రాధేయపడు, కాళ్లరిగిపోవు : ఎక్కువ తిరుగు, కాళ్లాడలేదు : ఏమీ తోచలేదు, కాళ్లా వేళ్లా పడు బ్రతిమలాడు, కాళ్లుకట్టివేయు : ఏమీ చేయనీయకపోవు, కాళ్లు కట్టివేసినట్లుగా :నిర్బంధములో ఉన్నట్లుగా కాళ్లు కడిగి నీళ్లు తాగు : భక్తితోమసలు, కాళ్లు కడిగి కన్యాదానం చేయు : పెండ్లి చేయు : కాళ్లు కడుపులు పట్టుకొను : ప్రాధేయపడు, కాళ్లు కాయలుకాచు : మిక్కిలి శ్రమపడు, కాళ్లు కొట్టుకొంటూ : నీరసంగా కాళ్లు గట్టు : పాదబంధము, కాళ్ల తీపులు : కాలిశ్రమ, కాళ్లు తేలిపోవు : నీరసం, కాళ్లు నిలవవు : అస్థిరత కాళ్లు పట్టుకొను : ప్రాధేయపడు, కాళ్లు మొగములు వాచి : విపరీతమైన ఆసపడి, కాళ్లు రాకపోవు : కాళ్లాడకపోవు, కాళ్లురెండూ ఒక చోట

పెట్టలేడు : విశ్రాంతి లేదు. కాళ్లు వచ్చు : వయసు వచ్చు, కాళ్లువిరగగొట్టికొను తొందరపడు, కాళ్లూ చేతులూ ఆడడం లేదు : ఏమీ చేయడానికి తోచడం లేదు కాళ్లూ మొగం వాచు : ఎంతో ఆశపడు, అరకాలిమంటనడినెత్తికెక్కినట్లు : బాగా కోపం వచ్చు, అరకాలినవ్వ : ప్రయాణేచ్ఛ, అరకాలల నేలరాచు : వేధించు, రకాలముల్లు గొనక : శత్రువును లెక్కచేయక, అరకాలుగొను : పాదము పట్టు అరకాలు తడియకుండా : మిక్కిలి సులభంగా, అరకాళ్లకు నరచేతులొగ్గు : సేవకాభావంతో, అరకాల కన్ను వచ్చినట్లు, గర్వంతో, అడగడుగశ్వమేథము : కష్టంగా, అడగడుగునకు : ప్రతిసారీ, అడుగామడయగు : మిక్కిలి దూరము, అడుగుగులాము : సేవకుడు, అడంగుదప్పక : ఖచ్చితంగా,అడుగు దప్పినచో దప్పుపిడుచు ప్రవేశింపక, అడుగు భద్రం : జాగ్రత్తగానడు, అడుగులకు మడుగులొత్తు : సేవించు, అడుగుల వ్రాలు : పాదంపైబడు, అడుగులాన : ఒట్టు, అడుగులుతడబడు : తొట్రుపడు, అడుగుల కెరగు : పాద నమస్కారం, అడుగులకెరగు : పాద నమస్కారం, అడుగులు సడుగులు : చప్పుడు, అడుగులేని గిన్నె : ఆధారం లేనిది, అడుగులో అడుగు వేసుకొంటూ : మెల్లగా, అడుగులో దాచిపోవు : కొద్దిలో, అడుగులో హంసపాదు : మొదటనేఆటంకం, అడుగుపట్టు : క్రిందికి పోవు, అడుగు వాసినచో అరవాయు : కదిలితే దూరమైపోవు

## వస్త్రం

మానవుడు నిర్మించే శిల్పాల్లో వస్త్ర మొక దైనందిన అవసర వస్తువు. దీనిలో స్త్రీ ధరించేది విశేష శిల్ప శోభితం. దానిపై ఏర్పడ్డపదబంధాలు.

కొంగుజారు : పైటజారు, కొంగు ధనము : చేతిలో ఉన్న ధనము, కొంగున కట్టుకొని తిరుగు : వశవర్తి, కొంగుననగ్ని దాచినట్లు : అపాయము, ఆత్మ వ్యాఘాతము, కొంగుననున్న చిచ్చు : వినాశకారి, కొంగునముడి చినమణి : అందుబాటు సౌకర్యము, కొంగుపట్టు :దేహి అను, కొంగు వఱచికొను : పైటక్రింద పంఱచికొను, కొంగు పఱచు : వ్యభిచరించు, కొంగు పసిడి : సులభలభ్యము, కొంగుపైడియగు : అందుబాటులోనిది, కొంగుపైడియగు : అందుబాటులోనిది, కొంగుబంగారమగు : సులభలభ్యమగు, కొంగు బత్తెము : కూలిగింజలు, కొగుమాయు : ముట్టగు, కొంగు రొక్కము : ఈ వలసిన ధనము, కొంగొడ్డు : సంభోగ సుఖమిచ్చు,

కొంగోడువడు : ఒఱిగిపోవు, కొంగోడుపోవు : ఒక మంచం కోడువదలినదగు.

## అద్దము

అద్దంలాగా : పరిశుభ్రంగా, అద్దంలోని ముడుపు : వట్టిది, అద్దపునీడ : అశాశ్వతం, అద్దం చూచు : వేశ్యాచారం, అద్దములోనీడ కాసపడు : అశాశ్వతమైన దానిని కోరు

ఆభరణాలు (నిత్యప్రయోగి వస్తువులు)

అడ్డబాస : బులాకీ, అఆలపట్టము : వస్త్రాలతో చేసే విసనకర్రలు, ఆనవాలు : గుర్తు, కడిగిన ముత్యంలాగా శుభ్రంగా, కడికంచం : తినేకంచం, కత్తిరించినట్లు : సరిగ్గా, కత్తరిగలయు : ఖండితమగు, కత్తరిల్లు : చినుగు, కత్తికట్టు : వైరమూను, కత్తికి గంటము : వాడి గంటము, కత్తిమీద సాము : అపాయమైనది, కత్తిరాతికి పాసన గొంటు : మొండి వెనవ, కత్తిరించు : రెండు ముక్కలు చేయు : త్రెంచు, కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు : వెల వెల పోవు, కత్తి వేస్తే నెత్తురుచుక్కలేదు, కడిగిన సాలగ్రామంలాగా : అలంకారహీనంగా, కడిగిన గంగాళంలాగా : శూన్యంగా, కడిగిన నిప్పులాగా : నల్లగా, కడియపు చేమీదుగా దివము చేకు : ముత్తైదువు చావుచచ్చు, కడియపు టట్టు : చిన్న అట్ట, ఉత్సవ విగ్రహం : అలంకార విద్యార్థి, ఉదయ రాగపట్టులు : వస్త్ర విశేషం, ఉప్పరపట్టములు : చాందినీలు, ఉమ్మాయముత్యము : మాయుతత్వము, ఒంటికంబపుమేడ : ఒక్క స్తంభంతో కట్టిన మేడ, ఓలగందము : స్నానం చేసేటప్పుడుపూసుకొనే గంధం, కంకణం కట్టు : దీక్షపూను, కంకణం కట్టుకోవడం : బాధ్యత స్వీకరించడం, కంచంత కాపురంపెద్దకాపురం, కంచుకాగడా వెలిగించి చూచిన : ఎంతవెతికినా, కంచుకుత్తుక : కంచుకంఠం, కంచుకొమ్ము : కంచు బాకా, కంచుగీసినట్లుండు : కంచుస్వరం, కంచుపెంచునగు : విరుగు, కంచుమించదు : చెల్లా చెదరగు, కంచురాయి : పెళుసైనరాయి, కంచుకోట : గట్టికోట, కంచెగోడ : ప్రహరీ గోడ, ఉక్కుతునక : వీరుడు. ఉక్కున పెనచినట్లుండు. బలిష్టముగా నుండు, ఉక్కునీరు : కరిగిన ఉక్కు, ఉక్కులు రాల్చు : కోపగించు, ఉక్కు మడగు : బలముచెడు, ఉక్కు మిగులు : చేవగిల్లు, ఉక్కుమీరు : చేవమిరాఉ, ఉక్కు మెఱయు : లెక్క సేయకుండు, ఉక్కుమురిసినట్లు : ఉక్కు కరిగినట్లు, ఉక్కువడు : దుర్బలుడగు,

ఉక్కు : గట్టిపడు, ఉక్కెరలుగా : విపరీతముగా, ఈపులరతనము : చింతామణి, ఉంకుటుంగరము : వివాహనిశ్చయ సూచకమైన ఉంగరము : ఉంగరాల చేతి మొట్టికాయ.

## అచ్చు

ఇదొక శిల్పి కార్యము, దీనిపైవచ్చిన పలుకుబడులు చూడుడు.

అచ్చుగుండ్ల పేరు : బంగారు గుండ్లతో చేసిన దండ, అచ్చుకట్టు వేయు : నీళ్లు కట్టేముందు మడిని వేరు వేరు కయ్యలుగా చేయు, అచ్చుకావలిగాడు : దొంగలు దోచిన సొమ్మును దండుగ పెట్టుకొనే కావలివాడు, అచ్చుకుప్ప : ధనవంతుడు, అచ్చుకొట్టినట్లు : అచ్చంగా అలాగే, అచ్చుకొను : ఒకరు ఇవ్వవలసినవి దానికి తాను బాధ్యుడగు, అచ్చుకొట్టు : ఆచ్చువేయు, అచ్చుగా : అచ్చంగా,అచ్చుగుద్దినట్లు : సరిగ్గా అలాగే, అచ్చుటెద్దు : అచ్చుబోసిన ఆంబోతు, అచ్చుదలయగు : అంగీకారమగు, అచ్చుదించినట్లు : సరిగ్గా అలాగే, అచ్చుటెద్దు : అచ్చుబోసిన ఆంబోతు, అచ్చుదలయగు : అంగీకారమగు, అచ్చుదించినట్లు : కానీ దించినట్లు. అచ్చు నిలుపు : దృష్టాంతము నిలుపు, అచ్చుపడు : ముద్రితమగు, అచ్చుపడినట్లు : సరిగ్గా అచ్చుపొడిచిన : స్వేచ్ఛా‌ప‌ి. అచ్చుపోసి వదలు : స్వేచ్ఛగా వదులు, అచ్చుముచ్చు : మంచిచెడు, అచ్చుముచ్చూ ఎఱుగు : మంచిచెడులెరుగు, అచ్చులు పెట్టించు : ముద్రించు, అచ్చులొత్తు : వస్త్రాదులకు రంగులద్దు, అచ్చులో లేదు : ముద్రణలో లేదు, అచ్చుపడు : ముద్రితమగు : అదృష్టమగు, అచ్చువేయు : ముద్రించు, అచ్చొత్తిన గొడ్డె : అమాయకపుమనిషి, అచ్చొత్తినదియె : ముద్రించినదియే, అచ్చొత్తి విడుచు : గ్రామపరము చేయు దేవార్పణము , అచ్చొత్తు : హస్తాదులతో ముద్రలు వేయు, అచ్ఛాంశి (డి) : శ్రేష్టము,

## సందర్భ గ్రంథాలు

1. పదబంధ పారిజాతము - విశ్వనాథ సత్యనారాయణ (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి) హైద్రాబాద్

2. తెలుగు సామెతలు -తిమ్మావజ్ఝుల కోదండ రామయ్య (ఆం.ప్ర.సాహిత్య అకాడమి) హైద్రాబాద్.

# అధ్యాయం 28

## శిల్పము : శిష్ట వ్యావహారిక శబ్దాలు : శాస్త్రీయ పదజాలం

30.01 ప్రతి శాస్త్రానికి కొన్ని ముఖ్య శబ్దాలుంటాయి. అవి ఆ శాస్త్రానికి ప్రాణ స్థానాల వంటివి.

వేదాంతంలో మాయ, అండం, పిండం, ఆత్మ, పరమాత్మ తర్కంలో ఘటా. కాశ, పటాకాశ, ములు

మీమాంసలోఇష్టి, దర్శ, పూర్ణ, కర్మలు

సంగీతంలో రాగం, తానం, పల్లవి, సరిగమలు

యోగంలో ప్రాణాయామ, ప్రత్యాహారములు

వ్యాకరణంలో సంధి, సమాస, విగ్రహ సంజ్ఞలు

లాంటివి ఆయా శాస్త్రాల యొక్క స్వరూప స్వభావాల్ని వెంటనే స్ఫురింప చేస్తాయి. అలాంటి శబ్దాలు శిల్ప శాస్త్రానికీ ఉన్నాయి. ఆ శబ్దాల వివరణ ద్వారా ఈ శాస్త్రం యొక్క స్వరూప స్వభావాల్ని ఈ శబ్దాలు ప్రయోగించిన శిల్పాచార్యుల మానసిక సౌందర్యాన్ని పరిచయం చేయడంతో యీ వ్యాసం ముగింపు చేయడం జరుగుతుంది. తక్కిన లౌకిక శబ్దాల్ని వ్యాఖ్యానం చేసినా చేయకపోయినా వ్యవహారం సంతరించుకొన్నవే గనక సామాన్య నిఘంటువులో విద్యార్థులకూ ఆయా అర్థాలు తెలుసుకోగోరే వారికి ఇట్టే లభించేలా చూడటమే ఈ వ్యాస లక్ష్యం. శాస్త్రం అంటే పఠన పఠనాల కే పరిమితమై లోకవ్యవహారంలో జీవించడం అరుదు, కాని తెలుగు నాటశాస్త్రంలోక వ్యవహారం పొందటం అనేదేప్రత్యేకం. ఆ తెలుగు శిల్పం యొక్క వైశిష్ట్యం తెలియజేయడమే యీ విద్యార్థి యొక్క చిరకాలమైన కోరిక.

30.02 ప్రతిభాషలోనూ శాస్త్రానికి సంబంధించిన శబ్దాలు కొన్ని తప్పకుండా వ్యావ

హారిక రంగానికి వస్తాయి. ప్రజల్లోకి చొచ్చుకుపోతాయి. వాటినిశాస్త్రీయ పరిభాషగా జనం ఆదరిస్తారు. ఇది దాదాపు అన్ని శాస్త్రాలకు అన్ని ప్రాంతాలకు అన్వయిస్తుంది. కాని శిల్పం దగ్గరికి వచ్చేసరికి దీనికి ఈ ముగ్గురి దృష్టి ఒక్కటే. పదార్ధము ఒక్కటే. కాని వాడిన పదం భూమి - స్థలం అనేవి మాత్రమే శాస్త్రీయాలు. హిందీలో ఉన్న 'జాగా' గాని తమిళంలో ఉన్న'ఎడం' గాని శాస్త్రంలో కనిపించవు. అలాగేతెలుగులో యింటికి స్తంభం ఎత్తాము అంటాంలేక ఇంటికి ద్వారం ఎత్తాం అంటారు. అది హిందీలోదర్వాజా ఖడాయా అంటారు. తమిళంలో వాసప్పడి అంటారు. ఇలా పలు తావుల్లో శాస్త్రీయం పదజాలం శిల్పానికి సంబందించినంతవరకు ఓతప్రోతంగాతెలుగువారి వ్యవహారంలో ఉంది. ఐతే ఇది సంస్కృత భాషా వ్యవహారికత ఉన్నది. అదే దేశీయం. ఇవె శిష్ట వ్యావహారికం. దేశీయ పరిభాష లోనేను యిల్లు కట్టుకోవడానికి చోటు తీసుకొన్నాను అంటాడు. చోటు అనేది దేశీయ శబ్దం. అలాగే రెండో వాక్యానికి గుమ్మం ఎత్తారు లేక వాకిలి ఎత్తారు అంటారు. ఇందులో గుమ్మం. వాకిలి దేశీయాలు. ఇలా దేశీయ పదజాలము సంస్కృత పదజాలమూ మన తెలుగులో ఉన్నాయి. మన తెలుగులో దేశీయ పదజాలంతో బాటు శాస్త్రీయ పదజాలం కూడా ఎక్కువగా చెలామణిలో ఉండడంఇక్కడి విశేషం. దీన్ని బట్టి శాస్త్రం యొక్క చెలామణి సామాన్య ప్రజల వరకూ వ్యాపించినట్లు ఇట్లే తెలుసుకోవచ్చు.

30.03 బ్రహ్మ: హిందువలకందరికీ బ్రహ్మ విష్ణు శివ శబ్దాలు పరిమితాలే కాని వాడే అర్థాలకూ శిల్ప శాస్త్రం వ్యవహారం పొందిన దానికి ఎంతో తేడా ఉంది.

శిల్పంలో బ్రహ్మ అంటే మధ్య బిందువు. అలాగే మధ్యలో ఉండే సూత్రం, మధ్యలో ఉండే స్థానం

రూపంలో నాలుగు పలకలుగా ఉండేది.

రంగుల్లో తెలుపుకు బ్రహ్మవర్ణమని వ్యవహారం

విష్ణు : ఎనిమిదిపలకలుగలదానికి విష్ణురూపం అని వ్యవహారం రంగుల్లో మేఘవర్ణాన్ని విష్ణువర్ణం లేక కృష్ణ వర్ణంఅనడం యీ శాస్త్రంలో పరిపాటి.

కనకం, రజితం, తామ్రం, అభ్రకం, సుధా, త్రపు, నీలం

వర్ణజాతులు :

తెలుపు, నాగరం, ఎరుపు, ద్రావిడం, పసుపు, వ్యాంతరం, ఆకుపచ్చ, వేసరం, చిలకపచ్చ, కాళింగం, అన్నివర్ణాలు, యామ్నం

శుద్ధ వర్ణాలు :

శ్వేత, రక్త, పీత, కృష్ణములు

మిశ్ర వర్ణాలు

శంఖమిశ్ర దరద, ఆవిక్తక, గైరిక, హరితాళ, కజ్జల, నీల

వర్ణ - స్వర్ణయోగం : పత్ర విన్యాసం, రసక్రియా

వర్ణోన్మీలనం : క్షయం, వృద్ధి

చిత్రపత్ర కంటక జాతి :

పత్రాలు : దినపత్రం, ఋతుపత్రం, జలపత్రం నరపత్రం

ఇవి మరల

శాఖోద్భవములు, ఖండజములు అని ఇరు విధములు

కంటకములు

కలి, కాలిక, వ్యామిశ్ర, చిత్రకౌశల, వ్యావర్త, వ్యావృత్త, శుభాంగ, భంగచిత్రకములు

చిత్రరసములు :

1. శృంగార, 2. హాస్య, 3. కరుణా, 4. వీర, 5. రౌద్ర, 6. భీభత్స, 7. శాంత. 8.అద్భుత, 9. భయానకములు

చిత్ర రసదృష్టులు

లలిత, హృష్ట, వికసిత, వికృత, భ్రుకుటి, విభ్రమ, ఊర్ధ్వగత, యోగిని. సంకుచిత, దీన, దృష్ఠ, విహ్వాల, కుంచిత. జిహ్మ, శాంతిక, మధ్యస్థ, స్థిర

**30.128 చిత్రకళాక్షేత్రములు**

అజంతా, భాఘ్, సిరిగిరియ, రాజపుట, పహాడీ మొగలాయి, జైన పుస్తక ఇత్యాది

**30.129 శిల్పము చేయుటకుపయోగించు ఆయుధములు**

కుద్దాలం : గుద్దలి, కరణీ : ఉలి, వాస్యా : బాడిత, ఘటికాపాత్ర : నీళ్ల పాత్ర, షేరువు : దాగలి, టంకం : సుత్తె, స్వనం : పట్టుకారు, భూషా : గొట్టము, అగ్ని : కొలిమి, తరణిచక్రం : తరణిబట్టు చక్రము, క్రకచం : ఱంపము, కీలం : పొగరు, యంత్రము.

---

## సందర్భ గ్రంథాలు


1. వాచస్పత్యము - చౌఖంబా, బనారస్
2. శబ్ద కల్పద్రుమము - చౌఖంబా, బనారస్
3. అమర కోశము - అడియార్, మద్రాస్
4. లింగాభట్టియము - అడియార్, మద్రాస్
5. శిల్పకోశము - స్వర్ణ సుబ్రహ్మణ్య కవి
6. శిల్ప కోశము - లలితకుమార్ శుక్ల, చౌఖంబా, బనారస్


✿ ✿ ✿ ✿

# 30.94 ఎస్తంభ భేదములు :

| అజిత ఆగమము | దీప్త ఆగమము | అంశుమత్ ఆగమము | ఈశాన శివగురు దేవపద్ధతి | సుప్రభేద ఆగమము | విశ్వకర్మ శిల్పశాస్త్రం |
|---|---|---|---|---|---|
| బ్రహ్మకాంత | బ్రహ్మకాంత | బ్రహ్మకాంత | బ్రహ్మకాంత | | బ్రహ్మకాంత |
| విష్ణుకాంత | విష్ణుకాంత | విష్ణుకాంత | విష్ణుకాంత | | విష్ణుకాంత |
| రుద్రకాంత | రుద్రకాంత | రుద్రకాంత | రుద్రకాంత | | |
| సౌమ్యకాంత | `సౌమ్యకాంత | | | | |
| వాసంతిక | | | | | |
| వృత్తకాంత | వృత్తపాదం | | | | |
| పూర్వాగ్రస్తంభ | పూర్వాగ్రస్తంభ | | | | |
| చిత్రఖండ | | చిత్రఖండ | చిత్రఖండ | | |
| వజ్రఖండ | | శ్రీ వజ్రః | వజ్రకాంత | | |
| రమ్యఖండ | | | | | |
| చారుఖండ | | | శ్రీ వజ్ర | | |
| స్కందకాంత | సుందరం | స్కందకాంత | స్కందకాంత | | స్కందకాంత |
| సింహపాద | సింహపాదమ్ | | సింహకాంత | | |
| | అష్టాశ్రమ్ | ఇంద్రకాంత | ఇంద్రకాంత | | ఇంద్రకాంత |
| | | చంద్రకాంత | చంద్రకాంత | చంద్రకాంత | సోమకాంత |
| | | భానుకాంత | భానుకాంత | | సూర్యకాంత |
| | | మండ | ఈశకాంత | | సుప్రతీకాం |
| | | క్షేపణః | భద్రకాంత | | బ్రాహ్మకాం |
| | | శివచ్ఛందః | వ్యాలకాంత | | కైలాసకాం |
| | | గజపాద : | గజకాంత | | మేరుకాంత |
| | | శుండపాదః | శుండుపాదః | | నందికాంత |
| | | పిండిపాదః | భిండిపాదః | | |
| | | | పద్మాసనః | | |
| | | కుంభపాదః | | | |
| | | శ్రీకంఠః | శ్రీకంఠ | శ్రీకర | |
| | | | పట్టక్షేపణ | సౌముఖ్యః | |
| | | | వజ్రపాద : | ప్రియదర్శనః | |

# ఉపసంహారము

## మన సంస్కృతిలో శిల్ప కళ పాత్ర: మహామహుల భావములు

కవి సమ్రాట్ శ్రీ నోరి నరసింహ శాస్త్రి

### 1

శిల్పము, చిత్రకళ, సంగీతము, నృత్యము, కావ్యరచన - ఇవి అన్నీ లలిత
లుగా భావింపబడుతున్నాదేని విశిష్టత దానికున్నది. ఐనా తక్కిన లలిత కళలకు
కీ లేని విశిష్టత శిలా శిల్పానికి ఉన్నది. ఈ శిల్పము ఎక్కడ ఏ విధంగా
పొందుతుందో చక్కగా భావించనప్పుడే కాని దాని స్వరూపము అవగతము
ను.

కవి చిత్రకారుడు తన భావనను రేఖలతో వర్ణములతో రూపొందిస్తాడు.
లు వ్రాయడంలో రంగులు వేయడములో అతనికున్న అనుభవముజోడిస్తాడు.
త్రము చిత్రించేది కాగితము మీద కావచ్చును. చర్మము మీద కావచ్చును.
ము మీద కావచ్చును, కుడ్యము మీద కావచ్చును, రత్నాదుల మీద కావచ్చును.
ండమీద కావచ్చును. ఆయా వస్తువుల గుణములకు అనుగుణముగా తన
కృతి మార్పు చేస్తాడు.

అట్లే వాగ్గేయకారుడు తన హృదయములో ఆవిర్భవించిన సంగీతము -
తువును - మాటలలో - ధాతువులో - కూరుస్తాడు.

నర్తకుడు కూడా తాను ప్రదర్శింప దలచిన భావాలను తన అంగవిన్యాసాదు
తో ఆకాశములో రేఖలు గీసి ప్రదర్శిస్తాడు.

ఈ విధంగా ఈ లలిత కళాకారులు తమ హృదయములో ఆవిర్భవించిన
వమును తాము ఎన్నుకొన్న సాధనములోనికీ ద్రవ్యములోనికీయోగింపజేస్తారు.

మరి శిలా శిల్పి? అతడు ఉపయోగించే ద్రవ్యము శిల. అతడు చేసేది తాను

భావించిన రూపమును శిలలో శాణటంకములతో మూర్తీభవింపజేయడమేనా? సాధారణముగా అంతే అనే భావము సర్వే సర్వత్ర వ్యాపించి ఉన్నది. ఈ శిల్పమును గూర్చి వ్రాసిన వ్యాసకర్తలు కాని, కథకులు కవులుగాని, ఎక్కువగా అదే భావము ప్రకటించినారు. సాధారణ శిలా శిల్పులు చేసే పని కూడా అదే కావచ్చును. కంచు మొదలైన లోహాలతో విగ్రహాలు పోతపోసే శిల్పులు కూడా చేసేది అదే కావచ్చును. కాని శిలలో మూర్తులు శిల్పించే మహా శిల్పులు మాత్రము చేసేది అది కానేకాదు. అదే వారి విశిష్టత! ఏమిటది?

## 2

కవి తన భావనకు వాక్కును అనుకూలముగా మలచుకోగలడు. చిత్రకారుడు భావానుకూలముగా పెన్సిలును తూలికలను రంగులను వస్తువును మలచుకోగలడు. అట్లే వాగ్గేయకారుడు వాక్కును, నటుడు తన అంగములను స్వాధీనము చేసుకుంటాడు. కాని శిలాశిల్పికి అట్టిది సాధ్యము కాదు. తక్కిన కళాకారుల సాధనములు వారి స్వాధీనములో ఉంటవి. కాని శిల అట్లా కాక స్వతంత్రమైనది. తక్కిన కళాకారులవలె శిలా శిల్పి కూడా శిలలోకి తన భావరూపము చెక్కడానికిపూనుకుంటే, అతనికది సాధ్యము కాదు. ఆ రాయి చంద్రకాంతపు రాయి కాని, నల్లశాణపు రాయి కాని, ఎర్రరాయికాని, సున్నపురాయి కాని, దేని రూపము దానికుంటుంది. శిలవట్టి సుద్దముద్దవంటిది కాదు. దారువులకు వలెనే రాతికిని ఎన్నో పొరలు, గీరలు, పొరుపులు ఉంటవి. వానికి అడ్డురాకుండా తన భావనను శిలాశిల్పి రూపొందించుకోవలె. తన భావనకు అనుకూలముగా ఉన్న శిలను వెదకు కొనడానికి పూనుకొంటే, ఏళ్ళు, పూళ్ళు వెదకినా, దొరకక పోవచ్చును. శిల్పాలకు ఉపయోగపడే శిలలు సులభ సాధ్యమైనవి కావు. కాబట్టి శిలా శిల్పి తనకు ప్రాప్తించిన శిలలోనేమూర్తి భావన చేయవలె. ఈ విధంగా చూస్తే శిల ప్రభువు, శిలాశిల్పి దాని సేవకుడా అనిపిస్తుంది. కాని అదీ న్యాయముగా తోచదు. అప్పుడు శిల్పి అస్వతంత్రుడౌతాడు. శిల్పి గౌరవానికి అది భంగకరము, మరి?

## 3

శిలా ఫలకము లభ్యమైనది. దానిని ఎన్నో విధాల స్థూల పరీక్ష చేసి శిల్ప

గ్యమో కాదో ముందు నిర్ణయిస్తాడు. శిల్పయోగ్యమని నిర్ణయమైన తర్వాత
ని బహుముఖంగా పరిశీలన చేస్తాడు. సూర్యకాంతిలో చంద్రకాంతిలో సంధ్యా
తిలో చీకటిలో దాన్ని అన్నివైపులా తిరిగి సూక్ష్మంగా పరిశోధన చేస్తాడు. దాని
ాపము బాగా అధ్యయనము చేసిన తర్వాత అందులో ఏ శిల్ప మూర్తి నిక్షిప్తమై
ద్రో, దాగి ఉన్నదో, బంధింపబడి ఉన్నదో ధ్యానిస్తాడు. శిలా శిల్పికి నిజమైన
ంయము ఆ శిలలో ఉంటుంది. తన దేహంలో కాదు. ఆమూర్తిని శిల్పి
ంచిన తర్వాత కాని శిల్పక్రియకు ఉపక్రమించడు. ఆ శిలో ఏ భాగంలో ఏ
ంలో మూర్తి ఉన్నదో దర్శించి దాన్ని బయటికి తీసి ప్రదర్శించడమే శిల్పి
క్రమము. శిలా బంధంలో చిక్కుకొన్ని మూర్తికో మూర్తులకో, శిలలో నుండి
క్తి పరిభాషలో చెబితే మాయా బంధములో నున్న జీవునికి స్వస్వరూపము
్శించే సద్గురువు వంటి వాడు మహాశిలా శిల్పి!

## 4

ఈ శిలా శిల్పము మన దేశములో వర్ధిల్లిన వైదిక జైన బౌద్ధమతాలు
కటికి సర్వసాధారణమే ఐనా, ఈ మూడింటిలో అది బౌద్ధము వల్ల విస్తారంగా
చెందినది. బౌద్ధములో కూడా మొదట మొదట బుద్ధ పాదాలు, బోధికి ధర్మ
వర్తనకూ మహాపరినిర్వాణమున కూడా ప్రతీకలైన బోధి వృక్షము, చక్రము
ద్రాకారమైన స్తూపము మాత్రమే పూజా స్థానాలుగా ఉండేవి. ప్రాచీన తర
వనదగిన హీనయానము శాఖోపశాఖలై మహాయాన శాఖలుగా
మించుటతో పాటు బోధిసత్వ భావన విస్తరించినట్లే శిలా శిల్పమునుబహు
ులుగా విస్తరిల్లినది.

బౌద్ధ పూర్వాచార్యులు మొదట మొదట ఈ విగ్రహ పూజను అసమ్మత
ఉపేక్షించి ఉండవలె. శిలా శిల్పాచార్యులు నెమ్మదినెమ్మదిగా తమ శిలా
రహస్యమును వారికి విశదీకరించి వారి సమ్మతిని పొందియుండవలె.
ో శిలా శిల్పులు బౌద్ధ భిక్షువులు కూడా ఐ ఉండవచ్చును.

శాక్య గౌతముడై జన్మింపక పూర్వము ఆయన 4 అసంఖ్యేయ కల్పముల

కాలము క్రిందట బ్రహ్మచారియై దీపంకరబుద్ధుని వల్ల దీక్ష పొంది అప్పటి నుండి అనేక జన్మము లెత్తి దశపారమితములు దాన,శీల, నైష్కర్మ్య, ప్రజ్ఞా, వీర్య, సత్య, క్షాంతి, అధిష్టాన, మైత్రి, ఉపేక్షలు, అనుష్టించి సిద్ధి పొంది యుండెను. ఆయన ఎత్తిన జన్మలు మనుష్య జన్మలే కాదు. పశుపక్షి వృక్షాది జన్మలు కూడా ఎత్తెను. ఏ జన్మమెత్తినను తన దీక్ష మరువక దశపారమితములు అనుష్ఠించెను. ఆ జన్మలలో జీవించిన దశలకే బోధిసత్త్వ సంజ్ఞ కలదు.

గౌతమ బుద్ధుడు బుద్ధత్వము పొందిన వెంటనే మారుడు వచ్చి ఆయనను బహువిధముల ధర్షింప యత్నించెను. అందులో ఒకటి. 'గౌతమా, నీవు బుద్ధుడ వైతివి. వెంటనే నిర్వాణమున ప్రవేశించి నిర్వాణ సుఖమనుభవింపుము' అని సమ్మోహింప యత్నించుట. కాని బుద్ధుడు ఈ చతుర్దశ భువనములుకర్మ బంధములో చిక్కి దు:ఖములో బాధపడుచుండగా వారిని అందరినీ ఉద్ధరించే ఉపాయము బోధించక నేను నిర్వాణ సుఖ మర్థింపను' అని భీష్మించెనట!

పై విషయములు సర్వ సామాన్యముగా బౌద్ధ శాఖలన్నియు విశ్వసించున వైనందున శిలా శిల్పులు ప్రతిపాదించిన శిలా శిల్ప రహస్యము బౌద్ధాచార్యులను అందరిని నెమ్మది నెమ్మదిగా ఆకర్షించి ఒప్పించి ఉండవలెను.

'బోధిసత్త్వమూర్తులు ఈ శిలా బంధములలో చిక్కుకొని మూర్తీభవించి భక్తులకు దర్శనమిచ్చి ఉద్ధరించుటకుఆరాటపడుచున్నవి. భగవానుడు చతుర్దశ భువనములలో జీవకోటికి కర్మబంధము నుండి విముక్తి కల్పించవలెనని ఆరాట పడలేదా? మేమును శిలాబంధములో చిక్కుకొని మాకు దర్శనమిస్తున్న బోధిసత్త్వా వతార మూర్తులకు శిలా బంధము తొలగించి సువ్యక్తము చేయదలచినాము'.

స్థూలముగా పైన వివరించిన విధముగా శిలా శిల్పాచార్యులు బౌద్ధస్థ విరులకునివేదించి వారి అనుజ్ఞ పొంది ఉండవలె! శిలా శిల్పాచార్యులు మొదట వెలువరించిన బోధిసత్త్వ మూర్తులను చూచి స్థవిర భిక్షువులు కూడా సమ్ముగ్ధులై ఉండవలెను. ఇట్లు మొదట పొందిన అనుజ్ఞ, తర్వాత తర్వాత శాసనముగా మారి శిలా శిల్పము బహుముఖములుగా విస్తరించి వైభవ స్థితిని సంపాదించి ఉండవలె!

# 5

పోయిన సంవత్సరము నేను నా 'విజయపురి' నవలా రచనకు ఆధారములు గ్రహించుటకు నాగార్జున సాగరము వెళ్లి యుంటిని. అక్కడ నాకు పెద్దలెందరో విజయపురి పూర్వ వైభవమును లీలగానైనా తెలుసుకొనడానికి ఎంతో వాత్సల్యముతో సహకరించిరి. అట్టి వారిలో యువకుడు ఉత్సాహశాలి ఐన శ్రీ కొండిపర్తి శేషగిరి రావు ఒకరు. ఆయన మహాశిల్పుల వంశములో జన్మించిన వారు. శిలను శిల్పముగా రూపొందించుటకు శిల్పులు అనుష్ఠించు కార్యక్రమము వివిధ దశలను వారు వర్ణించుటే కాక, తొమ్మిది దశలను స్కెచ్‌ని రూపముగా వ్రాసి ఇచ్చి అభిమానము చూపి నేనుచదువ దగిన గ్రంథాలు కూడా సూచించినారు. అదంతా ఒక ఎత్తు! ఆ మాటలను వారు వివరించలేదు.

'వరస్థలాలుతీసివేడము' అని శిల్ప పరిభాషను గూర్చి మననము చేయగా చేయగా ఆ మాటలు ఎంతో అద్భుత మనిపింప సాగినవి. వారు ఏదో సందర్భ వశముగా అన్నమాటే ఐనా నాకు హృదయానికి హత్తుకొన్నది. వరస్థలాలు అంటే ఏమిటి? శిలలో మూర్తి కాకుండాఉన్నస్థలాలు అన్నమాట; స్వస్థలము అందులో దాగి ఉన్న మూర్తి, తక్కిన శిలా భాగమంతా దానిని బిగించి వట్టి మాటుపరిచిన పరస్థలాలు!

ఈ మధ్య ఫ్లొరెంటైను, శిలా శిల్పులలో మహాశిల్పి అని ప్రఖ్యాతి పొందిన మైకేలు అంజిలో జీవిత చరిత్రచిత్రించిననవల చదవడము తటస్థీకరించినది. అతడు గొప్ప చిత్రకారుడూ, కవీ, మందిర నిర్మాణ మహాస్థపతీ ఐనా, ఆయనకు అభిమానమైనది శిలా శిల్పము. అతడు రూపొందించిన శిలా మూర్తి నొకదానిని చూచి సంపన్నుడొకడు ముగ్ధుడై, 'ఈఅద్భుత శిల్పమును ఎట్లా చేయగలిగినావు?' అని ప్రశ్నింపగా ఆ మహాశిల్పి ఇట్లుప్రత్యుత్తరమిచ్చెనట!

"I had a block of Marble in which was concealed the statue which you see there. The only effort involved is to take away the tiny pieces which surround it and prevent it from being seen. For anyone who knows how to do this, nothing could be easier."

( ఇక్కడ కనబడేమూర్తి దాగి ఉన్న శిల నాకు లభించినది. ఆ మూర్తిని చుట్టుకొని దానిని కనబడకుండా చేస్తున్న చిన్న చిన్న ముక్కలను తీసి వేయుట ఒక్కటే చేయవలసి ఉన్న పని. ఆ పనిచేయడము ఎరిగినవారెవరైనా అది సులభంగా చేయగలరు!')

శిలాశిల్పి చేసేది రాతిని చెక్కడము కాదు. తన హృదయములోని భావనకు అనుగుణంగా శిలను మూర్తిగామలచడముకాదు. చంద్రకాంత శిలలో స్వయంభువుగా నిక్షిప్తమై ఉన్నశిలామూర్తిని దర్శించి,దాని చుట్టూ నిలిచి బంధించి మరుగుపరుస్తున్న పరస్థలాలను - శిలాబంధాన్ని - తొలగించి,దాని స్వరూపము ఆవిష్కరింపజేయడము. మాతృగర్భములో ఉన్న శిశువును వేరు చేసే మంత్రసాని పని వంటిది కూడా కాదు మాయాబద్ధుడైనజీవునికి మాయాబంధ విచ్ఛేదము చేసి స్వస్వరూపమైన ఆత్మ జ్ఞానము కలిగించే,'గురుర్బ్రహ్మా గురు ర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురుసాక్షాత్పర బ్రహ్మ' అనినిత్యము ఉపాసకులచే కీర్తింపబడేసద్గురు స్వామి వంటివాడు!

ఇట్టి విశిష్టత ఇతర లలిత కళాకారులకెవ్వరికీ లేదు. ఒక్క శిలా శిల్పికే తప్ప!

-భారతి 3/73

## కవి సామ్రాట్ విశ్వనాథసత్యనారాయణ:ధర్మపాల విజయపీఠికలో -

మహామంత్ర శాస్త్రవేత్తలు, అథర్వవేదవిదులునయిన గొప్ప పూర్వ విశ్వ బ్రాహ్మణ కుటుంబము వారి చరిత్ర యిందలి కథ. పూర్వ మీదేశమున విశ్వబ్రాహ్మణులెట్టివారో యీ కావ్యము నిరూపించుచున్నది. వారి ప్రాచీన సభ్యత, వారి వైదిక లౌకిక శిల్ప ప్రాగల్భ్యము వేద శాస్త్రాగమ శిల్ప వాస్తు గ్రంథములలో ప్రత్యక్షముగా వ్యాఖ్యానరమ్యముగా కాంచఁగలము. విశ్వకర్మ పురాణ - నాగర ఖండాది గ్రంథములు వీరి ప్రాశస్త్యమును చాటునని తెలుగులో గూడ నున్నవి. నేఁటికిని విశ్వబ్రాహ్మణులలో ఉపాసనాపరులు, మంత్ర శాస్త్రవేత్తలు గలరు. వంగవోలు తాలూకాలోని "మాచయ బత్తులవారు" ప్రసిద్ధులు.

ఈ కావ్యమున విశ్వకర్మ, శిల్పిబ్రాహ్మణ, దేవబ్రాహ్మణ,

జగదాచార్యాదిశబ్దములు పర్యాయపదాములుగా ప్రయుక్తములయినవి. దేవ బ్రహ్మణుఁడనునది "దేవపూజకుఁడైన బ్రాహ్మణుడు" అనియే కాకుండ, దేవనిర్మాతయైన బ్రాహ్మణుడఁడని కూడ విగ్రహముసాధించుట. యీ కవి సంప్రదాయజ్ఞతను వెల్లడించినాఁడు.

**శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థాన కవి: ధర్మపాలవిజయ పీఠిక -**

విరాడ్విశ్వకర్మయొక్క పంచముఖముల నుదయించిన సానగాది బ్రహ్మర్షుల సంతానమగు కొందఱు శిల్పాచార్యుల శౌర్యపరాక్రమములు, మంత్రయంత్ర ధనుర్విద్యాదికౌశలము, దేవతోపాసనా ప్రభావము, దేవతాసాక్షాత్కారము, లోకోత్తర శిల్ప ప్రాగల్భ్యము, భూతదయ పరోపకారాది సుగుణ సంపత్తియు నిందు భూయిష్ఠముగా వర్ణింపఁబడి యున్నవి.

ఈ విశ్వకర్మ వంశమును ఁ జెందిన త్వష్టము, విశ్వరూపుడు, మయుఁడు మహాప్రభావ సంపన్నులుగాను, లోకాతీతమహిమాతివిశాల యశోవిరాజితులుగాను వేదాదివాఙ్మయములో వర్ణింపఁబడియున్నారు. పంచముఖ బ్రహ్మ వంశీయులగు బ్రాహ్మణులకుంబలె వేదకర్మాధికారమే, కాక, శిల్పకర్మాధికారము గూడ విశేషించి కలదు. వీరు విశ్వమానవకోటికిఁజేయని యుపకారకార్య మొక్కటియును లేదు. అణువు మొదలు బ్రహ్మాండమువఱకువీరు నిర్మించినదియేయనుట సిద్ధాంతము ఈ యంశము లిందు యథావకాశముగా సూచితములనవచ్చును.

భగవంతుని సృష్టికి అనుకరణ ప్రాయమైన శిల్పము తండ్రిననుసరించు చున్న కుమారుని చేష్టవంటిది. జీవితమునకవసరమైన ఎల్ల అవసరములను ఆవహించి ప్రపంచ స్థితికి ఆధారప్రాయమైన శిల్పము ఎల్లరకు శిరోధార్యమైనది. దానిననుభవింపుచు ఆనందించుచున్న మానవునివ్యావహారిక జగత్తునుండి మేధో జగత్తు నుండి వెలువడ్డవివిధ వేదజాలం నిత్యమహా అనుసధేయములైనవి. అవి మన సంస్కృతికి మణిదీపికలనిగుర్తించుట అత్యావశ్యకము.

# అనుబంధం

## మన సంస్కారాలు - పారమార్థిక దృష్టి

పూజ్యశ్రీ గడియారం రామకృష్ణ శర్మగారు

అలంపురంస

**మహాజనులారా!**

గుంతకల్లులో "అన్వేషణ" సంస్థ పక్షాన నేను చేస్తున్న ఈ ఉపన్యాసము మూడవది, చివరిది కూడా, ఈనాటి విసయం 'మన సంస్కారాలు- పారమార్థిక దృష్టి'.

సంస్కారము అంటే మానవుని మీద పుట్టినప్పటి నుంచి పరిసరాలవల్ల, తన ఇంట్లోని వాతావరణం వల్లా, బయటిచర్యలవల్లా, ఆహార విహారాల వల్లా, వాతావరణం వల్లా అనేక ప్రభావాలు పడతాయి. ఆ ప్రభావాన్నే సంస్కారం అంటాము. ఈ సంస్కార అనేపదం చాలా విశాలమైన అర్థాన్ని కలిగి ఉంది. అసలు అర్థమేమంటే"పవిత్రీకరణం", సంస్కరించడమే అపరిశుభ్రంగా ఉన్నదాన్ని పరిశుభ్రం చేయడం, ఒకరు వ్రాసిన దానిలో తప్పు ప్రభావాలు పడక తప్పదు. కాబట్టి జీవుని ఆ ప్రభావాలనుండి, ఉత్తమ సంస్కారాలతో సంస్కరించి వాని శరీరాన్ని మనస్సునూ పరిశుద్ధం చేయవలసిన అవసరమున్నది.

ఉద్దేశ్యము : ప్రాచీన మహర్షులు ఈ సంస్కారాలను గూర్చి వివిధములుగా వివరించినారు. మనువు ఇట్లా అన్నాడు.

"వైదికై : కర్మభిఃపావన ప్రేత్యచేహన" (మనుస్మృతి) పవిత్రములైన వైదిక కర్మలచేత శరీరమును గర్భాదానాది సంస్కారములు చేసి అనుభవించడానకి యోగ్యం చేయవలెను)

"స్వాధ్యాయేన వ్రతై: హోమైః। త్రైవిద్యేనేజ్యయా సుతై:।

మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ । బ్రాహ్మీయం క్రియచే తనుః॥

(పై సంస్కారాల చేత వేదాధ్యయనాదులు వ్రతహోమాదులు చేయు ధికారము - సంతాన ప్రాప్తి, యజ్ఞకర్మలు సిద్ధించి శరీరము బ్రహ్మప్రాప్తికి అర్హము గలదు)

"నిషేకాది స్మశానాంతాః। బ్రాహ్మీయం క్రియచే తనుః॥

(పై సంస్కారాల చేత వేదాధ్యయనాదులు వ్రతహోమాదులు చేయు దికారము - సంతాన ప్రాప్తి, యజ్ఞకర్మలు సిద్ధించి శరీరము బ్రహ్మప్రాప్తికి అర్హము గలదు)

"నిషేకాదిస్మశానాంతాః! తేషాంవై మంత్రతః క్రియాః"

(గర్భాద్యామృత్యుపర్యంతా: సంస్కారా : షోడశైవహి ।

అర్యైతిహ్యాం పురస్కృతం యద్యత్ । మేధ్యమత్రతదుచ్యతే

ఆ సంస్కృతంతుయల్లోకే। తదమేధ్యం ప్రకీర్తతే॥

(ఆర్య సంప్రదాయాల ప్రకారం శరీరమూ ఆత్మా పరిశుద్ధాలు కావడానికి, ర్భాధానం మొదలు మరణం వరకు 16 సంస్కారాలను చేయవలెను. ఏ శరీరం ఈ సంస్కారాల చేత సంస్కరించబడుతుందో అది పవిత్రమౌతుంది. సంస్కారం ేయనిది అపవిత్రం అవుతుంది.)

## ంస్కారాలు ఎన్ని?

ఈ సంస్కారాలు ఎన్ని అనే విషయంలో మహర్షులకు అభిప్రాయ భేదాలున్నా ు. గౌతమ మహర్షి తన ధర్మ సూత్రాలలో సంస్కారాలు 40 అన్నాడు. అంగీరస హర్షి తనస్మృతి గ్రంథంలో 25 సంస్కారాలను చెప్పినాడు. మనువు, వ్యాసుడు, ూజ్ఞవల్క్య మహర్షి సంస్కారాలు 16 అన్నాడు. పూర్వ మీమాంసలో గూ 16 సంస్కా ాలు చెప్పబడినాయి.

పూర్వ మీమాంస అనేది షడ్దర్శనాలలో ఒకటి. దాన్ని కర్మ మీమాంస అని ూడ అంటారు. అందులో కర్మల వాటి ప్రయోజనాలు ఆ చరించే విధానాలు, కర్మల వల్ల ఇష్టార్థాలు లభిస్తాయి. అనే విషయాలను వివరంగా చెప్పినారు. దాని ప్రవర్తకుడుజైమిని మహర్షి. ఈ కర్మవాదులు దేవుణ్ణి కూడా ఒప్పుకోరు. 'ఇందులో ెప్పిన కర్మలను వేదమంత్రాలతో ఆచరించండి మీ కోరికలు నెరవేరు ాయి

అంటారు. కర్మమే పరబ్రహ్మము. సంతానం కావలెనా? పుత్రకామేష్టియాగం, స్వర్గం కావలెనా జ్యోతిష్టోమయాగం, వర్షం కావలెనా? వారుణయాగం, పాపసంహారానికి అశ్వమేధయాగం. ఈ విధంగా ఒక్కొక్క మహాప్రయోజనానికి ఒక్కొక్క కర్మ చేయండని కర్మ ప్రాధాన్యాన్ని పూర్వ మీమాంస శాస్త్రం చెప్పుతుంది. కర్మల వల్ల ఇహ సుఖాలు, స్వర్గసుఖాలు లభిస్తాయి. అంతేకాని మోక్షం లభించదు. ఈ శాస్త్రంలో 16 సంస్కారాలను చెప్పినారు.

1. గర్భాదానం 2. పుంసవనం, 3. సీమంతోన్నయన, 4. జాతకర్మ, 5. నామకరణం, 6. నిష్క్రమణం, 7. అన్నప్రాశనం, 8. చూడాకర్మ, 9. కర్ణవేధ, 10. ఉపనయనం, 11. వేదవ్రతం, 12. సమావర్తనం, 13. వివాహము, 14. దీక్షామహావ్రతం ( వానప్రస్థం) 15. సన్యాసం, 16. అంత్యేష్టి (మరణ కర్మ)

ఈ సంస్కారాల వల్ల మానవ శరీరం పరిశుద్ధమైన, పవిత్రమైన బ్రహ్మపదవి లభిస్తుంది.

ఒక్కొక్క సంసారాన్ని గూర్చి తెలుసుకుందాం.

**1. గర్భాధానం** : మానవుడు పుట్టిన తరువాత వానికి సంస్కారాలు చేసి ఉత్తముడుగా తీర్చడంకంటే పుట్టకముందే సంస్కారాలు చేసి ఉత్తముడు పుట్టుటకై చేసే కర్మను గర్భాధానం అంటారు. ఈ సంస్కార ప్రయోజనాన్ని గూర్చి మనువు ఈ విధంగా చెప్పినాడు.

"నిషేకాత్‌బైజికంచైవ। గార్భికంచావ మృజ్యతే।

క్షేత్ర సంస్కార సిద్ధిశ్చ। గర్భాధాన ఫలం స్మృతం॥

(ఈ సంస్కారం వల్ల స్త్రీ గర్భంలోని దోషాలు, పురుషుని బీజంలోని దోషాలు పోతాయి) పదహారు సంవత్సరాల భార్య, ఇరవై అయిదు సంవత్సరాల భర్త సంతానము కొరకై పవిత్ర భావనలతో మొట్టమొదట కలియడం గర్భాదాన క్రియ దీన్ని నిషేకమని అంటారు. ఆ శుభదినమున దంపతులు అభ్యంజన స్నానాలు చేసి పరిశుద్ధ వస్త్రాలు ధరించి పవిత్రములైనవేదమంత్రాలతో హోమములు చేసిన తమకు ఉండవలసిన నియమాలు శాస్త్రములలో విశదంగా చెప్పబడినాయి. వారి భావనలను అనుసరించి ఉత్తమ సంతానం కలుగుతుంది. ఈ సంస్కారం వల్ల గర్భదోషాలు బీజదోషాలు నశిస్తాయి.

ఒక వ్యవసాయదారుడు తన భూమిలో పంట పెట్టదలచినప్పుడు క్షేత్ర బీజ
ంస్కారం చేస్తాడు. భూమి సారవంతమైనదైనా దానిలో చేయవలసిన కృషినంతా
స్తాడు. కలుపులేకుండా చేసి బాగా దున్ని విత్తనాలు చల్లడానికి యోగ్యమైన
న్నిగా చేస్తాడు. విత్తనాలనుగూడా అదే విధంగా చేస్తాడు. మంచి ఎన్నులను యేరి
రుగులు పట్టకుండా మందులు చల్లి శుభ్రం చేస్తాడు. మంచిపంటకు క్షేత్ర బీజ
ంస్కారము వంటిదే ఉత్తమ సంతానానికి గర్భాదాన సంస్కారము. భర్తయందు
ర్యకు దైవభావన ఉండవలె. భర్తకు భార్యయందు దాసీభావన కాకుండా మాతృ
వన ఉండవలెనన్నారు మహర్షులు. "ఆత్మావైపుత్రనామాసి" అని వేదవాక్కు,
ర్య గర్భంలో ఉండి తాను కుమారుడుగా పుట్టి ఆమెకుసేవ చేస్తాడు. ఆ పవిత్ర
వనతో ఇద్దరూ కలిసినపుడు గలిగే సంతానం ఉత్తమమైనదిగా ఉంటుంది.
ందుకు నిదర్శనంగా కొంతకాలం క్రిందటి పత్రికలో వచ్చిన ఒక వార్తను
ుపుతున్నాను. మీలో కొందరికి అది జ్ఞాపకం ఉండవచ్చు.

అమెరికాలో ఒక విచిత్రమైన కేసు కోర్టుకు వచ్చింది. ఒక ఇంగ్లీషు దంపతు
కు నీగ్రోవంటి పిల్లవాడు పుట్టినాడు. ఆ భర్త భార్యను అనుమానించి విడాకులకై
ర్టులో కేసు వేసినాడు. ఆ భార్య పవిత్రురాలు అందరికీ గౌరవపాత్రురాల.
యన గూడ మంచివాడే అయితే ఇంగ్లీషు దంపతులకునీగ్రో పుట్టడము ఆశ్చర్యకర
షయము. దీనిపై కోర్టులో చాలా చర్చలు జరిగినవి. విచారశీలుడైన జడ్జీగారు
దవివాదాలను బాగా పరిశీలించి ఆలోచనలో పడినాడు. ఒక నాడు భర్తను పిలిచి
ట్లాడినాడు. 'మీ ఇంట్లో నీగ్రో పరిచారకులున్నారా? లేదు" ' మీ పరిసరాల్లో
న్నారా? లేరు' మీ బార్య వాళ్లతో తిరిగేదా? 'ఎప్పుడూ తిరగలేదూ', మీ పడకింట్లో
గో ఫోటో ఉన్నదా? ఉన్నరి సార్ ఒక ఎగ్జిబిషన్‌లో నీగ్రో పిల్లవానిచిత్రం అందంగా
ంటే తెచ్చి పడకగదిలో పెట్టుకున్నాము. ఆ ఫోటో మా ఇద్దరికీ చాలా ఇష్టమైనది
న్నాడు. జడ్జికి చాలా సంతోషం కలిగింది. భర్తతోఅన్నాడు. నా అనుమానం
త్యమైంది. నీ గదిలో నీగ్రో ఫోటో ఉన్నందువల్ల నీ భార్యకు ఆ సమయంలో
దానిపై భావన కలిగి ఉంది. అందువల్ల ఈ పిల్లవాడు పుట్టినాడు. అంటూ కేసు
కొట్టివేసినాడు. భర్త గూడ అంగీకరించినాడు. అందుకే మన పడకగదులలో మహా
పురుషుల దేవీ దేవుల చిత్రపటాలను అలంకరిస్తారు. భార్యాభర్తలలో పవిత్రభావన
గించడానికి ఆ ప్రకారం చేసేవాళ్లు ఇప్పుడు మనం ఈ సంస్కారాన్ని అనారికమని

మానుకుంటున్నాం. ఒకవేళ ఎవరైనా ఆచరించినా అసహ్యామైన రీతిలో తప్పని సరి ద్దుకొని చేస్తున్నారు. మంత్రంలేదు తంత్రం లేదు, విధానం లేదు. ఎలాగో ముగిస్తున్నారు. ఈపరిస్థితిలో మనకు ఉత్తమ సంతానం ఎట్లా కలుగుతుంది?

2. **పుంసవనం** :- స్త్రీ గర్భవతి అయిన తరువాత రెండవ నెలలోనో మూడవ నెలలోనో చేయవలసిన సంస్కారం పుంసవనం. అంటే పురుషుడు కావలెనని చేసే యజ్ఞం. అంతేకాక, గర్భానికి 2-3 నెలల్లో కొన్ని అరిష్టాలు కలుగుతాయి. వాటిని నివారించడానికి ఈ కర్మ అవసరం. పిండానిక పూర్తి ఉపయవాలు ఏర్పడవు. పుట్టబోయే శిశువు పురుషుడు కావాలనేది దంపతులకుకలిగే కోరిక. మనవాళ్లు సాధారణంగా స్త్రీలు కానీ పురుషులు కానీ తమకు కొడుకే పుట్టాలనీ కోరుకుంటారు. ఆడుబిడ్డ కావాలని కోరుకునే వాళ్లు తక్కువ. పూర్వం మనవాళ్లు వంశవృద్ధికి కొడుకూ, కన్యాదాన ఫలం రావడానికి కూతురూ కావలెననికోరుకునేవారు. ఇప్పటి వరకట్న దురాచారాలు అప్పుడు అంతగా లేవు శిశువుకు ఇంద్రియాలు ఏర్పడక ముందే ఈ కర్మ జరుపవలెను. అందుకు హోమాలు చెయవలెను. దంపతులు ఆనాడు అభ్యంజన స్నానాలు చేసి శుభ్రవస్త్రాలు ధరించి పురోహితుడు చెప్పిన ప్రకారం మంత్ర పూర్వకంగా ఈ సంస్కారం ఆచరించి, అగ్నిని ఆరాధిస్తారు. తరువాత గర్భవతికి మఱ్ఱిచిగుళ్ళు, తిప్పతీగ ఎండించి చూర్ణము చేసి భద్రపరచుకొని ప్రతిరోజు కషాయం చేసుకొని త్రాగుచుండవలె. గర్భపీడలను ఈ ఔషధులు నివారిస్తాయి. పీటికి అంతశక్తి ఉన్నది. ఈ సమయంలో గర్భవతులు వాంతులు చేసుకుంటారు. ఏది తిన్నా వాంతి అయిపోతుంది. ఆమె బలహీనురాలవుతుంది. పై కషాయమూ శొంఠి వేసిన పాలూ సేవిస్తే ఆ వాంతులు తగ్గుతాయి. మనప్రాంతంలోఈ పరిస్థితిని బైకలు అంటారు. కన్నడ భాషలో 'బయకె' అంటారు. అంటే కోరిక, అది తెలుగులో బైక అయింది. తూర్పు వాళ్లు 'వేవిళ్లు' అంటారు. ఆమెకు పుల్లని వస్తువులు తినాలని బాగా కోరిక పుడుతుంది. ఈ కర్మ జరపడంవల్ల అన్ని అరిష్టాలు పోతాయి. భర్త అగ్నిలో హోమం చేసి ఈ మంత్రం చదువుతాడు.

'పుమాంసౌ మిత్రావరుణౌ! పుమాంసావశ్వినీవుభౌ

పుమానగ్నిశ్చ వాయుశ్చ! పుమాన్ గర్భస్తథోదరే!!

3. **సీమంతోన్నయనము** : గర్భధారణ జరిగిన తరువాత 6-8 నెలల్లోను ఆమెకు శారీరముగా కొన్ని కష్టాలు వస్తాయి. అప్పుడు చాలా జాగ్రత్తగా ఉండవలె.

ఇప్పుడంటే మనం 15 దినాల కొకసారి లేడీ డాక్టరుకుచూపించుకుంటున్నాం. అప్పుడీ సౌకర్యాలు లేవు. వైద్యశాస్త్రమూ ధర్మశాస్త్రము చెప్పిన పద్ధతులలో నడుచు కొనే వాళ్లు అందువల్ల కష్టాలు తీరేవి. పుంసవనం తరువాత పిండంఅభివృద్ధి పొంద డానికి సీమంతోన్నయనం 6-8 నెలల్లో జరుపవలెను.

విధిప్రకారం చేయవలసినీ సంస్కారాన్ని మన ఇష్టం వచ్చినట్లు చేస్తున్నాం. ఇప్పుడందరూ చేసేసీమంతం ఇలా ఉంది. ఒక మంచి దినం బేసి నెలల్లో చూచి గర్భవతికి అభ్యంగన స్నానం చేయించి శక్తి కొలదీ మంచి చీర, రవికె కట్టించి కొన్ని విధాల పిండివంటలు చేయించి ఒడినింపుతారు. ఊరిలోని ముత్తయిదువులకుపిలిచి పేరంటం చేసి వచ్చిన వారికి కుంకుమా తాంబూలమూ ఇచ్చి పంపుతున్నారు. తెచ్చిన పిండీవంటలను గర్భవతితోతినిపిస్తారు. అవన్నీ తిని ఆమె ఆరోగ్యం పాడవు తున్నది. ప్రసవం కష్టమవుతున్నది. పద్ధతి ఇదికాదు. సీమంతం అంటే పాపిట. ఉన్నయనం అంటే దాని చెదరగొట్టడం. అనగా ఈ సంస్కారం జరిపిన నాడు సమంత్రకంగా పూజా, హోమములు జరిపి 'దర్భకూర్చతో' భర్త ఆమె పాపిటలోని వెంట్రుకలను చెదరగొట్టవలెను. 8 నెలలో ఆమె అందంగా తలదువ్వుకొని అలంకారం చేసుకుంటూ ఉంటే ఆమెలోను ఆమె భర్త లోను కొన్ని ఉద్రేక భావాలుకలుగవచ్చు. దాని ఫలితంగా గర్భం పతనం రావచ్చు. దాన్ని నిరోధించడానికే ఈ కర్మ ఉద్దేశించబడింది. 6వ నెలలో ఈ సంస్కారం జరిపితే అప్పటినుండీ భర్త దీక్షగా బ్రహ్మచర్యం పాటించవలసి ఉంటుంది. గర్భవతి కూడా అలంకారాలు మానుకొని శుభ్రముగా ఉంటూ తేలిక ఆహారాలుతీసుకుంటూ ఉండవలెను. ఈ సంస్కార విధి ఇలా ఉంటుంది.

సతీపతులు స్నానం చేసి నూతన వస్త్రాలు ధరించి, గణపతి పూజ, స్వస్తి వాచనములుజరిపించి అగ్నిని ఆరాధించవలెను. కొన్ని వేదమంత్రాలు పఠిస్తూ, మినుప పప్పు, బియ్యము కలిపి వండిన అన్నముతో మంచి నేయితో హోమము చేయవలెను. ఈ తరువాత భర్త భార్యకు తలమీద దువ్వెనతో చక్కగా పాపిట తీసి మేడిపుల్లతో గాని, మద్దిపుల్లతోగాని, దర్భలతో గాని వెంట్రుకలను కదిలించి పాపిట చెదరగొట్టవలెను. ఆ తరువాత వీణ మొదలైన వాద్యాలువాయించి స్త్రీలు పాటలు పాడవలెను. హోమము చేయగా మిగిలిన ముద్గోదన పాత్రలో (మినపప్పుతో అన్నము ఉంచినది.) హోమము చేయగా మిగిలిన నేయి వేసి, అందులో గర్భవతి

తన నీడను చూసుకోవలెను. పిదప ఆ అన్నమును ఆమె భక్షించవలెను. పెద్దలకు నమస్కరించి ఆశీస్సులు పొందవలెను. సామవేద మంత్రములు పఠింపగా వినవలెను. ఈ సంస్కారం వల్ల ఆమె గర్భపీడ ముఖప్రసవముతో ఉత్తమ సంతతి కలుగును.

**4. జాతకర్మ :** పదవ మాసంలో గర్భవతి ప్రసవించిననాడు అప్పుడే "జాతకకర్మ" సంస్కారం జరుపవలెను. ఈ సంస్కార ప్రయోజనమేమనగా 'గర్భాంబు పానజోదోషో, జాతాత్ సర్వోపినశ్యతి! ఆయుర్వర్చోభివృద్ధిశ్చ! సిద్ధిం వ్యవహృతేస్తథా॥ తల్లి గర్భంలో ఉన్నపుడు శిశువు అశుద్ధమైన గర్భజలం త్రాగును. జాతక కర్మవల్ల ఆ మురికి పదార్థమంతా వెళ్లిపోయి శిశువు పరిశుద్ధుడౌతాడు. ఆయుస్సు, వర్చస్సుల వృద్ధి ఈ సంస్కారం వల్ల జరుగుతుంది.)

శిశువు తండ్రి ప్రసవ గృహంబైట అగ్నిని ఆరాధించి హోమము చేయవలెను. ఒక గిన్నెలో మంచి తేనే ఉంచి బంగారు ఉంగరంతో గాని కంకణంతోగాని ఆ తేనెను బాగా కాచి ఆ సొమ్ముతో శిశువు నాలుకపై శిశువుకు కడుపులోని మైల పదార్థమంతా మల రూపంలో బయటకు వస్తుంది. డాక్టర్లు కొందరు పుట్టిన శిశువుకు గర్భ దోషములనుంచి ముక్తుడై పరిశుద్ధుడై చక్కని వర్చస్సు కలవాడై దినదినాభివృద్ధి చెందుతాడు. వాత కఫ దోషాలు పోతాయి.

పరిస్థితులు మారిపోయినవి. ప్రసవములు సాధారణముగా ఆసుపత్రులలో జరుపుకొంటున్నాము. అక్కడ ఈ కర్మ జరుపుకోలేము. అందువల్ల నామకరణం నాడే జాతకకర్మకూడా జరుపుకుంటున్నాము.

**5. నామకరణం :** అంటే పిల్లవానికి పేరు పెట్టడం అని అర్థం. ఈ కర్మను ఇంచుమించు అందరూ ఏదో విధంగా చేస్తున్నారు. కొందరు మా ఇంట్లో ఈ పద్ధతి లేదు అంటూ చేయరు. కొందరు మా ఇంట్లో ఆడపిల్లకు నామకరణం చేసే ఆచారం లేదంటారు. కొందరు ఉభయులకూ చేస్తారు.

సాధారణంగా నామకరణం సంస్కారం 11 రోజున గాని, 19 రోజున గాని. 21 రోజున గాని చేస్తున్నాం. తల్లిదండ్రులుస్నానాదులచే శుద్ధులై శిశువును తమ తొడమీద పండబెట్టుకొని, నాందీస్వస్తి వాచనములు - హోమము జరుపుకొని ఒక పళ్లెములో బియ్యము పోసి, మాసనామము, నక్షత్ర నామము, వ్యవహారనామము

వ్రాసి పూజ చేసి, ఈ పేర్లను శిశువు కుడిచెవిలో చెప్పవలెను. ఇప్పుడు ఈ విధి లేకుండా ఒక రోజు పండుగ చేసుకొని శిశువునుతొట్లలో వేసి ముత్తయిదువులను పిలిచి పేరంటము చేసి పిల్లవాని చెవిలో మేనత్త తమ కిష్టమయిన పేరు ఉచ్చరిస్తుంది. ఈ విధంగా ఈ కర్మను ఒక వేడుకవలె చేసుకొంటున్నాం. ఇది చాలా ముఖ్యమైన కర్మ. దీని ఉద్దేశమేమంటే శిశువు పెద్దవాడైన తరువాత వాని గ్రహచారాదులు పరిశీలించడానికి వీలుగా వాడు ఏ నక్షత్రంలో ఎన్నవ పాదంలో పుట్టినాడో ఆ నక్షత్ర పాదమును తెలిపే అక్షరం మొదలు వచ్చేటట్లు దేవునిపేరో తమ పెద్దలపేరో పెట్టుకోవలెను. శిశువు జాతకం లేకున్నాపేరును బట్టి నక్షత్రం తెలుసుకోవచ్చు. మరొక ముఖ్యోద్ధేశమేమంటేవీరుపెద్దయిన పేరు వ్యావర్తనం - నిర్దేశనం - ఆదర్శనములకు ఏర్పడినట్టిది. వ్యావర్తనం అంటేఇతరులనుండి వీనిని వేరు చేయడం, నిర్దేశన మంటే ఉన్నత లక్ష్యము కలవాడని చెప్పడం. ఈ ఉద్దేశంతో పేరు పెట్టవలె. మరో ముఖ్యోద్ధేశం పిల్లవానికిదేవుని పేరుపెడితే వానిని పిలిచినప్పు డంతా దేవుణ్ణి స్మరించినట్లు అవుతుందని, ఈ సందర్భంలో బాగవతంలోని ఒక కథను మీకు జ్ఞాపకం చేస్తున్నాను.

"అజామీళుడు అనే బ్రాహ్మణుడు మహాపాపి, ఎన్నడూ భగవంతుని తలచుకొనేవాడు కాడు. అతని కొడుకు పేరునారాయణ. మరణ సమయంలో కొడుకును పిలుస్తూ చచ్చిపోతాడు. అతని ఉద్దేశం భగవంతుని స్మరించడం కాదు. అంతమాత్రంతోనే ఆ పాపాత్మునికి ముక్తి లభిస్తుంది. ఆ కథ వల్ల మనకు తెలిసేది ఏమంటేకొడుకు పేరుతో అయినా దేవుని స్మరించే అవకాశం లభిస్తుంది అని ఈ భావనతో నామకరణం చేసుకోవలెను.

**6. నిష్క్రమణం:** నామకరణం తరువాత మూడోనెలలోనో, నాలుగవనెలలోశిశువును ఇంటిలోనుండి బయటికి తీసుకొని వస్తారు. ఆ కర్మను "నిష్క్రమణం" అంటారు. ఆ రోజు శిశువును స్నానం చేయించి బంధువులతో దేవాలయానికి తీసుకొనివెళ్లి దేవునికి చూపించి ఇంటికి వస్తారు. అంతవరకూ శిశువు ఇంట్లో ఉంటాడు. సూర్యుని చూచిన తరువాత బయట తిరగవచ్చు.

ఈ సంస్కారాన్ని గూర్చి పారస్కర గృహ్యా సూత్రము దినమున తల్లిదండ్రులు పరిశుద్ధులై ఈశ్వరోపాసన చేసి శిశువుకు కుడిచెవిలో కొన్ని మంత్రములు ఉచ్చరించి

మొదటి సారిగా ఇంటి బయటికి తెచ్చి సూర్యునకు చూపించవలెను. ఇప్పుడు పై విధముగా చేయక, పిల్లవానినిదేవాలయానికి తీసుకొని పోయి వస్తున్నారు. ఈ కర్మ వల్ల శిశువుకుదృష్టి దోషములు కలుగదు. పిల్లవాడు అభివృద్ధి చెందుతాడు.

7. అన్న ప్రాశనం : షష్ఠే మాస్యన్న ప్రాశనం। ఘృతౌదనం తేజస్కామః॥
దధి మధు ఘృతమిశ్రిత మన్నం ప్రాశయేత్॥
(అశ్వలాయన గృహ్యసూత్రాలు

శిశువు మొదటి సారి అన్నము తినిపించే కర్మకు అన్నప్రాశనంఅంటారు. మగపిల్లవానికి (6-8 నెలల్లోనూ, ఆడపిల్లకు 5-7 నెలలోనూ ఈ సంస్కారంచేయవలె. ఉపనిషత్తులలో "అన్నం పరబ్రహ్మస్వరూపం" అని చెప్పబడింది. అట్టి అన్నాన్ని పవిత్రమైన వేదమంత్రాలతో అగ్నికి నెయ్యి అన్నముతో ఆహుతులు వేసి మిగిలినఅన్నంలో తేనె పెరుగు చేర్చి తండ్రి శిశువుకుమంత్ర పఠనం చేస్తూ తినిపించవలె. ఈ విధంగా చేయడం వల్ల ఆహార దోషాలు రాకుండా ఆయుస్సు - బలం - తేజస్సు కలుగుతుంది.

ఈ సంస్కారం జరిపేవరకు శిశువునకుతల్లి పాలు త్రాగుతూ ఉంటాడు. కొందరు తల్లులకు ప్రసవమైనప్పటినుండి పాలు లేని వాళ్లున్నారు. ఇంకా నాగరికం, ఎక్కువై పై స్థాయిలోఉండేతల్లులు పిల్లలకు పాలుతాపిస్తే యవ్వనం పోతుందని భావించి కృత్రిమమైన డబ్బాపాలుతాపిస్తారు. తల్లి పాలలో పెరిగిన శిశువు ఆరోగ్యవంతంగా ఉంటుంది. సంవత్సరం నిండేవరకుతల్లిపాలు త్రాగి ఉండవచ్చు. ఆ తరువాత మానిపించి శుద్ధమైన అన్నం శిశువు కొరకే వండించి పెట్టవలెను.

ఈ సంస్కారం జరిపి హోమ శేషమైన పవిత్రాన్నంతో అన్నం తినిపించే క్రమం ఆరంభమౌతుంది. మనం అశ్రద్ధతో ఈ సంస్కారాన్నిపద్ధతి ప్రకారం చేయడం లేదు.

8. చూడాకర్మ : శిశు 3వ ఏట తలవెంట్రుకలు తీయుట.

ఉదాహరణకుఒక చెట్టును తీసుకుందాం. ఒక కొమ్మనునరికితే చిగిరించి కొత్త కొమ్మ దృఢంగా పెరుగుతుంది. అదే విధంగా మగవాని వెంట్రుకలుకూడా, అందుకే మన పెద్దలు బ్రహ్మచారికి వానప్రస్తునికి కేశధారణను దీక్షగాచెప్పినారు. వెంట్రుకలు పెంచితే కామోద్దీపన శక్తి తగ్గుతుంది. అందుకే మన మహర్షులు -

సాధువులు వెంట్రుకలు తీయకుండా గడ్డాలు మీసాలుఅట్లే ఉంచుకుంటారు. శిఖలో అంత శక్తి ఉంది. వైదిక కర్మలో శిఖకు చాలా ప్రాధాన్యం ఉంది. శిఖ ఉండటం వల్ల కామోద్దీపనం తగ్గడమే కాక దైవీశక్తులు కూడా లభిస్తాయి. "విక్టర్-ఇంక్రోమోర్" అనే ఆంగ్ల వైజ్ఞానికుడు దీన్ని గూర్చి ఇట్లా వ్రాసినాడు.

"ధ్యానంచేసే సమయంలో ఓజశ్శక్తి ప్రకటితమవుతుంది. చిత్తాన్ని ఏకాగ్రం చేస్తే ఓజశక్తి ప్రసారం తెలుస్తుంది. భగవంతుని మీద మనస్సుకు ఏకాగ్రంచేస్తే తలమీద శిఖద్వారా ఓజశక్తి వెల్లడౌతుంది. ఆ మార్గం ద్వారానే దైవశక్తి కూడా తనలోకి వస్తుంది. యోగులు ఈ రెండు శక్తులను చక్కగా దర్శిస్తారు. "(విల్ - కల్పక)

బ్రహ్మచారీ వానప్రస్థుడూ శిఖ - జడలు, ఉంచుకోవడం వల్ల దైవీశక్తిని సాధిస్తారు. ఆధ్యాత్మికంగా బలవంతులవుతారు. ఇదంతా ఈ చూడాకర సంస్కారం వల్ల లభిస్తుంది. ఇందుకు ఉదాహరణంగా "హరివంశంలోని" ఒక కథ వినిపిస్తాను. వశిష్ట మహర్షికి జగజ్జేత అయిన ఒక శిష్యుడు ఉండేవాడు. ఆ కాలంలో ప్రజా పీడకులైన కొందరు రాజులు వశిష్టుణ్ణి ఆశ్రయించి అభయం కోరినారు. ఆయన వాళ్లకు అభయమిచ్చి మీ భయం ఏమిటని అడగ్గా తమ అనే వీరుడొకడుండేవాడు. అప్పటి రాజులంతా అతనికి భయపడేవారు "వారు బాగా ఆలోచించి అతని తలమీద శిఖవల్లనే అతనికి బలమని తెలుసుకుంటారు. నిద్రపోయేటప్పుడు అతని శిఖను తీసివేస్తారు. అంతటితో అతని బలం పోయింది'. ఈ కథ వల్ల మనకున్న నమ్మకాలే పాశ్చాత్యులకూఉన్నాయని తెలుస్తుంది.

ఈ శిఖ ప్రాధాన్యమును గూర్చి "హిబ్రూ" జాతీయుల శాస్త్రగ్రంథమైన 'తల్మన్" లో విశదీకరించబడి ఉంది. అమెరికాలోని ప్రసిద్ధ సైకాలజిస్టు "డా గిల్లర్ట్ థామస్" మరియు ఇంగ్లీషు డాక్టర్ "షాన్లీ హెల్" అనే వాళ్లు తమ దేశాలలోని స్త్రీలు మగవాళ్లవలె వెంట్రుకలు మాటిమాటికి కత్తిరించుకుంటూ ఉండడం వల్ల పురుషుల లక్షణాలుపెరిగి గర్భధారణ శక్తిని పోగొట్టుకుంటున్నారని చింతిస్తూ వ్రాసినారు. ఈ విధంగా వైజ్ఞానికంగా కూడా శిఖకు ప్రాధాన్యం ఉంది. సన్యాసి స్థాయికి వచ్చేటప్పటికి అతనికేమి ఉండరాదు. శిరోమండనంచేయించు కుంటాడు. అతడు అప్పటికేజితేంద్రియుడు. కావున అతనికి ఇబ్బంది లేదు.

ఈ చూడకర్మకు "చౌలము" అని గూడా అంటారు. చూడము అంటేజుట్టు, చూడమే చూలము అయి చౌలం అనిరూపాంతంచెందింది. దీన్ని 3-5 సంవత్సరా లలో చేయవలె. ఇప్పుడు ఉపనయన సమయంలో చేస్తున్నారు.

విస్తరలో భోజనపదార్థాలు, తాంబూలం, దక్షిణాపెట్టి, ఒక కంసాలిని పిలిచిన్పి. బంగారు పోగులతో చెవులు కుట్టిస్తారు. కంసాలిని గౌరవించి పంపుతారు. ఐతే, దీనికి గూడా కొంత తతంగం వుంది. తల్లిదండ్రులు పరిశుద్ధులై ఈశ్వరోపాసనాహోమముచేసి తరువాత మంత్రాలు పఠిస్తూ, శిశువు చెవులను కుట్టించవలెను. చెవుల్లో సూక్ష్మమైన నరాలు ఉన్నాయి. అనుభవంలేని వాడితో కుట్టిస్తే, శిశువుకు హానీ కలుగుతుంది. ఈ సంస్కారం చేయటం వల్ల, అంతవృద్ధి జరగదని,శుశ్రుత వైద్య శాస్త్రం చెపుతున్నది. బంగారు పోగులు వేయటం వల్ల, సువర్ణధారణ ఆరంభమవుతుంది. రోజూ, స్నానము చేయించేటప్పుడు ఈ బంగారు తాకిన నీరు శరీరం మీద పడుతుంది. దీనివల్ల ఆరోగ్యము, శరీర కాంతి పెరుగు తాయి. ఈ కర్మ మూడవయేట కాని, ఐదవ యేట కాని చేయవలెనని గృహ్యాసూత్రాలుచెప్పుతున్నాయి.

**9. కర్ణవేద - శిశువుకు చెవులు కుట్టుట - 3 లేక 5వ ఏట చేయవలె.**

**10. ఉపనయనం :** ఉపనయనంఅంటేసమీపమును చేరుట, అని అర్థము. అనగా గడువు సమీపానికిపోవడం అని అర్థం. ఈ సంస్కారము ఏడవ సంవత్సరం నుండీ, పదహారు సంవత్సరాల లోపల జరుపవలెను. ఈ సంస్కారము తర్వాత పిల్లవాడు విద్యార్థిగా గురువు సన్నిధికి పోతాడు. పదహారు సంస్కారాలలో ఉపనయనము, వేదవ్రతము, సమావర్తనమూ అనే మూడు మాత్రం ఉపనయనము చేసుకునే ఆచారము ఉన్న సంఘాలవారే చేసుకుంటారు. తక్కిన 13 సంస్కారాలు అన్ని సంఘాల వారూ చేసుకోవలెను. ఇది బ్రహ్మచర్యాశ్రమానికి సంబంధించినది. మూడు పోగుల 'యజ్ఞోపవీతాన్ని ధరించి, బ్రహ్మచర్యములో ప్రవేశిస్తాడు. ఈజందెములో వున్న మూడు పోగులకు అర్థంఉంది. ఇప్పటినుంచీ నేను త్రికరణ శుద్ధిగా నడుచుకుంటారు అని దీక్ష వహించడం. త్రికరణాలు అంటేమనస్సు, వాక్కు, ఆచరణ అనేవి ఈ దీక్షతో నడుచుకుంటాను అని దీక్ష వహించడం, త్రికరణాలు అంటే మనస్సు, వాక్కు, ఆచరణ అనేవి ఈ దీక్షతో గురువు దగ్గరకు పోతాడు. మనుధర్మం ప్రకారం ప్రతి మనుష్యుడు, దేవృణం, ఋషిఋణం,పితృ

ఋణం ఈ మూడింటినీ తీర్చుకోవలసిందే లేకపోతే అప్పుల పాలవుతాడు. మన జీవితానికై తీసుకున్న అప్పు తీర్చకపోతే ఐహికంగా నష్టం కలుగుతుంది. ఈ విధంగా నేమూడు ఋణాలు తీర్చకపోతే పారమార్థికంగా నష్టం కలుగుతుంది. వేద శాస్త్రాలను తెలిపినమహర్షుల ఋణం తీర్చుకోవాలంటేవాటిని చదివి రహస్యాలను తెలుసుకోవలెను. ఇతరులకూ బోధించవలెను. తర్వాత యజ్ఞాది కర్మలు చేసినట్లయితే దేవఋణం తీరుతుంది. సృష్టిలోని ప్రతి జీవిని పోసించి, రక్షిస్తున్న దేవతల ఋణం ఈ విధంగా తీర్చుకోవచ్చు. వివాహం చేసుకొని బిడ్డలను కని, వాళ్లను పెంచితే పితృ ఋనం తీరుతుంది. మొదటివైన దేవ, ఋషి ఋణాలు తీర్చుకోవటానికిగురువు దగ్గర అధ్యయనంచేసి, అర్హతను సంపాదించుకోవలెను. ఉపనయనానికి అర్థం ఇది. కేవలం మెడలో జందెం వేయటం కాదు గురువు దగ్గర విద్య ముగించి వేదవ్రత సంస్కారాన్ని సమావర్తన సంస్కారాన్ని జరుపుకోవలెను.

మనుష్యుడు ఏ వర్ణములో పుట్టినా పుట్టుకతో అంతాశూద్రులే! "జన్మనా జాయతేశూద్రః! కర్మనా జాయతే ద్విజ!। వేదాధ్యయనాక్ విప్రః! బ్రహ్మజానాతి బ్రాహ్మణః

ఈ సంస్కారంలో గాయత్రీ మంత్రజపాధికారము వేదాధ్యయన అధికారము కలుగుతుంది. బ్రహ్మ చర్యాశ్రమ నిష్టతో, జితేంద్రియత్వముతో గురుసన్నిధిలో నిర్వహించవలెను. ఈ సంస్కారముతో ధార్మిక జీవనం ప్రారంభమవుతుంది. యజ్ఞోపవీతమువేసుకున్నవాడు శరీరమును, వాక్కునూ, మనస్సునూ స్వాధీనంలో ఉంచుకోవటానికి సాధనచేయవలెను. శరీర సంయమము ద్వారా బ్రహ్మచర్యము, తపస్సూ సిద్ధిస్తాయి. వాక్సంయమము వల్ల వాచాలత్వమూ, అసత్య వాదిత్వము పోతాయి. మనస్సంయమము వల్ల చాపల్యము నశిస్తుంది. ఈ నియమాలను పాటించి ద్విజుడై భవిష్యత్తుకు చక్కని బాట వేసుకుంటాడు.

**11. వేద వ్రతము :** దీన్ని వేదారంభ సంస్కారము అంటారు. గాయత్రీ మంత్రం మొదలుకొని అంగ, ఉపాంగములో సహా వేదాలనుచదవటానికి ధరించే వ్రతంఅని అంటారు. ఒక శుభ దినమందు తన శాఖకు సంబంధించిన వేదమును చదవటానికి గురువు, శిష్యులకు చేసే సంస్కారము, దీన్ని గురించి వశిష్టుడు ఇట్లన్నాడు.

యచ్ఛాఖాకర్మ కుర్వతః తచ్ఛాఖాధ్యయనంతథా॥

(ఏ వంశమందు ఏ వేదశాఖా ఏ గృహ్యాసూత్రము పరంపరంగా వస్తున్నదో ఆ వంశీయుడు స్వశాఖా వేదముతో ప్రారంభం చెయ్యవలెను)

ఈ సందర్భంలో పరాశరుడిట్టన్నాడు.

"వేదాలను, వేదాంగాలనూ, ధర్మశాస్త్రాలనూ, అర్ధ సహితంగా చదవవలెను. అర్ధము లేకుండా వూరికే చదవటం ఊకదంపువలె నిష్ఫలము".

బాలునికి ఐదేళ్ల వయస్సు వరకూ తల్లి, ఆ తర్వాత ఎనిమిదేళ్ల వరకూ తండ్రి.తర్వాత ఇరవై ఐదేళ్ల వరకు గురువూ విద్యను నేర్పవలెను. అప్పుడేవాడువిద్యావంతుడై ధర్మార్థ కామమోక్షాది పురుషార్థాలను సాధించుటకు అర్హుడవుతున్నాడు.

**12.** సమావర్తనం : గురువు దగ్గర విద్య ముగించి, గృహస్థాశ్రమంలో ప్రవేశించటానికిఇంటికితిరిగివచ్చే సమయంలో సమావర్తన సంస్కారాన్ని జరుపుకోవలెను. దీనినే స్నాతకము అని కూడా అంటారు. విద్యను బోధించిన నియమభంగమునకు ప్రాయశ్చిత్తం చేసుకుంటాడు. బ్రహ్మచారి స్త్రీలతో సంభాషించుట, పాదరక్షలు ధరించుట, గొడుగుపట్టుకోవటం, నియమభంగాలు వీటన్నిటికి విడివిడిగా ప్రాయశ్చిత్తం జరుపుకోవాలి. ఆ తర్వాత గురువు శిష్యునిక భవిష్యత్తులో నడుచుకోవలసిన మార్గాన్ని ఉపదేశిస్తాడు. ఇప్పటి విశ్వవిద్యాలయాల్లో కూడా బి.ఎ. ఎమ్.ఎ. పరీక్షలు పాసైన విద్యార్థులకు డిగ్రీలు ఇవ్వటానికి సభ జపించి అనుభవజ్ఞులైన విద్యావేత్తలచేత సందేశమిస్తారు. దాన్ని "కాన్వకేషనల్ అడ్రస్" అంటారు.

**13.** వివాహము : గురువు ఆజ్ఞతో ఇంటికి వచ్చి విద్యార్థి వివాహం చేసుకుంటాడు. ఈ కర్మ అన్ని దేశాలలో, అన్ని సంఘాలో, జరుగుతూ వుంది. ఐతే, ఇది ఇతర దేశాల వాళ్లకు ఒక అగ్రిమెంట్, మనం ఇద్దరమూ ఇన్నాళ్లు కలిసి వుందాం. ఒకరిమీద ఒకరికి విశ్వాసమున్నంత వరకూ కలిసి వుందాం. సరిపడకపోతేవిడిపోదాం. అనే ఒప్పందం ప్రకారం. భార్యాభర్తలకు అభిప్రాయ భేదాలు వస్తే విడాకులిచ్చుకుంటారు. విడిపోతారు. కానీ మన వివాహం ఒక ఆధ్యాత్మిక బంధం. రెండు ఆత్మలు ఒక ఆత్మగా రూపొందించడానికి చేసే సంస్కారం ఇది. వివాహం అనే పదానికి అర్థం

ఏమిటంటే విశేషమైన బరువును మోయడం అని. బార్యభర్తలు ఒకరి బరువు నొకరు భరించుకోవలెను. దంపతులు ఒకరి నొకరు ఆనందపరుస్తూ ఉన్నట్లయితే ఆ వంశం సుఖంగా అభివృద్ధి చెందుతుందని మనువుఅన్నాడు. ఈ కర్మలో తండ్రి తన కన్యను ఒక పవిత్రమైనదిగా భావించి, పవిత్రుడైన ఒక వరుడికి ధారపోస్తాడు. భారతదేశంలో ఎనిమిది విధాలైన వివాహాలుండేవని ధర్మశాస్త్రాలుచెప్పుతున్నాయి. బ్రాహ్మం, దైవం, ఆర్షం, ప్రాజాపత్యం, ఆసురం, గాంధర్వం, రాక్షసం, పైశాచికం అనిఅవి ఇందులో బ్రాహ్మ వివాహం చాలా ఉత్తమమైనది. ఒక గృహస్థుడు ఉత్తముడైన వరుణ్ణి తన ఇంటికి ఆహ్వానించి తన శక్తి కొద్దీ కుమార్తెను అలంకరించి అతనికి ధారవోసి ఇచ్చేది. దైవ వివాహమంటే ఒక యజమాని యజ్ఞం చేస్తూ దాన్ని చేయిస్తున్న ఋత్వికుని విద్యార్హతలు, శీలము చూచి యజ్ఞదక్షిణగా తన కుమార్తె ను సమర్పించడం, అర్ష వివాహమంటే తండ్రి వరుడినుండి రెండు ఆవులుతీసు కొని తన కన్యనిచ్చి వివాహం చేయటం. వరుడే వచ్చి తన కన్యను కోరినప్పుడు అతని యోగ్యతను గౌరవించి వివాహం చెయ్యటం ప్రాజా సత్యం. ఆసుర వివాహ మంటే వరునికి ఏ యోగ్యతా లేకపోయినా కన్య తల్లిదండ్రులకుకానీ, ఇతర బంధువులకుకానీ ధనమిచ్చి కొనుక్కోవటం. ఈ పద్ధతిని "ఓలి" అంటారు. ఇప్పటికీ కొన్ని సంఘాలలో ఈ ఆచారముంది. దీన్నే "కన్యాశుల్కం" అంటారు. కాటికి కాళ్లు చాఉకొన్న ముసలివాడుకూడా ధనమిచ్చి పసిపిల్లను పెండ్లాడేవాడు. ఈ దురాచారము పూర్వం కూడా వుండేది. అందుకే ధర్మశాస్త్రకారులుఈ పద్ధతిని దూషించినారు.

"కన్యాం యచ్ఛతి వృద్ధాయ నీ చాయ ధనలిప్సయా

కురూపాయ ఆకులీనాయ! సప్రేతోజాయతేనరః!!

(ఎవడైతే ధనాశతో తన కన్యను ముసలివాడికీ, కురూపికీ, కులహీనునికి ఇచ్చి వివాహం చేస్తాడో వాడు తండ్రి కాడు. (పేతం) ఈ దురాచారాన్ని ఖండిస్తూ గురజాడ అప్పారావు గారు కన్యాశుల్క నాటకాన్ని రచించెను. ప్రాచీన కాలంలో ఎక్కువగా ప్రౌఢ వివాహములు జరుగుతుండేవి. అనగా రజస్వల ఐన స్త్రీకి వివాహం చేయటం. రజస్వల ఐనా మూడు సంవత్సరాల తర్వాత తండ్రి ఆమెకు వివాహం చెయ్యకపోతే తనకు అనుకూలుడైన వరుణ్ణి వివాహం చేసుకోనేఅధికారం వున్నదని మనువు అన్నాడు. ఇంతేకాక ఇంకో మాట గూడా చెప్పినాడు.

"కామమామరణాత్ తిష్ఠేత్ గుణహీనాయ తద్వరం" (గుణహీనుడిని పెళ్లి చేసుకోవటం కంటే ఆమె ఆజన్మాంతమూ బ్రహ్మచారిణిగావున్నా తప్పులేదు)త్వరగా పిల్లకుపెండ్లికావాలని ఎట్లాంటి వాడికైనా ఈరాదు అని మనువు అభిప్రాయం. అధర్వణ వేదంలో "బ్రహ్మచర్యేణ కన్యాయువానం విందతే పతిం" స్త్రీ గూడా బ్రహ్మ చర్యం చేస్తూ ఉత్తముడూ యువకుడు అయిన వరుణ్ణి వరిస్తుంది.) అని చెప్పబడింది. యాజ్ఞవల్క్య. పరాశర స్మృతులలో కూడా కన్యలు కులవధువులు, బ్రహ్మవాదినులు అని రెండు విధాలుగా ఉండేవారని చెప్పబడింది. కేవలం బ్రహ్మచారులుగా ఉంటూ ఉపనయనం చేసుకుని వేదాలుచదివి ఆధ్యాత్మిక చింతనతోతత్త్వవేత్తలుగా ఉండేవాళ్లు బ్రహ్మవాదినులు. తగిన వరుణ్ణి వివాహం చేసుకునేవాళ్లు కులవధువులు, బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్య మహర్షితో వాదించి ఆయన ప్రశంసించిన "గార్గి" నలభై యేండ్ల బ్రహ్మవాదిని, మహాభారతంలోఒక కథ ఉంది. "సులభ" అనే ఒక రాజుకుమార్తె వివాహం చేసుకోలేదు. జనకుడు మహాయోగి అని తెలిసి అతని ఆస్థానానికి వస్తుంది. అతని శక్తిని పరీక్షించడానికి పూనుకుంటుంది. జనకుని మనస్సే చంచలమయ్యేటట్లు చేస్తుంది. జనకుడు భయపడిపోతాడు. అది ఆమెకుచేష్ట అని గ్రహిస్తాడు. ఆమెకు చివాట్లు పెడ్తాడు. అందు అమె చలించకుండా నిలిచి నేను క్షత్రియ కన్యను తగినవరుడు లేక పెండ్లాడలేదు. నీవంటిఉత్తమున్ని కోరడం తప్పా?" అంటుంది. జనకుడు. తల్లి/ నామీద దయతలచి నన్ను వదలి పెట్టు అని ప్రార్థిస్తాడు. అంతటి శక్తి శాలినులైన బ్రహ్మవాదినులు ఉండేవారు.

కన్యాదానం అన్నిదానాల వంటిదికాదు. ప్రత్యేకమైంది. ఏదానమైనా ఇచ్చేటప్పుడు కర్త నీళ్లు విడుస్తూ "తుభ్యమహం సంప్రదదే నమమ నమమమ" అంటాడు అంటేనీకు ఈ దానం ఇస్తున్నాను. ఇంక దీనిమీద నాకు అధికారం లేదు అని అర్థం. దాన శబ్దానికి నిర్వచన మేమంటే"స్వతం విహాయ పరస్వత్వాపాదనం దానం" ఒక వస్తువు మీద ఉన్న తన అధికారాన్ని వదులుకొని అందులో ఇతరుని అధికారం ప్రవేశపెట్టం దానమంటారు. కన్యాదానం చేస్తూ తండ్రి "కన్యా కనక సంపన్నా। దాస్యామి విష్ణవే తుభ్యం పిత్రూణం తారణాయవై" అంటారు. ( నాయనా ఈమెనునీకుఇస్తున్నాను. ధర్మంలో కానీ, అర్థంలో కాని కామంలోకాని ఈమె కాకుండా ఇతరులతో చరించరాదు.) వరుని సమాధానము "నాతి చరామి".

(ఆమెను కాదని చరించను) అని అగ్నియెదుట ప్రమాణం చేస్తాడు. ఈ వివాహం ఏదో కీచులాటకువిడాకులతో తెగిపోయే బంధం కాదు. శాశ్వతమైనట్టిది. జీవితాంతంకష్ట సుఖాలో బాగస్వాములై దంపతులుగాకొనసాగేదృఢమనుష్కులు కావడం వల్లనే వీరికి ఉత్తమ సంతానం కలుగుతుంది, ఇతర దేశాలలో ఈక్రియకు ఇంత నేపథ్యం లేదు.

ఈ సంస్కారంలో ప్రతిఒక్క ఘట్టమూ మహత్వపూర్ణమైనది రెండు ఆత్మలు తమ భిన్నత్వాన్ని పోగొట్టుకొని ఒకేజీవనాన్ని రూపొందించుకోవడానికి సంకల్పం చేస్తాయి.

"సమంజంతువిశ్వేదేవాః॥ సమాపోహృదయానివౌ ।

సంమాత: సంధాతా : సముదేష్ట్రీ దధాతునౌ॥ (ఋగ్వేదం)

(ఇక్కడున్న విద్వాంసులందరూ బాగా తెలుసుకోండి. మా హృదయాలు జలంలో కలసిన జలంవలె ఒక్కటై ఉన్నాయి. ప్రాణశక్తీ - జగత్కర్తా వేదోపదేశికుడు అయిన ప్రభువుమమ్ములను చక్కగా ఒక్కటిగా కలిపి ప్రీతితో స్థిరంగా ఉంచని) ఇప్పటినుండి భార్యాభర్తలు ఏక వాక్యంతో సంసార జీవితమూ, ధర్మాచరణమూ చేస్తూ జన్మసాఫల్యం పొందుతారు. మన వివాహ సంస్కారం ఇంత పవిత్రమైంది. ఉత్తమ సంతాన లాభమే వివాహమునకు ప్రధాన ఫలము.

**14. వానప్రస్థం - (మహావ్రతం)**

మానవుడుధర్మార్థ కామమోక్షాలు అనే నాలుగు పురుషార్థాలు సాధించడానికి నాలుగు ఆశ్రమాలను ఆశ్రయించవలె. అందులో బ్రహ్మచర్య - గృహస్థమాలు అనే రెండూశ్రమాలు జరిగిన సంస్కారాలలో గడిచిపోయి, బ్రహ్మచర్యంలో ధర్మపురుషార్థాన్ని గృహస్థాశ్రమంలో అర్థ-కామ పురుషార్థాలనూ సాధించివాడై ఇంక మోక్ష పురుషార్థం సాధించవలెఅందుకు వానప్రస్థ - సన్యాస ఆశ్రమాలు రెండు అవసరం.

వివాహం అయి కొడుకులు, మనుమలు కలిగిన తరువాత వాళ్లకు గృహ బాధ్యతలుఅప్పగించి భార్యతో సహా అరణ్యానికి వెళ్లి మోక్షాపేక్షలో మహావ్రత దీక్ష పొందడమే ఈ సంస్కారము. ముసలి తనంలో తన సహచరి అయిన భార్య కోడలితో కుస్తీపట్లుపడుతూ దుఃఖ జీవనం చేయకుండా ఆమెను తనతో తీసుకొని

పోయి తన శిష్యురాలిగాచేసుకొని మంత్రోపదేశం చేసి ఆధ్యాత్మిక సాధనల మీద ఆమె దృష్టిని మళ్ళించి అత్యున్నతికి మార్గం చూపించాలి.

ఏకాంత వాసము, ఏకాగ్రతా సాధన, విరాగాలతోతత్త్వ విచారమూ చేస్తూ ఈ ఆశ్రమంలో గడుపవలెను.

"బ్రహ్మచర్యాశ్రమం సమాప్య గృహీభవేత్।

గృహీభూత్వావనీ భవేత్। వనీభూత్వా ప్రవ్రజేత్॥(శతపథబ్రాహ్మణం)

(బ్రహ్మచర్యాక్రశమం ముగించి గృహస్థాశ్రమాన్ని దాన్ని ముగించి సన్యాసాన్ని స్వీకరించవలెను). భార్యతో కలిసి ఉన్నా బ్రహ్మచర్యవ్రతమూ ఇంద్రియ జయమూ సాధించవలెను. భార్య ఆధ్యాత్మికంగా ఒకస్థాయికి చేరుకున్నాక, తాను పూర్తిగా ఇంద్రియజయం సాధించిన తరువాత భార్యను కొడుకూ కోడలికీ అప్పగించి ఆమె అనుమతితో సన్యసించవలెను.

ఈ సన్యాసము మూడు విధాలుగా ఉన్నది వరుసగా బ్రహ్మచర్యం గార్హస్థ్యం, వానప్రస్థం, అనే మూడాశ్రమాలు అనుష్టించి వృద్ధావస్థలో సన్యాసం గ్రహించడం క్రమ సన్యాసం అంటారు. ఇదొక విధం ఎప్పుడు గట్టి వైరాగ్యం కలుగుతుందో అప్పుడుఅంటే వానప్రస్థం లేకుండానే సన్యాసం తీసుకోవడంమూడవ విధానం.

**రెండవ విధం :**

సన్యాస దీక్ష స్వీకరించినతరువాత నీళ్లలో మునిగి ప్రమాణం చేస్తాడు. "నేను సంతానం మీద ప్రేమను, ధనం మీద ఆశను కీర్తిని పరిత్యజించినాను. స్నానం చేసి కావిరంగు బట్టలు దండము ధరిస్తాడు. రాగద్వేషాలకు అతీతుడై దేశాటనం చేస్తూ ఆధ్యాత్మ జ్ఞానాన్ని ప్రచారం చేస్తాడు. అన్ని ధర్మాలకూ అతీతుడై సర్వభగవచ్చింతనా పరుడై తిరుగుతూ ఉంటాడు. ఈ సంస్కారంతో మానవ జన్మకు సార్థక్యం లభిస్తుంది. వానప్రస్థ సన్యాశ్రమాలతో మోక్షపురుషార్థం సాధ్యమవుతుంది. "గ్రామైకరాత్రం దినమైకభుక్తం" సన్యాసి దినమొక గ్రామంలో రాత్రి గడుపుతూ దినం ఒక పూట భోజనంచేస్తూ భిక్షాటనంతోజీవితం సాగించవలె. ఉపాసన ద్వారా ఇంద్రియ జయము, చిత్తవృత్తి నిరోధము, జ్ఞానం వల్ల సమబుద్ధి, నిష్కామకర్మాచరణ వల్ల భూతసేవ బ్రాహ్మ ప్రాప్తి లభిస్తుంది. ఇదే సన్యాస సంస్కారం వల్ల కలిగే పరమప్రయోజన. గర్భాదాన సంస్కారంతో ఉత్తముడుగా పుట్టి క్రమంగా అన్ని

సంస్కారాల వల్ల శారీరంగా మానసికంగా పవిత్రుడై స్థిరలక్ష్యంతో మోక్షమును పొందగలుగుతాడు.

**16. అంత్యేష్టి :** మరణించిన తరువాత శవమునకు చేసే సంస్కారమును అంత్యేష్టి అంటారు. మన సంస్కారాలు "నిషేకాది స్మశానాంతాః" గర్భాదానం మొదలు మరణంవరకు జరుపబడుతాయి. కొందరు ఆ నిర్జీవశరీరాన్ని గుంతలో పూడ్చి పెట్తారు. కొందరు చితిపేర్చి కర్రలతో కాలుస్తారు. అప్పుడు అంత్యకర్మలు జరుగుతాయి. కొన్ని సంప్రదాయాల ప్రకారం శవదహనం చేసేద్విజాతులుఅంత్య కర్మలుచేస్తారు. పదిరోజులు నిత్య విధులు చేస్తారు. పదవ నాడు బంధువులందరూ ధర్మోదకాలు విడుస్తారు. ఏకోద్దిష్టము. సపిండీ కరణము చేస్తారు. వీటి ఉద్దేశమేమంటేజీవుడు శరీరాన్ని వదలి ఇంకొక శరీరాన్ని ధరించేలోగా వాడి ప్రేతాత్మకు కొన్ని సంస్కారాలు జరగాలి. ఆ జీవుడు ఇంకా ఆ వాతావరణంలోనే ఉంటాడు. అందువల్ల ఆత్మీయులు "తన ఋణవిమోచనార్థం ఏతద్ధర్మోదకముపతిష్ఠతు" అని పలుకుతూ మృతునిఉద్దేశించి 3 సార్లు నీళ్ళు వదులుతారు. "ఓమృతుడా ఇప్పటినుంచీ నీకూ మాకూ ఏలాంటిసంబంధములేదు." అనిఆవాక్యాలకుఅర్థం. ఈ మాటలు విన్న ప్రేతాత్మ తనతో సంబంధం తెంచుకున్న వీళ్ళతో నాకేమిపని అని భావించి అనంతర స్థితికి వెళ్ళిపోతుంది. ఇది ఈ అంత్యేష్టి ఉద్దేశ్యము.

ఈ పదహారు సంస్కారాల వల్ల స్మృతి కారులు చెప్పినట్లు గర్భాదానం నుంచీ అంటేమానవుడు పుట్టక ముందునుంచే పవిత్ర సంస్కారాలు ప్రారంభమై తక్కినసంస్కారాలతో క్రమంగాపెరిగి పవిత్రతను సంతరించుకొని బ్రహ్మ పదవికి అర్హుడవుతాడు. పవిత్రమైన శరీరం గూడఅంత్య సంస్కారంతో చరితార్థమవుతుంది. ఈ సంస్కారాలు మహర్షులు మనకుప్రసాదించిన మహావరాలు. వీటిని గ్రహించి ఆచరించి కృతార్థులము కావలెనని ఆశిస్తున్నాను. నాకీ సదవకాశం కల్పించిన "అన్వేషణ" సంస్థకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

